# రమణ భాషణములు నాలుగవ సంపుటం

## భాషణములు 301

ఒక పెద్దమనిషి సోత్సాహంగా భగవాన్ ఉపదేశాల ననుసరించటంలో తన అనుభవాలను ఏకరువుపెట్టుతూ, శ్రీ భగవాన్లాగే తానూ సోమవారం నాడే పుట్టాననీ, ఇద్దరి పేర్లూ ఒకటేనని ప్రకటించాడు భగవాన్ కలిపారు - "ఇరువురిలో ఆత్మగూడ ఒకటే."

## భాషణములు 302

ఉపదేశమంజరిలో అత్యంత వైరాగ్యం పరిణత శిష్యుని లక్షణంగా పేర్కొనబడింది. తిరుచనాపల్లినుండి వచ్చిన యువకుడొకడా విషయం తెలియగోరుతూ అడిగాడు

వైరాగ్యమంటే ఏమి? ప్రాపంచిక వ్యవహారాల్లో అనాసక్తి, ముముక్షుత్వమూ, అంటే అదే కదా?

మహర్షి: అది లేనివారెవ్వరు?

ప్రతివాడు ఆనందం కోరుతాడు. కాని శోకముతో కూడిన వినోదాలను సుఖమని భ్రాంతి చెందుతాడు. భ్రాంతితోడి ఆ ప్రవృత్తి వలన వచ్చే దుఃఖము క్షణభంగురము. ప్రపంచంలో సుఖదుఃఖాలు ఒకటివెంట మరొకటి వస్తూనే ఉంటాయి. దుఃఖము ఇచ్చేవి, వినోదము ద్వారా సుఖము ఇచ్చే వాటిని గురించి విచక్షణ చేసి, ఆనందము కల్గించే మార్గమును మాత్రమే ఎన్నుకోవడం వైరాగ్యం. అటువంటి వ్యక్తి ఏదిచేస్తే దానివెంట బాధరాదో పరిశీలించి అందు మగ్నుడు అవుతాడు. అటుకాకపోతే ఒకడుగు ఇహంలో, మరొకటి పరంలో పెట్టి, రెంటికి కాకపోతాడు.

గురువొనర్చే కార్యమేమని ప్రశ్న.

మహర్షి తానై తనకు తగిన సాయంచేసుకోలేనివాడుగా, దుర్బలునిగా గుర్తించి గురురూపాన బలవత్తర శక్తిని కోరుతాడు.

## భాషణములు 303

శ్రీ కె.ఆర్.వి. అయ్యర్ నాద విషయంగా విపుల వివరణం కోరారు.

మహర్షి: ధ్యానించేవాని కది తెలియవస్తుంది. నాదాలు పది విధాలు, చివర ఉరుములాంటి శబ్దంతో అతడు లయమౌతాడు. అది వాని, నిత్య సహజస్థితి. నాదము, జ్యోతి, విచారము ఇవి తీసుకువెళ్ళే గమ్యమొకటే. విచారము ప్రత్యక్షము, మిగిలిన రెండూ పరోక్షము.

భక్తుడు: మనస్సు కొద్ది సేపే శాంతంగా ఉండి, అంతలో విజృంభిస్తుంది. ఏమి చేసేది?

మహర్షి: పలుమార్లు కలుగుతున్న శాంతిని స్మరించుకోవాలి. ఆ శాంతి నీ సహజస్థితి. అది నిత్యము ఎడతెగని అభ్యాసం వల్ల, శాంతి స్వాభావికమౌతుంది.

దానిని "స్రోతస్సు" (ప్రవాహము) అంటారు. అదే నీ సహజ స్వభావము. నాదమూ, రూపదర్శనమూ (ఫోటిసమ్) మొదలైనవి, త్రిపుటిని (జ్ఞాత, జ్ఞేయము, జ్ఞానము) ఊహిస్తాయి. ఆత్మవిచారధార శుద్ధ త్రిపుటి (undifferentiated triad).

## భాషణములు 304

ఒక స్విట్జర్లాండ్ వనిత తనకు కల్గిన రూపదర్శనము నొకదానిని వర్ణించింది. కన్నులు తెరచియున్నప్పుడే, ఆమెకు శ్రీ భగవాన్ ముఖం కనిపించింది. అది దివ్యములు, వికసించి ఉన్న ఎన్నో పూలతో అలంకృతమైయుంది. శిశు ముఖమువంటి ఆ ముఖము ప్రేమతో తన్నెంతో ఆకర్షించింది.

మహర్షి: ఆ దృశ్యము నీ మనస్సులోనిది. దానికి కారణము నీ ప్రేమ. పాలంటన్కు నేను బహుదీర్ఘదేహుడుగా కనిపించానట; నీకు శిశువు రీతిగా కనిపించాను. రెండూ అభూతదృశ్యాలే. (visions)

(ఆ వనిత చెప్పింది: "పాలంటన్ నన్ను అడిగాడు, నాకేమైనా ఆధ్యాత్మిక అనుభవాలు ఇక్కడ అయ్యేయా అని. నాకేమీ అవలేదని చెప్పాను. కాని ఇప్పుడు అది జిగరది.")

మహర్షి: ఈ దృశ్యాలను చూసి మోసపోకు.

భక్తురాలు: ఎవరైనా కొన్ని వేలమైళ్ళ దూరంనుండి, యూరోపునుండి, మీ సాయమర్థిస్తే ....

మ: యూరోపు ఎక్కడుంది? నీలోనే గదా?

భ: 'నే నిక్కడికి వచ్చాను. మహర్షి అక్కడికి రావలెనని, నా కోరిక' అంటూ ఆమె చిరునవ్వు నవ్వింది. కొంత సేపందరూ నిశ్శబ్దంగా ఉన్నారు.

మ: నీవు చూచేది భౌతిక కాయం. దానికి పరిధులు కన్పిస్తాయి. ఈ స్థితికి కాలదేశాలు వర్తిస్తాయి. స్థూలదేహాన్నెంచేంత కాలమూ, భేదములు, బహురూప శరీరములుగా గోచరిస్తాయి. అట్లుగాక మహర్షిని గూర్చిన యథార్థజ్ఞానము అన్ని సంశయాలను పోగొడుతుంది.

నీవిప్పుడిండియాలో ఉన్నావా? ఇండియా నీలో ఉందా? ఇప్పుడు గూడ నీవు ఇండియాలో ఉన్నావన్న భావన పోవాలి.

ఇండియా నీలో వుంది. దానిని పరీక్షించాలంటే, నీ నిద్రను పరిశీలించు. నిద్రలో నీవు యూరోపులోనో ఇండియాలోనో ఉన్నావనుకొన్నావా? నీ వప్పుడూ, యిప్పుడూ కూడా ఒకటే.

దేశము (స్పేస్) నీలో ఉంది. దేశంలోనిది భౌతిక కాయం; నీవుగాదు. అభూతదృశ్యం చూచినప్పుడు పాలబ్రంటన్ కండ్లు మూసుకొని ఉన్నాడు. నీకండ్లు తెరచుకొనే ఉన్నానన్నావు.

భ: అవును. నేనట్టి దృశ్యాల నెప్పుడూ చూచియుండలేదు. బ్రంటన్ సైకిక్ (psychic).

కొంతసేపయ్యాక ఆమె అట్టి దృశ్యాలు కనపడడం శుభస్కరమా, కాదా అని అడిగింది.

మ: శుభప్రదాలే. బహుశః నీవు శిశువును గురించి ఆలోచిస్తున్నావేమో, నీ

దృశ్యంలో శిశువు కనబడటానికి... భ: అవును శివుని గురించి మాత్రమే, ఆయన యొక్క శిశుతుల్యమైన వదనం గురించి …

మ: అదీ కారణం.

భ: శివుడు లయకారుడుగదా? (శిశువుకాదు కదా అని అర్థం)

మ: అవును దుఃఖాల సంహారకుడు.

మరికొంత సేపయ్యాక, శ్రీ భగవాన్ -- నీవింక కొంతసేపటికి నిద్రిస్తావు. తెల్లవారి లేవగానే "నేను చక్కగా, హాయిగా నిద్రపోయా" నంటావు. నిద్రలో వున్నది నీ సహజస్వభావం. అది ఇప్పుడూ సాగుతూనే ఉంది; కాకుంటే అది నీ స్వరూపం కాదు. ఇప్పుడు కూడ ఆ నిద్రాస్థితి నలవరచుకో;

అదే శివుడు.

మనకొక రూపున్నదా? శివుని రూపము తలంపక, ముందుగా ఆ విషయం ఆలోచించు. నిద్రలో నీవు లేవా? అప్పుడే రూపమైన నీ స్పృహలో ఉందా? నిద్రలో నీ రూపులోనే నీ వున్నావా? అది లేకగూడ, నీ వున్నావు. ఆ నిద్రలోని "నేను" ఇప్పుడూ ఉంది. నీ నిద్రానుభవంలో నీవు దేహం కావు. ఇప్పుడూ నీవంతే .... అంటే దేహం కాకుండానే వున్నావు. దేహం లేనందున నిద్రలో నీవు సుఖంగా వున్నావు. ఆ నీవే ఇప్పుడున్నది గూడ. సుస్థిరంగా నిలిచియుండేదే యథార్థ స్వభావము. నిద్రలో దేహం లేదు; కాని సౌఖ్యానుభవం ఉన్నది. అది యిప్పుడూ నిలిచి ఉంది. ఆత్మకు దేహం లేదు. ఈ విధంగా నీకే శరీరం లేకుంటే, శివునికి శరీరం ఎక్కడిది? నీకు దేహం వుంటేనే శివునికి ఉంటుంది. నీకు లేకుంటే అతనికీ ఉండదు.

భ: అయితే ఆయన శివుడెట్లైతాడు?

మహర్షి: శివుడంటే ఆనంద స్వరూపుడన్న మాట - శుభస్వరూపుడని అర్థం. ఆమె చాల తృప్తితో వెళ్ళిపోయింది.

# భాషణములు 305

దర్శనార్థము వచ్చిన వారు తమలోతాము మాట్లాడుకుంటూ, వారిలో ఒకరు ఇలా అన్నారు. "మనకు సాంప్రదాయకమైన ఉపదేశాలతో పరిచయమున్నా భగవాన్ ఉపదేశాలు పాటించలేకపోతున్నాం. మన పద్ధతులతో పరిచయం లేని విదేశీయులు శ్రీభగవాన్ ఉపదేశాలను అంత తేలికగా ఎలా అనుసరించగల్గుతున్నారు? లోపాలు ఉన్నప్పటికీ వారిని వారు అర్థం చేసుకోవడానికి చేసే ప్రయత్నాలు పట్ల శ్రీభగవాన్ సానుభూతి చూపి సాధన సామాగ్రి లేనందువలన కూడా వారిని కరుణించినట్లు కనిపిస్తోంది.

కొంతసేపటికి భగవాన్ ఇలా అన్నారు - అభూత దృశ్యాలు లేకపోయేదానికన్న కలగడమే మేలు. వాళ్ళకా విధంగానైనా ఈ విషయాల్లో ఆసక్తి కల్గుతుంది. వారెట్టి విజాతీయ భావనల నొంతకూ పోరు. ఆసక్తి కల్గితే దాన్నే అంటిపెట్టుకుంటారు. ఆ దృశ్యాల సుగుణం అలాంటిది.

శివప్రకాశం పిళ్ళైకూ ఇలాగే ఒక దృశ్యం కన్పించింది. దాన్ని ప్రస్తావిస్తూ భగవాన్ "ఇట్టి దృశ్యాలు బాహ్యవిషయాలు గావు. అవి లోపలే గోచరిస్తాయి. బయటిపైతే ద్రష్టలేకున్నా అవి తమ ఉనికిని ప్రకటించి ఉండవలె. కాబట్టి వాని స్థితి నిశ్చయించేదెవరు ... ద్రష్టయే."

## భాషణములు 306

భక్తుడు: ధ్యానించటానికై ఏదైనా స్థూలరూపము ఉండాలి. "నేను"పై ధ్యానించే దెలాగ?

మహర్షి: మనం రూపాలలో పాతుకొని పోయాము కనుక ధ్యానానికి గూడ స్థూలవస్తువు అవసరమౌతున్నది. మనం చింతన దేని గూర్చియో, అదే చివరకు మిగిలేది. ధ్యానం ఇతర చింతనలను తీసివేస్తుంది. ధ్యానం నీ కావశ్యకమైనంత కాలం, ఇతరాలోచన లుండనే ఉంటాయి. నీవు ఉన్నదెక్కడ? ఉన్నావు గనుక ధ్యానిస్తావు. ధ్యానం చేసేవాడే ధ్యాని. ధ్యానం అతడున్న చోటనే చేయవలసి ఉంది. ధ్యానం ఇతరాలోచనలను తొలగిస్తుంది. మూలంలో నీవు మగ్నం కావాలి. ఒక్కొక్కప్పుడామగ్నత - నిద్రలో, మృతిలో, మూర్ఛలో వలె -- అయత్నంగానే లభిస్తుంది. కాని తెలిసియుండి మూలంలో మగ్నం కావటమే చింతన (ధ్యానం). అది సాధిస్తే, నీకు మృతి మూర్ఛాదుల భయం అంతరించి పోతుంది.

మరణమంటే భయమెందుకు? మృతి అస్థితిగాదు. గాఢనిద్ర అంటే ఎందుకు ష్టం. మృతి అంటే ఇష్టం ఎందుకు లేదు? నీ విపుడాలోచించడం లేదా? నీవు ఇప్పుడుండలేదా? నిద్రలో మాత్రము నీవు లేవా? చిన్నబిడ్డ కూడ సుఖంగా హాయిగా నిద్రపోయానంటుంది. తనకు తెలియకున్నా, బిడ్డ నిద్రలోనూ తానున్నానని అంగీకరించటం, దాని తాత్పర్యం. కాబట్టి తెలివి (చిత్) మన యథార్థస్వభావము. నిశ్చేతనంగా మనముండలేము. ఎరుకకు కొన్ని ఎల్లలు కల్పించుకొని నిద్రలో ఏమీ తెలియలేదు అంటాము. జగత్తు దేహాదులు మనలో ఎంతగా పాతుకొని పోయాయంటే, ఈ సాపేక్ష చైతన్యాన్ని ఆత్మగా గణిస్తాము. ఎవరైనా నిద్రలో తాను జడంగా ఉంటానంటాడా? ఆ అనేది యిప్పుడూ, మెలకువలో. సాపేక్ష జ్ఞానము యిది. అందువల్లే, ఎప్పుడూ చెప్పినా సాపేక్ష చైతన్యాన్నేగాని శుద్ధచైతన్య ప్రస్తావనే లేదు. సాపేక్ష చైతన్యానికి, అచేతనకు గూడ అతీతమైనది శుద్ధ చైతన్యము. మరల తిరువాచకం ఉదాహరిస్తూ భగవాన్ -- ప్రధాన యోగులు నలుగురూ

మొట్టమొదట పద్యంలోనే తమ తమ అనుభవాలను వివరించారు -- 1. నిర్గుణధ్యానము, 2. విరతిలేని స్మరణ, 3. తలెయత్తని తలపు, 4. అహంమిథ్య, ఆత్మసత్యం -- అన్నిటి తాత్పర్యమూ ఒకటే.

భక్తుడు: కాని ఈ సత్యం అనుభవ గోచరం కాలేదు.

మహర్షి: అది కాలక్రమేణ అనుభవగోచరం అవుతుంది. అంతవరకు భక్తి ఉంటుంది. "ఒక్క క్షణం కూడా నీవు నా మనస్సును వదలవు". అతడు ఏ క్షణంలోనైనా నిన్ను వదులుతాడా? నీ మనస్సును అంతటా తిరగనిచ్చేది నీవే. ఆయన ఎప్పుడూ స్థిరంగా ఉంటాడు. నీ మనస్సు స్థిరంగా వున్నప్పుడు "ఆయన ఒక క్షణం కూడా నా మనస్సును వదలడు" అని నీవే చెప్తున్నావు. ఎంత హాస్యాస్పదం.

## భాషణములు 307

మైసూరు వాసి, శామణ్ణ - దయచేసి అహం-స్ఫురణ (నేను-నేను) జ్ఞానమును వివరించండి.

మహర్షి: 'నేను' నిద్రలో తెలియదు. మెలకువలో అది దేహంతో, జగముతో - అనాత్మతో కలిసి గోచరిస్తుంది. ఇట్లు కలిసిన 'నేను' -- అహం, అహంవృత్తి ఆత్మను మాత్రమే సూచించేదైతే, అది "అహంస్ఫురణ". ఇది జ్ఞానులకు సహజం. దానిని జ్ఞానులు జ్ఞానమనీ, భక్తులు భక్తియనీ వర్ణిస్తారు. అది నిద్రలో గూడ నిత్యస్థితమైనా, సులభంగా గోచరించదు. నిద్రలో అది అంత త్వరగా వ్యక్తం కాదు. మొదట దానిని జాగ్రత్తులో గుర్తించవలసి ఉంది. మూడవస్థల్లోనూ మన యథార్థస్థితికి అదే ఆధారం. జాగ్రదవస్థ లోనే అన్ని యత్నాలూ చేసి, ఆత్మను ఇందే, ఇప్పుడే కనుగొనాలి. మూడవస్థల్లోనూ అబాధితమై అది నిరతంగా వెలిగేదని, తరువాత తెలిసివస్తుంది, అనుభవానికి వస్తుంది. ఆ విధంగా అది అఖండాకారవృత్తి. అంతకన్నా స్పష్టమైన పదము లేనందున దానిని 'వృత్తి'యనే వ్యవహరించారు. కాని అది కేవలం వృత్తి మాత్రమని గ్రహింపరాదు. అఖండాకారమైనపుడు దానిని 'సముద్రం వంటి నది' అన్నారు. ఇది అర్థం లేని పోలిక. వృత్తి అల్పకాలము -- అంటే చైతన్యం పరిమితము, నిశ్చితవర్తనమూ - అంటే తలపులుగా, ఇంద్రియము లాదిగా విభక్తమైన

శుద్ధచైతన్యము. వృత్తి మానసిక చేష్ట; కాని చైతన్యధార (ధారావాహి చైతన్యము) మానసాతీతము, ఇది జ్ఞాని, ముక్తుడు అయిన వాని ఆద్య, సహజస్థితి. ఇది అవిరళానుభవము. సాపేక్ష జ్ఞానం అడగిపోగా అది ప్రతిష్ఠితమై మిగిలి ఉంటుంది. అహంవృత్తి, విభక్తము; అహంస్ఫురణ, (నేను - నేను జ్ఞానము) అవిభక్తము, అవిరళమూ, ఆలోచనలు ఆగినంతనే జ్యోతి ఉజ్జ్వలంగా ప్రకాశిస్తుంది.

## భాషణములు 308

అంటరానితనంపై ప్రశ్న.

శ్రీభగవాన్ అన్నారు: ఆత్మకానిది 'అంటరానిది'. సంఘంలోని అంటరానితనం మానవ కల్పితం. పైన చెప్పినది సహజమైనది, దివ్యమైనది.

భక్తుడు: అంటరాని వారిని ఆలయాలలోకి అనుమతించవచ్చునా?

మహర్షి: దానిని నిర్ణయించేవారున్నారు.

విష్ణు అవతారాలను గూర్చి ప్రశ్న వచ్చింది.

మ: మొదట మన అవతారం ఏదో తెలుసుకుంటే, ఇతర అవతారాల సంగతి తెలుస్తుంది.

ఆపై, ఈశ్వరుని గూర్చి ఒక ప్రశ్న.

మ: ఈశ్వరుడున్నాడా అనేది, ఈశ్వరుని గూర్చిన మన దృక్పథం ప్రకారం ఉంటుంది. ఈ అభిప్రాయం ఎవరిదో ముందు తెలుసుకోండి. ఆ భావన, భావించే వానిని బట్టి వుంటుంది. మొదట నీవెవరో తెలుసుకో. ఆ సమస్య తానుగా పరిష్కారం అవుతుంది.

## భాషణములు 309

భక్తుడు: 'అహం బ్రహ్మాస్మి'కి 'బ్రహ్మైవాహం'కి భేదం ఏమి? మహర్షి: మొదటిది ప్రత్యక్ష వృత్తి (సూటి అనుభవం), తరువాతది పరోక్షజ్ఞానం. మొదటిది అహం (నేను) యొక్క సాక్షాత్కారంతో మొదలైతే, తరువాతది - విన్నదీ, ఆత్మకి అన్యంకానిదీ అయిన బ్రహ్మంతో మొదలవుతుంది. ఒకవేళ సాక్షాత్కారం అయినది అదే అయితే.

## భాషణములు 310

గ్రీన్లౌస్: అక్టోబర్లో ఆశ్రమం వదలి వెళ్ళాక ఓ పదిరోజులు పాటు భగవాన్ శాంతిలో మునిగి వున్నాను. పనులలో నిమగ్నమై వున్నంతసేపు కూడా అంతర్గతంగా ఐక్యశాంతి ప్రవహిస్తూనే ఉంది. అది ఎలాగంటే, పేలవంగావున్న ఉపన్యాసం మధ్యలోని మగత నిద్రలో పనిచేసే జంట ఎరుకలా వుండేది. అది క్రమేపీ క్షీణించింది, పూర్తిగా. మళ్ళా బుద్ధిహీనత ఎప్పటిలా వచ్చిపడింది.

ప్రత్యేకంగా ధ్యానం చేసుకోడానికి పనులు అవకాశం ఇవ్వడం లేదు. మరి, పని సమయాల్లో తెంపులేకుండా 'నేనున్నాను' అనే జ్ఞప్తి, దానిని భావించుకోవడం సరిపోతుందా?

మహర్షి: మనస్సు దృఢపడితే అది స్థిరమౌతుంది. అభ్యాసంచేత మనసు గట్టిపడుతుంది. అలా బలపడిన మనసు ధ్యానధారను అందుకోగలుతుంది. అప్పుడు పనులలో మునగడం, మునగకపోవడంచేత ఆ ధార ప్రభావితం కాకుండా, ఎడతెరిపి లేకుండా వుంటుంది.

భ: అయితే, ప్రత్యేకమైన ధ్యానం అవసరంలేదా?

మః ధ్యానం నీ నిజస్వభావం, ఇప్పుడే. ఇతర ఆలోచనలు నిన్ను చెదర గొడుతున్నాయి కాబట్టి, ధ్యానం చేయడం' అంటావు. ఆ ఆలోచనలను తుడిచివేస్తే మిగిలేది నీవు ఒక్కడివే అనగా ఆలోచనలు లేని ధ్యానం అన్నమాట. ఇతర ఆలోచనలను త్రోసివేసి అట్టి నీ నిజస్వభావాన్ని త్రోసి సాధించడానికి ప్రయత్నిస్తున్నావు. ఈ రకంగా ఇతర ఆలోచనలను తొలగించడాన్ని ఇప్పుడు ధ్యానం అంటాం. అభ్యాసం నిలదొక్కుకోగానే నీ సహజస్థితియే అసలైన ధ్యానంగా సాక్షాత్కరిస్తుంది. ధ్యానం ప్రయత్న పూర్వకంగా చేసినపుడు ఆలోచనలు మరింత బలంగా కల్గుతాయి.

దాంతో పలువురు ప్రశ్నలు గుప్పించారు.

మహర్షి కొనసాగించారు: నిజమే అన్ని రకాల ఆలోచనలు ధ్యానంలో బయటపడతాయి. అది వాస్తవమే. నీ లోపల దాగి వున్నదంతా బయట పడుతుంది. అలా బయటకు రాకుంటే వానిని నిర్మూలించేదెలాగ. అలా అవి తమంత తామే బయటపడగానే నాశనం అవుతాయి, మనోబలం చేకూరుతుంది.

దర్శనార్థి: అందరూ బ్రహ్మమే అని చెప్తారు కదా!

మహర్షి: అవును బ్రహ్మమే. కాని వారు వేరనుకున్నంతకాలం, వారికి దూరంగా ఉండటం మంచిది. అట్లుగాక అన్నీ ఆత్మయే యనుకుంటే "అందరూ" అన్న పదం అనవసరం. ఉన్నదంతా బ్రహ్మమే. బ్రహ్మకు ద్వితీయములేదు.

భ: ఋభుగీతలో ఎన్నింటినో అసత్యాలని నిరాకరిస్తూ, చివర అన్నీ బ్రహ్మమే అని, అందుచేత సత్యములనీ ఉన్నది. అదేమి?

మ: అవును, వానిని బహుళంగా చూస్తే అవి అసత్ -- కల్లలు (నిజంకాదు) వానిని బ్రహ్మంగా గుర్తిస్తే, వాని కన్నింటికీ ఆధారము బ్రహ్మమే గనుక, అవి సత్యమే.

భ: అట్లైతే, 'ఉపదేశసారం'లో దేహాదులను జడములనుటెందుకు?

మ: ఆత్మకు భిన్నంగా దేహాదులని వాని నెన్నుతున్నావు గనుక. కాని ఆత్మస్థితిలో దేహాదులన్నీ దానిలోనివే యని బోధపడుతుంది. ఆ తర్వాత ఎవ్వరూ ప్రశ్నించరు; ఎవ్వరూ వానిని జడములనీ అనరు.

భ: ఆత్మ అనాత్మనుండి వేరుచేసేది వివేకమన్నారు. అనాత్మయంటే ఏమి?

మ: నిజానికి అనాత్మయంటూ ఏదీ లేదు. అనాత్మకూడా ఆత్మలోనే వుంది. ఆత్మ తన్ను తాను మరచింది గనుక దానిని అనాత్మయని, ఆత్మ ప్రస్తావిస్తుంది. తనపట్టు తాను వదులుకొని దేనినో అనాత్మగా భావిస్తుంది, నిజంగా తనకు భిన్నముగా వేరే ఏమీలేదు.

ఆ తర్వాత వేర్వేరు సిద్ధాంతాల వారిలో చర్చ తీవ్రంగానే సాగింది.

## భాషణములు 311

మొదలైన 'నేను' అణగనే అణగుతుంది. అది వ్యక్తిపరమైన 'నేను' ….. అంటే అహంకారం మొదలు కానిది అంతం కాదు. అది, ఉన్నది - ఎప్పటికీ ఉంటుంది. అది విశ్వవ్యాప్తమైన, సమష్టి, "నేను" -- పూర్ణమైన "నేను" -- అదే ఆత్మజ్ఞానము. సాయంత్రం 5.30 గంటలకు స్విస్ వనిత భగవాన్తో మొరపెట్టుకుంది, చాలసేపు ధ్యానిస్తే తల నొప్పి వస్తుందని.

మహర్షి: ధ్యాత, ధ్యానము -- రెండు సమమని తెలిస్తే, అట్టి తలనొప్పి, అలాంటి ఏ యితర నొప్పులూ ఉండవు.

భ: అవి వేరు. అవి సమమని ఎలా అనుకోగలం?

మ: అందుకు నీ దృష్టియే కారణం. ఉన్నదొకటే. దానిలో భేదాలు లేవు. ధ్యానిస్తే సాపేక్ష జ్ఞానం మాయమౌతుంది. కాని శుద్ధచైతన్యం భాసిస్తుంది. గనుక, అది నశించదు. "స్వర్గరాజ్యం నీలోనే ఉన్న"దని బైబిల్ అనలేదా నిన్ను నీవు దేహమనుకుంటే, ఆ వాక్యాన్ని అర్థం చేసుకోవటం కష్టం. కాని నిజంగా నీవెవరవో నీకు తెలిస్తే ఆ స్వర్గరాజ్య సర్వమూ, సత్యాత్మపైన నీలోనే ఉంది. ఆ భావనలన్నీ అహంకారం మొదలైన తర్వాతివే. "దృష్టిం జ్ఞానమయీం కృత్వా, పశ్యేత్ బ్రహ్మమయం జగత్" -- దృష్టిలో లోనికి పంపి దానిని పరమమును (absolute) చేయి. బ్రహ్మమెరిగిన పిదప బయట చూడు. విశ్వమెల్లా నీ కనుభూతమైన పరమాత్మ కన్యం కాదని తెలుస్తుంది.

నీది బాహ్యదృష్టి గనుక బాహ్యాన్నే ప్రస్తావిస్తావు. అట్టి స్థితిలో అంతర్ముఖుడవు కమ్మని బోధ. ఈ లోపల అనేది నీవు బయట అని దేనినైతే నీవు కోరుకుంటున్నావో దానితో పోలిస్తే సాపేక్షము. నిజానికి ఆత్మకు వెలుపల, లోపల లేవు.

సాపేక్ష (relative) జ్ఞానానికి అలవాటు గనుక, స్వర్గం అనగానే అది పై నున్నదనో క్రిందయనో, లోనయనో వెలుపలనో అనుకుంటారు. విషయ జ్ఞానాన్ని వెదుకుతారు కాబట్టి ఈ భావాలు వస్తాయి.

నిజంగా, పైన, క్రింద, లోన, వెలుపల, అనేదే లేదు. అవి నిజాలే అయితే, అవి సుషుప్తిలోనూ ఉండాలి. నిజమైనది నిత్యము, నిరతమూ. గాఢ నిద్రలో నీకు బయట లోపల అనేది ఉందా? అలా లేదు కదా!

భ: ఏమో! నాకు జ్ఞప్తిలేదు.

మ: జ్ఞప్తి పెట్టుకోడానికి అక్కడేమన్నా ఉంటేగదా? కాని ఆ నిద్రలో నీ వున్నావని ఒప్పుకుంటావు. ఆ ఆత్మే ఇప్పుడు మాట్లాడుతున్నది. నిద్రలో అది నిర్గుణము; ఇప్పటి అవస్థలో సగుణమై నానాత్వము తాల్చింది. సత్ (నిత్యస్థితి) ఒక్కటే విషయజ్ఞానం లేనిది. అది శుద్ధజ్ఞానము. మనమందరమూ, సమ్మతించే ఆనందస్థితి అదే. ఆ స్థితిని జాగ్రదావస్థలో గూడ తీసుకురావాలి. దానినే జాగ్రత్ సుషుప్తి … ముక్తియంటారు.

భ: అహంకారమునకే పునర్జన్మ కదా?

మ: అవును. కాని పునర్జన్మ అంటే ఏమి? అహంకారం ఎప్పటిలాగే ఉంటుంది. క్రొత్త శరీరాలు కనిపిస్తాయి మరియు దానిని వహిస్తాయి. అహంకారంకే మార్పులేదు. ఒక శరీరాన్ని విడిచి వేరొకదానిని అది వెతుక్కోదు. నీ స్థూలదేహం గతే చూడు, ఏం జరుగుతున్నదో. లండన్కు వెళ్ళుతున్నావనుకో, ఎలా వెళ్తావు? ఏదో వాహనంలో రేపుచేరి, అచట నావయెక్కి, క్రొద్దిరోజుల్లో లండన్లో ఉంటావు. జరిగిందేమిటి, కదలినవి వాహనాలు, నీ దేహం కాదు. అయినా ప్రపంచంలో ఒక మూలనుండి మరో మూలకు ప్రయాణం నీవు చేశావనే అంటావు. వాహనాల గమనాన్ని నీ దేహానికి ఆరోపించావు. అలాగే అహంకారం విషయంలోనూ, పునర్జన్మలు ఆరోపితాలు. ఉదాహరణగా కలను తీసుకో. స్వప్న ప్రపంచంలోకి నీవు వెళుతున్నావా? అది నీలో చరిస్తున్నదా? ఈ రెండవదే నిజం. పునర్జన్మలూ అలాగే. అంత కాలమూ అహంకారం అలాగే ఉంది.

నిద్రలో కాలదేశములు లేవు. ఆ భావనలు, "నేను" ఆలోచన తరువాత వచ్చేవే. దానికి పూర్వం అవిలేవు. అందుచేత నీవు కాలదేశములకు కట్టుబడవు. అహంకారం, పరిమితమైన 'నేను'. యథార్థమయిన నేను నిరవధి, విశ్వవ్యాప్తమూ, దేశకాలాతీతమూ, అవన్నీ సుషుప్తిలో లేవు. నిద్రనుంచి లేచి, విషయ ప్రపంచాన్ని చూడకముందు, ఆ వ్యవధిలో ఒక చితిస్థితి (ఎరుక) ఉంది. అది కేవల స్థితి. దాన్ని తెలుసుకోవాలి.

భ: కాని దానిని నేను తెలుసుకోలేకున్నాను.

మ: అందుకోటానికది వస్తువిషయం గాదు. అదే నీవు. అనుభవించడానికి ఎవరు ఉన్నారు ఏముంది?

## భాషణములు 312

పూనావాసి వి.కె. చోల్కర్.

'నిన్ను నీవు తెలుసుకో', 'నీ లోని “నేను” ఏమో చూడు. అట్లు చేసే మార్గమేది? యాంత్రికంగా ఏదో మంత్రాన్ని సదా జపించటమా, లేదా ఆ మంత్రమెందుకు జపిస్తానో ప్రతిక్షణం స్మరించడమా?

మహర్షి: నీవు మంత్రాన్ని ఎప్పుడూ అయత్నంగా జపిస్తూనే ఉన్నావు. నిరంతరం సాగుతూన్న 'అజపం' నీకు తెలియకపోతే, జపమే శరణ్యం. యత్నపూర్వకంగా చేసేది జపం. ఆ యత్నం ఇతరాలోచనలను ఆవలద్రోయటానికే. ఆ తరువాత ఆ జపం మానసికమూ, అంతరమూ అవుతుంది. ఆపైన దాని నిత్య అజప స్వభావము తెలిసివస్తుంది. నీ ప్రయత్నమేమీ లేకనే అది తనకుతానై సాగడం నీవు గమనిస్తావు. దాని అయత్నస్థితియే నీ ఆత్మస్థితి.”

శ్రీ చోల్కర్ తనశక్తికి తగ్గట్టుగా, ఆచరణసాధ్యమైన ఉపదేశం అర్థించాడు.

మహర్షి: అది బాహ్యమూ, మరోచోట పొందడానికి ప్రయత్నించవలసింది కాదు. అది నీలోనిదీ, నిత్యమూనూ. అది సదా సిద్ధమే. కాని నీకు తెలియదంటావు. దానికై ఎప్పుడూ నీ దృష్టి అంతా దానిపై కేంద్రీకరించాలి. అంతకుమించిన ఏ యత్నమూ అక్కరలేదు. నీ యత్నమంతా ఇతరాలోచనలు వలన విక్షేపం కలగకుండా ఉండడానికే. అప్పటికి చోల్కర్ తృప్తిచెందాడు.

## భాషణములు 313

గ్రీన్లాస్: లోన దైవాన్ని అన్వేషిస్తూన్నపుడే, బాహ్యవ్యవహారాలు తాముగా జరిగిపోతూంటాయని భగవాన్ నిన్న అన్నారు. శ్రీ చైతన్యులు తాము శిష్యులకు బోధించే సమయాల్లో, దేహం మరచి, కృష్ణ విషయకంగా మాట్లాడుతూనే ఉండేవారని శ్రీచైతన్య చరితలో ఉంది. ఇక నా సందేహమిది -- వ్యవహారాలు అవే జరుగుతాయి లే అని వదలివేయవచ్చునా? వానిపై ఒక కన్నుంచాలా?

మహర్షి : సర్వమూ ఆత్మయే. నాకిది చెప్పు. ఆత్మకు నీవు వేరా? దానికి భిన్నంగా ఏ పనైనా జరుగగలదా? లేదా, దేహము ఆత్మకు వేరా? అవేవీ ఆత్మను కాదని నిలవగలిగేవి కావు. ఆత్మ సర్వవ్యాపి. కాబట్టి వృత్తులన్నీ, నీ కిష్టమైనా, కాకున్నా, అవే జరిగిపోతాయి. అదంతా అయత్నంగానే జరుగుతుంది. ఆత్మను గమనించుకోవటంలో పనుల విషయం పరికించడమూ కలిసి ఉంది.

భ: నేను గమనించకుంటే పని దెబ్బతినవచ్చు.

మ: నీవు దేహమనుకున్నావు గనుక, ఆ పని చేస్తున్నది నీవని భావిస్తావు. కాని నీపని, దేహమూ, దాని ఆచరణలన్నీ, ఆత్మకు వెలుపలి జరగవు. పనిని నీవు గమనించావా లేదా, యన్నది లెక్కలోనిది గాదు. ఒక చోట నుండి మరొక చోటికి

నడుస్తున్నావనుకో. నీవు వేసిన ప్రతి అడుగూ చూసుకుంటున్నావా? కొంత సేపటికి గమ్యంలో నీ వుంటావు .... నీ పని... నడక... నీ శ్రద్ధ అటులేకున్నా జరుగుతున్నదా? ఇతర పనుల విషయంలోనూ అంతే.

భ: మీరన్నది నిద్రలో నడచిపోయేవిధంగా ఉంది.

మ: అవును. బిడ్డ నిద్రిస్తున్నప్పుడు, నిద్రలోనే తల్లి వాని కాహారం పెడుతుంది. మెలకువలో నెంతో అంతగానే వాడు భోంచేస్తాడు. మరురోజు ప్రొద్దుట లేవగానే అమ్మతో "అమ్మా, రాత్రి నేనన్నం తిననేలేదే" అంటాడు. వాడు తిన్న విషయం తల్లికి, అచట వారందరికీ తెలుసు. కాని వాడు తిననే లేదంటాడు. నిద్రాభ్రమణం సరియైన ఉపమానమే.

మరొక ఉదాహరణం. యాత్రికుడొకడు బండిలో నిద్రపోయాడు. దారిలో ఎద్దు లొకచోట నిలుస్తాయి. కొంత నడుస్తాయి. కొన్ని చోట్ల వాటిని బండివాడు విప్పివిడుస్తాడు. నిద్రలో వానికివేవీ తెలియవు. కాని మేల్కొన్నప్పుడు వాడు వేరొకచోట ఉంటాడు. దారిలోని ఘటనలేవీ తెలియకనే హాయిగా ఉంటాడు. కాని ప్రయాణం మాత్రం పూర్తి అవుతుంది.

మనుష్యుని ఆత్మవిషయంలోనూ అట్లే. వాడేమో దేహంలో నిద్రిస్తాడు. వాని జాగ్రదావస్థ ఎద్దుల నడక. అవి నిలిచియుండటం, అతనికి సమాధి (జాగ్రత్ సుషుప్తి); అంటే వానికి విషయములు తెలుస్తున్నా, వాడేమి ఆసక్తుడు కాడు. బండికి పూన్చే వున్నా ఎద్దులు కదలవు. కాడినుండి ఎద్దుల విడిచి ఉండడానికి సమంగా అన్ని కార్యక్రమాలు వదిలివేయడం జరుగుతుంది. గనుక, ఎద్దులను విప్పడం వానికి నిద్ర.

ఇంకొక ఉదాహరణ. సినీప్రదర్శనంలో తెరపై బొమ్మలు ప్రసరింప బడ్డాయి. నడయాడే ఆ బొమ్మలు తెరను బాధించవు, తెరలో ఏ మార్పూ ఉండదు. చూచేవాడు. బొమ్మలనే చూస్తాడు; తెరను చూడడు. తెరకు వెలిగా ఆ బొమ్మలున్నవా? ఆ తెర నెవ్వరూ గుర్తించరు. ఆ తెరలాగే ఆత్మ. దానిపై బొమ్మలు, అంటే అన్ని సంఘటనలు సాగిపోతాయి. మనుజుని దృష్టి అంతా ఆ సంఘటనలపైనే గాని ఆత్మపైన లేదు. ఎప్పుడూ కూడా అతడు ఆత్మకు భిన్నంగా లేడు. వానికి తెలిసినా, తెలియకున్నా కర్మలు అవే జరిగిపోతాయి.

భ: సినిమాలో బొమ్మలను ప్రసరింపచేసే వాడొకడు ఉన్నాడు కదా.

మ: సినిమాలోనే ఏం? ఎక్కడ చూచినా, అన్నీ జడవస్తువులే, తెర, బొమ్మలు, దీపం ... చానానికి ఒక సచేతనుడు కావలె. అదే ఆత్మ విషయానికి వస్తే, చైతన్య స్వరూపం కాబట్టి స్వయం సమర్థం. దానికి వేరే చాలకు డవసరం లేదు.

పై సమాధానం సూచించిన విధంగా దేహమును చాలకునిగా తాను భావించలేదని దృఢంగా గ్రీన్స్ చెప్పాడు.

మ: దేహాదిక క్రియలన్నీ చాలకుని అవసరాన్ని సూచిస్తాయి. దేహము జడ విషయం. కనుక చేతనుడైన చాలకుని అవసరం ఉంది.

జనులు తాము జీవుల మనుకొంటారు. అందుకే శ్రీ కృష్ణుడు జీవ బోధకుడైన దైవం హృదయంలో ఉంటాడన్నాడు. నిజానికి జీవుడూ లేడు, నడిపేవాడూ లేడు. సర్వమూ ఆత్మయే. తెర, బొమ్మలు, నటుడు, చూసేవాడు, నడిపేవాడు, దీపమూ, యితరములూ అన్నీ ఆత్మయే. ఆత్మదేహము, నీవు నటుడవన్న భ్రమ, సినిమాలోని పాత్రధారిని ద్రష్టయనుకొనుట వంటిది. సినిమాలోని పాత్రధారి తాను తెరలేక నటించవచ్చా అని అడిగాడనుకో; ఆత్మకు వేరుగా తాను కర్తననుకొనే వాని విషయం అటువంటిది.

భ: ద్రష్టను, తాను చూచే చిత్రంలో పాత్ర వహించమన్నట్లున్నది. అంతకన్నా నిద్రాభ్రమణము మేలుగా వుంది.

మ: కాకికి కనుపాప (Iris) ఒకటే; వస్తువులను చూడవలెనంటే ఆ కనుపాపనే (Eye sockets) ఏకంటిలోకైన త్రిప్పుతుందని జనశ్రుతి. కనుపాప ఒకటి, కంటి కోశాలు (Eye sockets) రెండు, ఎటు చూడవలెనంటే అటు ఆ ఒక్క కనుపాపనే త్రిప్పి చూపు సారిస్తుంది.

ఏనుగు ఒకే తొండంతో శ్వాస తీసుకోవడం, నీరు త్రాగటం లాంటి ఎన్నో పనులను చేస్తుంది.

చూచుటకు వినుటకు గూడ పాములు ఒకే ఇంద్రియాన్ని వాడతాయంటారు.

ఈ రీతిగా క్రియలు, అవస్థలూ వారి వారికి, వారివారి దృష్టి అనుసరించి ఉంటాయి. సుప్త జాగృతి, జాగ్రత్ సుషుప్తి, స్వాప్నిక నిద్ర, జాగ్రత్ స్వప్నాదులన్నీ ఒక తరంలోనివే.

భ: మనం భౌతిక ప్రపంచంలో భౌతిక దేహంలో వ్యవహరించవలసి ఉంది. పని మధ్యలో నిద్రిస్తే, కాక నిద్రిస్తూ పనిచేస్తే, పనిచెడిపోదా?

మ: నిద్ర అజ్ఞానం కాదు; అది నీ స్వస్థితి. మెలుకువ జ్ఞానం కాదు; అది అజ్ఞానం. నిద్రలో పూర్ణచేతస్సున్నది. మెలకువలో పూర్ణ అజ్ఞానమున్నది. నీ సత్యస్థితి (సహజ స్వభావము) పై రెంటినీ ఆచ్ఛాదించి వానిని నధిగమిస్తుంది. జ్ఞానాజ్ఞానాలు రెంటికినీ అతీతమైనది ఆత్మ.

జాగ్రత్ - స్వప్న - సుషుప్తులు -- ఆత్మ ఎదుట నడయాడే మూడవస్థలు మాత్రమే. నీవెరిగినా, ఎరుగకున్నా అవి తమ మార్గాల్లో చరిస్తూనే ఉంటాయి. అది జ్ఞాని యొక్క స్థితి. మునుపు చెప్పితిమే నడుస్తూ, నిలుస్తూ, కాడివీడుతో, మళ్ళీ పూన్చబడుతూన్న, బండి ఎద్దులూ, బండిలో నిద్రిస్తున్న ప్రయాణికుడు -- ఆ కథలోలాగే జ్ఞాని, మెలకువ, సమాధి, నిద్ర, కల -- అన్నీ అతనియందే జరుగుతుంటాయి. ఈ ప్రశ్నలన్నీ అజ్ఞాని దృష్ట్యా వచ్చేవి. కాకుంటే ఈ సంశయాలే కలుగవు.

భ: ఈ సందేహాలు ఆత్మలోనుంచి వెలువడవు. నిజమే. అక్కడ అడిగేదెవరు? కాని నా అవస్థ యేమంటే, ఆత్మానుభవం లేకపోవటం.

మ: నీ మార్గాన్ని అడ్డుతున్నదదే. నే నజ్ఞానిని, నా కాత్మ సిద్ధించలేదనే భావాన్ని తుడిచివేయి. ఆత్మవు నీవే. దానికి వేరుగా ఎప్పుడైనా ఉన్నావేమి?

భః ఇది నిద్రలో నడవడంలోగాని, లేక పగటి కలలో, అసాధ్యమైన ఆలోచనలలోగాని ఒక ప్రయోగము.

శ్రీ భగవాన్ నవ్వసాగారు.

## భాషణములు 314

భక్తుడు: ఆత్మ, గాఢనిద్రలో శుద్ధ చైతన్యమనీ, సుషుప్తి జాగ్రత్తల అంతరంలోని ఆత్మస్థితియే అనుభవలక్ష్యమనీ, శ్రీభగవాన్ నిన్న తెలిపారు. దయచేసి వివరించండి. మహర్షి: ఆత్మ, నిద్రలో శుద్ధ చైతన్యము; అది సుప్తిజాగ్రత్తల అంతరంలో 'ఇదం' (ఇది) లేకయే 'అహము' (నేను)గా పరిణమిస్తుంది. మెలకువలో అది 'అహం' 'ఇదం' రెండుగా గోచరిస్తుంది. వ్యక్తి అనుభవం 'అహం' మూలకంగానే కాబట్టి అతడు పై సూచించిన మార్గంలోనే (మారుతున్న 'అహం' మూలంగా) అనుభవం పొందవలసి వుంది. అట్లుగాకపోతే నిద్రాస్థితిలోని అనుభవం వానికి పూర్తిగా సంబంధం లేనిది అవుతుంది. దశాంతర "అహం" తెలియగానే, ఆధారం తెలుస్తుంది, అది గమ్యానికి చేరుస్తుంది.

నిద్రను అజ్ఞానం అంటారు. అది జాగ్రతిస్థితిలో వ్యాప్తమైన మిథ్యాజ్ఞానమునకు సంబంధించినది మాత్రమే. మెలకువే నిజంగా అజ్ఞానం. నిద్రాస్థితి ప్రజ్ఞానం (పూర్ణజ్ఞానం); ప్రజ్ఞానం బ్రహ్మమని, శ్రుతి బ్రహ్మము శాశ్వతము. నిద్రాస్థితిలోని

అనుభవం పొందేవానికి 'ప్రాజ్ఞ' యని పేరు. మూడవస్థల్లోనూ అతడు ప్రజ్ఞానమే. అందులోనూ నిద్రావస్థలోని ప్రాధాన్యమేమంటే, అప్పుడు అతడు ప్రజ్ఞాన ఘనుడు (పూర్ణజ్ఞానము). 'ఘన' అంటే ఏమి? జ్ఞానముంది, విజ్ఞానముంది, అన్ని తెలుసుకోవడాలలోనూ ఈ రెండూ వర్తిస్తాయి. జాగ్రత్తులోని విజ్ఞానము, విపరీత జ్ఞానము (తప్పుజ్ఞానము). అదే అజ్ఞానము. అది ఎప్పుడూ వ్యక్తిని వెన్నంటే వుంటుంది. అది విస్పష్టజ్ఞాన మైనపుడు బ్రహ్మము. నిద్రలోవలె, విపరీత జ్ఞానము పూర్తిగా నష్టమైనపుడు, అతడు కేవల ప్రజ్ఞానంగా మిగులుతాడు. ప్రజ్ఞాన ఘన అంటే అది. ప్రజ్ఞాన, విజ్ఞాన, అజ్ఞాన, సంజ్ఞాన ఇవన్నీ బ్రహ్మమునకు పేర్లని ఐతరేయ ఉపనిషత్తులో ఉన్నది. అతడు కేవలము జ్ఞానం గదా? అతడు అనుభవానికి వచ్చేదెలాగ? అనుభవం విజ్ఞాన మూలం. అందువల్ల ప్రజ్ఞాన ఘనుని అనుభవంలో తెలియవలెనంటే సుషుప్తి జాగ్రత్తుల అంతరంలోని శుద్ధ అహమును (pure 'I' of the transitional stage) గట్టిగా పట్టుకోవాలి. మెలకువలోని 'అహం' కలుషితం; అంచేతపై అనుభవానికి తోడ్పడదు. దశాంతర 'అహం', లేక 'శుద్ధాహం' ప్రయోజనం ఈ విధం. ఆ శుద్ధాహమును అనుభవంలో పొందేదెలా? “విజ్ఞాన కోశేవిలసత్యజస్రం” (అతడు ఎల్లప్పుడూ విజ్ఞానకోశంలో ప్రకాశిస్తున్నాడు) అంటుంది వివేకచూడామణి. త్రిపుర రహస్యం మొదలైన ఇతర కృతులు, రెండు సంకల్పాల (భావములు లేక ఆలోచనలు) మధ్యకాలము శుద్ధమైన “అహము”ను నిరూపిస్తున్నాయి అంటాయి. కాబట్టి శుద్ధ 'అహం'ను అవలంబనంగా, ప్రజ్ఞానఘనుని లక్ష్యంగా ఉంచుకోవాలి. ఈ యత్నంలో వృత్తి వున్నది. వాని కన్నింటికీ సరియైన స్థానాలుండి ఏకకాలంలో ఆత్మ అనుభవానికి దారి తీస్తాయి.

శుద్ధాహం, అసత్తుకు భిన్నంగా దానికి అవ్వలిదిగా వివేకచూడామణి వర్ణిస్తుంది. ఇక్కడి 'అసత్' అంటే మెలకువలోని కలుషితమైన 'అహం'. అసద్విలక్షణ, అంటే సత్ - నిద్రలోని ఆత్మ. బ్రహ్మమును సదసద్విలక్షణమనీ వర్ణిస్తారు. రెండిటి అర్ధమూ ఒకటే. అతడు అశేష సాక్షి (సర్వమునూ చూచువాడు) గూడాను.

శుద్ధాహమగు అతనిని, కలుషితమైన అహంచేత ఎట్లు తెలిసికోగలము? ఒకడు తాను సుఖంగా నిద్రించానంటాడు. సుఖమతని అనుభూతి. కాకపోతే తాననుభవించని దాన్ని అతడు ఎలా వర్ణించగలడు? కాని ఆత్మ శుద్ధమైతే నిద్రలో సుఖానుభూతి ఏమి? ఆ అనుభూతిని గూర్చి ఇప్పుడు మాట్లాడేదెవరు? ఆ మాటలాడువాడు విజ్ఞానాత్మ (అజ్ఞాని అహం); అతడు మాట్లాడునది ప్రజ్ఞానాత్మ (శుద్ధాత్మ) విషయం, అదెట్లు సాధ్యం? ఈ విజ్ఞానాత్మ నిద్రలో ఉన్నాడేమి? నిద్రలో సుఖముగా ఉన్నానని వాడిప్పుడనేదాన్ని బట్టి చూస్తే, నిద్రలో వాడున్నాడనే అనిపిస్తుంది. వాడు అప్పుడు ఎలా వున్నాడు? మెలకువలో లాగ ఉండేదానికి అవకాశం లేదు. అతి సూక్ష్మంగా వాడపుడక్కడ ఉండాలి. ప్రజ్ఞానాత్మ సుఖాన్ని, అతి సూక్ష్మమైన విజ్ఞానాత్మ మాయామూలంగా(by means of maya mode)అనుభవించి ఉండాలి. అది చెట్టుయొక్క కొమ్మల, రెమ్మల, ఆకుల క్రింద కనిపించే చంద్రకిరణాలవంటివి.

మెలకువలో సువ్యక్తమైన విజ్ఞానాత్మకు, ఈ సూక్ష్మ విజ్ఞానాత్మ ఎవడో కొత్తవాడుగా గోచరిస్తాడు. నిద్రలో వాడున్నాడని మనము ఎందుకు ఊహించాలి? నిద్రలో సుఖానుభవాన్ని నిరాకరిస్తే, దానితో సహా ఈ ఊహను గూడ వదు కోవచ్చుకదా! అట్లుకాదు. నిద్రలో సుఖాన్ని అనుభవించలేదనలేము. ప్రతి వాడూ నిద్రగోరేవాడే; సుఖనిద్ర కనుకూలంగా చక్కని ప్రక్కను అమర్చుకొంటాడు. ఇంతకూ తేలేది ఏమంటే, సూక్ష్మావస్థల్లో వానిలో తరతమాలున్నా, జ్ఞాత జ్ఞానజ్ఞేయములు మూడవస్థల్లోనూ ఉన్నాయి. అవస్థాంతర దశలో (రెండు అవస్థల మధ్యలో) "ఇదం” (ఇది) అణగినందు వలన, అహం (నేను) శుద్ధంగా ఉంది.

శుద్ధమైన 'అహం' (నేను) ఇప్పుడే ఎందుకు అనుభవగోచరం అవడం లేదు? అలాకాకపోతే ఎందుకు అది జ్ఞప్తికి కూడా రావడం లేదు? ఎందుకంటే, మనక దానితో పరిచయం లేదు గనుక. తెలిసి బుద్ధిపూర్వకంగా సాధిస్తే, దాన్ని గుర్తించవచ్చు. అందుచేత, సప్రయత్నుడవై దాన్ని బుద్ధిపూర్వకంగా (consciously) సంపాదించు (పొందు).

## భాషణములు 315

భగవాన్ పరిచారకుల్లో ఒకరు…

భక్తుడు: భగవాన్ సత్యం, మిథ్య రెండూ ఒకటేనన్నారే. అదెట్లు?

మహర్షి: తాంత్రికులు, అలాంటివారే ఇతరులు, శంకరుల అద్వైత తత్త్వాన్ని సరిగా అర్థం చేసుకోక, వారిది మాయావాదమని నిరసిస్తారు. ఆయన ఏమన్నారు? 1. బ్రహ్మసత్యం, 2. జగంమిథ్య, 3. బ్రహ్మమే జగత్తు. ఆ రెండవ వాక్యం వద్ద ఆగక, దానిని మూడవ వాక్యంతో పూరించారు. దాని తాత్పర్యమేమి? జగత్తును బ్రహ్మకన్యంగా ఎన్నడం తప్పు అని, ప్రత్యర్థులు శంకరులు చూపిన 'రజ్జుసర్ప' " ఉదాహరణ నిరాధారమైన (unconditioned) అధ్యారోప (superimposition) - మన్నారు. రజ్జుతత్త్వం తెలియగానే, సర్పభ్రాంతి నిర్మూలితం అవుతుంది గదా?

కాని వారు ఆధారయుత అధ్యారోపాన్ని గూడ చూడాలి. ఉదాహరణము .. మరు మరీచిక, మృగతృష్ణాదులు. మృగతృష్ణ (ఎండమావి)యని తెలిసిన పిదపగూడ అది మాయమవదు. దృశ్యమలాగే ఉంటుంది; కాని నీటికై అచటి కెవ్వరూ పరుగెత్తరు. శంకరులను అర్థం చేసుకోవడానికి ఈ రెండు ఉదాహరణలను కలిపే యోచించాలి. జగము మిథ్యయే. ఇది తెలిసిన పిదప గూడ అది కనిపిస్తూనే ఉంటుంది. దానిని బ్రహ్మమని" భావించాలి; వేరుగా గాదు.

జగత్తు కనిపిస్తే, అది కనుపించెదెవరికి? అని ఆయన ప్రశ్న. నీ బదులేమి? ఆత్మ అని చెప్పాల్సిందే. కాకపోతే, తెలుసుకొనే ఆత్మలేక జగము కనబడుతుందా? కాబట్టి ఆత్మ సత్యం. అది ఆయన సిద్ధాంతము. దృశ్యాలన్నీ ఆత్మగా సత్యం, ఆత్మకు భిన్నంగా మిథ్య.

కాని తాంత్రికాదులకు విషయ ప్రపంచం సత్యం ఎందుకంటే అవి, అవి కనిపించే సత్యంలో భాగం కనుక.

ఈ రెండు వాక్యాలు తెల్పేది ఒక్కటే గదా? సత్యం, మిథ్యా ఒకటే అని నే నన్నదానికి అర్థం ఇదే.

ప్రత్యర్థులంతటితో ఊరుకోరు. ఆధారయుత, నిరాధార భ్రాంతులను రెంటినీ విచారించి చూచినా, మరు మరీచికలోని నీరు కేవలము భ్రాంతియే. ఆ నీరు దేనికీ ఉపయోగపడదు. కాని జగదృశ్యము వేరు. దానికి ప్రయోజనము ఉంది. దీనికి ఆ మొదటివాని పోలికేమి?

ఏదైనా విషయం, దాని ప్రయోజన, అప్రయోజనములను బట్టి సత్యమైపోదు. ఉదాహరణకు కల తీసుకో. స్వప్నదృశ్యాలు ప్రయోజకాలే; స్వప్న ప్రయోజనాలు తీరుస్తాయి. కలలోని నీరు కలలోని దాహాన్ని తీర్చదా? కల కల్పించినవి కల్లయని నిరూపించేది మెలకువ. జాగ్రత్కల్పితాలను మిగత రెండవస్థలూ కాదంటాయి. నిత్యము నిరతము కానిది సత్యం కాలేదు. సత్యమెప్పటికీ సత్యమే. ఒక మారు సత్యమై, మరొకమారు అసత్యము కాలేదు.

అలాగే ఇంద్రజాలం గూడ. సత్యంగా కన్పించినా, అవి భ్రాంతులే. అట్లే విశ్వము స్వతఃగా సత్యం కాదు; దాని ఆధార సత్యానికది వేరుగాదు.

## భాషణములు 316

సినీ చిత్రంలో మంటలెగసే దృశ్యము, తెరను కాల్చదు, నీటి జల్లు తెరను తడుపదు; పనిముట్లూ, ఆయుధాలూ ఉంటాయి. తెరను చింపవు, చెడుపవు. అందుకే అన్నారు “అచ్ఛేద్యోయం, అదాహ్యోయాయం, అక్లేద్యోయం..." అని. అగ్నిజలాదులు బ్రహ్మమనే (అనగా ఆత్మ) తెరపై దృశ్యాలు; అతనినేమీ బాధించవు.

## భాషణములు 317

శ్రీ పార్థీ: ఇక్కడికి వచ్చినవారు చాలమంది అభూతదృశ్యాలనూ లేదా యోచనాధారలను (visions or thought currents) మీ ద్వారా కలిగాయని చెప్పుతున్నారు. నెలన్నరపైగా నేనిక్కడే ఉన్నాను. అలాంటిది ఏమాత్రము నేను అనుభవించి ఎరుగను. మీ అనుగ్రహానికి నేను పాత్రుడును కాదా? అట్లే, అయితే, వాసిష్ఠకులజునికి నా కంతకన్న

లజ్జాకర ముంటుందా? ఎక్కడినుండో వచ్చిన విదేశీయుల కనుగ్రహం లభించడం, నాకు లేకుండటమూ? ఈ అవమానము 3 తుడిచేసేందుకేదైన ప్రాయశ్చిత్తం దయచేసి చెప్పండి.

మహర్షి: దృశ్యాలూ, యోచనా స్రవంతులూ, వారివారి మనోస్థితిని బట్టి ఉంటాయి. అవి వ్యక్తులపై ఆధారపడతాయి; పరమాత్మ సాన్నిధ్యంపై గాదు. అదీగాక అవన్నీ అంతముఖ్యంకాదు, ముఖ్యమైనది మనశ్శాంతి.

భ: మనశ్శాంతి సమాధిస్థితి ఫలము. ఆ సమాధి ఎలా దొరుకుతుంది?

మ: ఆలోచనల అభావమే సమాధి. ఆ స్థితి నిద్రలో ఉంది. అంత మాత్రానికే మనశ్శాంతి నీకు సుస్థిరంగా వుంటుందా?

భ: ఆశ్రమ వార్తాలేఖనాలలో సమాధి అవసరమని ఉంది.

మ: సమాధి ఎక్కడో వేరుగా ఉందా, కొని తెచ్చుకోడానికి? నీ సహజస్థితి సమాధికి సంబంధించినదే.

భ: నాకట్లు అనిపించడం లేదు.

మ: నీ విరుద్ధమైన విశ్వాసమే దానికి ఆటంకం.

భ: నా కాత్మ సిద్ధికాలేదు గనుక, నా నిత్యస్థితి సమాధియని బోధపడడం లేదు.

మ: నీది పునరుక్తి. ఆటంకమదే. నీవు అనాత్మ అనుకోబట్టి ఇదంతా. అసలు తప్పు, అది. అనాత్మను ఆత్మగా భావించక. అప్పుడు ఆత్మ నీకు వ్యక్తమౌతుంది.

భ: సిద్ధాంతపరంగా తెలుస్తోంది. ఆచరణపరంగా తెలియడం లేదు.

మ: ఆత్మలు రెండు లేవు. ఒకటి ఆ రెండోదాన్ని పొందలేదని చెప్పేందుకు.

భ: ఇదీ సిద్ధాంత భాగమే. నాకు సమాధి కలిగేదెలాగు?

మ: సమాధి ఫలాలు తాత్కాలికాలు. సమాధి ఉన్నవరకే ఆనందము. దానినుండి లేవగానే పూర్వవాసనలు తిరిగి వస్తాయి. సహజసమాధిలో వాసనలను నశింపచేయకపోతే, దానివల్ల ఏ లాభమూ లేదు.

భ: కాని సమాధి, సహజ సమాధికి పూర్వమే రావాలి కదా?

మ: సమాధి స్వాభావిక స్థితి. పనులు, సంఘటనలూ ఉన్నా అవి సమాధిని బాధించవు. అవి ఆత్మకు వేరుకావని తెలిస్తే, ఆత్మసిద్ధి అయినట్లే, స్థిరమైన మనశ్శాంతి నివ్వని పక్షంలో, సమాధితో పనేమి? ఏమి ఎట్లు జరిగినా, నీవిప్పుడుగూడ సమాధిలోనే ఉన్నావని గ్రహించు. అంతే.

భ: కాని అదెట్లు సాధించటం?

ఒక పండితుడు వల్లించాడు: "యతోవాచానివర్తనే అప్రాప్య మనసాసహ"

(మనస్సుతోసహా వాక్కులు ఎక్కడకు చేరజాలదో...)

భక్తుడు తిరిగి అడిగాడు: 'మనసైవ ఆప్తవ్యమ్ (మనస్సుతోనే తెలిసికో దగినది) అని కూడా అనలేదా?

మ: ఆలోచనలు లేని మనస్సు శుద్ధమనస్సు అది ఆత్మయే. కలుషిత మనస్సునకు అతీతమైనది శుద్ధమనస్సు.

భ: సూక్ష్మదర్శులైన యోగులచే సూక్ష్మాతిసూక్ష్మ బుద్ధితో గ్రహించబడినది.

మ: మనస్సునకు చెప్పింది, ఇక్కడ గూడ వర్తిస్తుంది.

భ: సమాధి నా సహజస్థితి అయితే, ఆత్మసిద్ధికి పూర్వం సమాధిస్థితిని పొందుట అవసరమని ఎందుకన్నారు?

మ: తన నిత్యసమాధి స్థితిని గుర్తుంచుకొమ్మని దాని అర్థం. దానిని ఉపేక్షించుట, అజ్ఞానం; "ప్రమాదోవై మృత్యుః" (అనవధానము లేదా సావధానముగా లేకుండుటయే మృత్యువు).

భ: ముందుగా సమాధి పొందకనే సావధానంగా ఉండడం ఎలా సాధ్యం?

మ: సరిసరి. సమాధిపై నీకంత ఉబలాటం ఉంటే, ఏ మత్తుమందైనా చాలు, దాన్ని సంపాదించి పెడుతుంది. ఫలితం దురభ్యాసమేగాని, విమోచనం గాదు. సమాధిలో గూడ నిద్రాణంగా వాసనలుండనే ఉంటాయి. వానిని సమూలంగా తొలగించాలి.

మరొక భక్తుడు: వాసనలను సమూలంగా తొలగించకుండా ఆత్మానుభవం సాధ్యమా?

మ: వాసనలు రెండు రకాలు. 1. బంధహేతువులు (అజ్ఞానులను బంధించేవి) 2. భోగ హేతువులు (జ్ఞానులకు ఆనందాన్ని కల్గించేవి) ఈ రెండవ రకము

ఆత్మసిద్ధి నడ్డవు. భ: వామదేవ, జడభరతాది ఆత్మజ్ఞానులకు మరల పుట్టుకవుంటుందా?

మ: ఆత్మజ్ఞులకు పునర్జన్మ వుండదు. బంధహేతువులగు వాసనల వల్లనే పునర్జన్మ వచ్చేది. కాని ఆత్మనిష్టలో అవి నష్టమైపోతాయి.

భ: వారు సహజ నిర్వికల్పానికి చేరలేదని, కేవల నిర్వికల్పస్థితికి చేరేరని చెప్పవచ్చునా?

మ: అవును.

భ: కేవల భోగహేతువులు అయిన వాసనలు ఆత్మస్థితినడ్డని పక్షంలో, ఆనందస్థితి చెదరకుండా ఎవడైనా ప్రాపంచిక వ్యవహారాల్లో వర్తిల్లగల్గితే, సంగము మాత్రమే బంధమని దాని అర్థం. నే నన్నది సరియేనా?

మ: అవును. ముమ్మాటికి. సంగమే బంధము. అహంకార నిర్మూలనముతో సంగము అదృశ్యమౌతుంది.

భ: గుర్వనుగ్రహంవల్ల ఆత్మలబ్ది సులభమవుతుందంటారు.

మ: గురువు ఆత్మకు పేరు కాదు.

భ: రాములకు వసిష్ఠులు, కృష్ణులకు సాందీపని గురువులు కదా?

మ: సాధకునకు గురువును, వానికి బయటనే అని చెప్తారు. గురువువల్లనే మనస్సు అంతర్ముఖమయ్యేది. సాధకుడుకి బాహ్యదృష్టి గనుక, అంతర్దృష్టిని గురువువలన నేర్చుకొమ్మన్నారు. గురువు ఆత్మయే అని అతడు క్రమంగా తెలుసుకొంటాడు.

-

భ: గుర్వనుగ్రహము నాకు కల్గుతుందా?

మ: అనుగ్రహమెప్పుడూ ఉంది.

భ: కాని నాకది తెలియడం లేదు.

మ: శరణాగతి వల్ల అనుగ్రహాన్ని గ్రహించవచ్చు.

భ: నేను సంపూర్ణంగా శరణాగతి చేసాను. నా హృదయం నాకు బాగా తెలుసు. అయినా అనుగ్రహము నాకు తెలియడం లేదు.

మ: నీవు శరణాగతుడవైతే ఇట్టి ప్రశ్నలే రావు.

భ: నేను శరణుజొచ్చాను. కాని సందేహాలు రానే వస్తున్నాయి.

మ: అనుగ్రహం మార్పులేనిది. మార్పుచెందేది నీ నిర్ణయమే. తప్పు మరెక్కడ ఉండగలదు?

భ: నన్ను నేను సమర్పించుకోవడానికి నన్ను సమర్థుడిని చెయ్యాలి.

మ: తాయుమానవర్ అన్నారు - "నీతో సంవాదము నింతదూరము సాగనిచ్చి, నీ పల్కులను అనుసరించుటకు యోగ్యతను ఇచ్చిన నీకు జయమగు గాక."

## భాషణములు 318

హిందీ భాషించే వారొకరు - మృత్యుభీతి తొలగే దెట్లు?

మహర్షి: మృత్యువును తలపోయక ముందు, నీవసలు పుట్టావా తెలుసుకో. పుట్టినతడే మరణిస్తాడు. నిద్రలో నీవు మరణించిన వానితో సమానమే. మరి మృతిని గూర్చి భయమెందుకు?

భ: నిద్రలో ఏ స్థితిలో ఉంటాము?

మ: ఆ ప్రశ్న నిద్రలో అడుగు. మెలకువలోనే, నిద్రాస్థితిని స్మరిస్తావు. అప్పటి స్థితిని జ్ఞప్తికి తెచ్చుకుంటూ, 'నేను హాయిగా నిద్రించా'నంటావు.

భ: ఆ దశను సమకూర్చే సాధనమేమైనా ఉందా?

మ: అంతఃకరణకు ప్రతిగా దానిని మాయాకరణమంటారు. ఇతర స్థితులన్నిటిలోనూ అంతఃకరణ పరిచితమే. ఆ సాధనాలకే, వివిధ స్థితుల్లో వివిధ నామములు. నిద్రలోని ఆనందాత్మను, జాగ్రత్తులో విజ్ఞానాత్మ అన్నట్లు. భ: మాయాకరణ మిచ్చే ఆనందానికి ఒక్క ఉదాహరణ మీయండి.

మ: నీవు సుఖంగా నిద్రించానని ఎలా అనగల్గుతావు? నీ సుఖాన్ని నిరూపించే అనుభవం వుంది. నిద్రలో ఆ అనుభవమే లేకపోతే జాగ్రత్తులో దాని స్మృతి ఎట్లు?

భ: ఒప్పుకున్నాను. కాని నాకొక ఉదాహరణ ఇవ్వండి.

మ: దానిని వర్ణించే దెలాగ? నీటి అడుగున నున్న వస్తువుకై నీటిలో మునిగి, అది దొరికిందని బయటికి వచ్చిగదా అంటావు. నీట మునిగి వున్నప్పుడేమి అనవు గదా?

భ: నిద్రలో నాకు భయంలేదు. కాని ఇప్పుడుంది.

మ: "ద్వితీయాద్వై భయంభవతి". రెండవ వానివల్లనే భయం. నీ భయం దేనివల్ల?

భ: ఇంద్రియ దేహములనూ జగత్తునూ, ఈశ్వరునీ, కర్తృత్వ భోక్తృత్వాదులనూ- ఇన్నిటినీ చూచి.

మ: అవియంటే భయమైతే, వానిని చూడట మెందుకు?

భ: ఎందుకంటే, అవి తప్పించుకోవడానికి వీలులేనివి.

మ: వానిని చూచేది నీవుగదా? భయమెవరికి, వానికా?

భ: కాదు, నాకు.

మ: వానిని చూస్తావు గనుక భయం. చూడటం మానివెయ్యి. భయమే ఉండదు.

భ: అటువంటి మెలుకువలో నేను చేయగల్గిందేమి?

మ: నీవుగానే వుండు. (ఆత్మగా ఉండు) నిన్ను భయపెట్టేందుకు ఆ రెండవదేదీ

ఉండదు.

భ: అవును. ఇప్పుడర్థమౌతున్నది. నేను ఆత్మను చూస్తే, అనాత్మ వలని దృష్టి తొలగి, ఆనందం మిగులుతుంది. అప్పటికీ, మృత్యుభీతి ఉండనే ఉన్నది.

మ: పుట్టినవాడే మరణిస్తాడు. ఆ భయానికి, నీ వసలు పుట్టేవేమో విచారించు.

## భాషణములు 319

గోవా నుండి వచ్చిన ఒక హిందువు, శ్రీధర్- "యోగః కర్మసుకౌశలమ్" (కర్మల యందు నేర్పు యోగము)లో కౌశలమని దేన్నంటారు? అది అలవరచుకోవడ మెలాగ?

మ: ఫల మెదురుచూడకుండా పనులు చేయి. కర్తవు నీ వనుకోకు. పనిని దైవానికంకితం కావించు. కౌశలమూ అదే, దానిని పొందే మార్గమూ అదే.

భ: "సమత్వం యోగ ఉచ్యతే" (సమభావమే యోగము) ఆ సమత్వమేమి? మః భిన్నతలోని ఏకత. ప్రపంచం భిన్నభిన్న రీతులుగా కన్పిస్తుంది. అన్నింటికీ సమానలక్షణమేమో చూడు. అది కనుగొంటే, పరస్పర విరుద్ధాలైన ద్వంద్వములలో సమత తనంతతానే వ్యక్తమౌతుంది. సాధారణంగా ద్వంద్వ భావన సందర్భంలోనే ఈ 'సమత' పదాన్ని వాడుతారు.

భ: భిన్నములలో సమతా లక్షణాన్ని చూడడం ఎలా?

మ: చూచేవా డొకడే. వాడులేక అవి కనబడవు. అవి ఎంతగా మారినా, చూచే వానిలో ఏ మార్పూ వుండదు.

యోగః కర్మసు కౌశలమ్ = పనిలో నేర్పు యోగము.

సమత్వం యోగ ఉచ్యతే = సమత్వమే యోగము.

మామేకం శరణం వ్రజ = ఏకమును నన్ను శరణు పొందుము.

ఏకమేవా అద్వితీయమ్ = రెండవది లేని ఒకే ఒకటి.

పై నాల్గూ క్రమంగా కర్మ, యోగ, భక్తి, జ్ఞాన పర్యాయములు. అన్నింటి అర్థమూ ఒకటే. అవన్నీ, వేర్వేరు అంశాలుగా కూర్చిన ఏకైక సత్యము.

ఏకనాథరావు - దానికి అనుగ్రహము కావాలా?

మ: అవును.

భ: భగవదనుగ్రహం లభించే దెలాగ?

మహర్షి: శరణాగతి వల్ల.

భ: ఏమో, నాకు అనుగ్రహము అనుభవంలోకి రావడం లేదు.

మ: నిజాయితీ (sincerity) లోపించిందన్నమాట. శరణాగతి మాటలతోను, షరతులతోనూ కాదు.

పై వాక్యాలు సమర్థిస్తూ సెయింట్ జస్టీనియన్ నుంచి కొన్ని వాక్యాలు చదివారు. ప్రార్థన మాటలు గాదు. అది హృదయం నుంచి రావాలి. హృదయంలో మగ్నం కావటం ప్రార్థన. అనుగ్రహమదే.

నమ్మాళ్వారు లన్నారు: "ఇంత కాలము నీకై వెదికాను; ఆత్మసిద్ధి పిదప ఆత్మయే నీవని కనుగొన్నాను. నా సర్వమూ ఆత్మయే; కనుక నీవే నా సర్వమూ".

భ: అసంపూర్ణత, అజ్ఞానము, కోరికలు అనే మలినాలు (ఆణవ, మాయిక, కామ్య తమిళంలో) ధ్యానపథంలో ఆటంకాలు కల్పిస్తాయి. వానిని జయించడమెలా?

మ: వానిచే చెదరక నిశ్చలంగా ఉండటమే.

భ: దాని కనుగ్రహం కావాలి.

మ: నిజమే. ఆద్యంతాలు అనుగ్రహమే. అంతర్ముఖత అనుగ్రహం వల్లనే; దృఢదీక్ష (perseverance) అనుగ్రహము; ఆత్మానుభవమూ అనుగ్రహమే. అందుకే 'మామేకం శరణం వ్రజ'యని. ఎవరైనా పూర్ణశరణాగతుడైతే, అనుగ్రహాన్ని అడగడానికైనా వానిలో ఇంకేమైనా మిగిలి ఉందాయేం? అతన్ని అనుగ్రహం కబళించేస్తుంది.

భ: ఆటంకాలు బలీయాలు. అవి ధ్యానాన్ని అడ్డగిస్తాయి.

మ: సర్వాధిక శక్తిని నమ్మి స్వార్పణం చేశాక, అవి నిన్నెట్లు అడ్డుతాయి? అవి బలీయాలైతే వాని మూలాన్ని పట్టుకొని మరి వదలకు. అప్పుడవి నిన్నేమీ చేయలేవు.

## భాషణములు 320

అర్హులకు మాత్రమే ఆత్మసిద్ధి సాధ్యమని భగవాన్ ఒక మారన్నారు. జ్ఞానం రాకముందు వాసనలను నిర్మూలించి తీరాలి. జ్ఞానం కలగాలంటే వ్యక్తి జనకుడిలా వుండాలి. సత్యానికై సర్వమూ ధారపోయ సిద్ధం కావాలి. సంపూర్ణ పరిత్యాగం అట్టి అర్హతకు సూచకము.

## భాషణములు 321

జాగ్రత్తులో దుఃఖాలు కనిపిస్తాయి ఎందుచేత?

మ: నిన్ను నీవు చూడగల్గితే అవి గోచరించవు.

భ: నే నెవరో చూడ యత్నిస్తే నాకేమీ కనబడదే.

మ: నిద్రలో నీవెలా వున్నావు? అప్పుడు 'నే'నన్న ఆలోచన ఉందా? లేదు. నీవు సుఖంగా వున్నావు. మెలకువలో అన్నిటికి మూలమైన “నేను” ఆలోచన నుండి మిగిలిన ఆలోచనలు విస్తరించి సహజానందాన్ని కప్పివేస్తాయి. ఆనందాన్ని అడ్డగించే ఈ ఇతర ఆలోచనలన్నింటిని వదలించుకో. నిద్రలో వ్యక్తమైనట్లే నీ సహజస్థితియైన ఆనందం అనుభవంలోకి వస్తుంది.

భ: నిద్రలో నా అనుభవమేమో నాకు తెలియదు.

మ: కాని అది సుఖమని మాత్రం ఎరుగుదవు. కాకపోతే, సుఖంగా నిద్రించానని ఎట్లనగలవు? ఏ ఆలోచనా లేక, అహంకారం లేక, నీవు తప్ప మరేమీ లేనప్పుడు, నీవు సుఖంగా వున్నావు. సత్యమంతా అదే.

“తత్త్వమసి" (నీవు అదే) అన్న మహావాక్యార్థ మిదే. నిన్ను నీవు తెలుసుకో. అప్పుడు “అది” అర్థమౌతుంది.

భ: అది బ్రహ్మమెలాగ కాగలదు?

మ: నీకు వేరుగా బ్రహ్మమును తెలిసే కోరిక ఏమిటి? శ్రుతి "తత్త్వమసి” అంటున్నది. ఆత్మ నీకెంతో పరిచితమే. అది లేక నీవు లేవు. అది గ్రహించు. అదే బ్రహ్మానుభవం గూడా.

భ: నాకది చేతకావడం లేదు. ఆత్మానుభవం పొందే శక్తి నాకు లేదు.

మ: అయితే ఏమి మిగుల్చుకోక పూర్ణశరణాగతి పొందు. ఆ పరమశక్తి స్వయంగా స్ఫురిస్తుంది.

భ: షరతులు లేని (unconditional) శరణాగతి అంటే ఏమిటి?

మ: అది అయినప్పుడు ప్రశ్న అడిగేవాడు గాని, ఆలోచించేవాడు గాని ఉండడు. మూలమైన “నేను” ఆలోచనను అంటిపెట్టుకొన్నందున ఆలోచనలను నిర్మూలమన్నా చేయాలి, సర్వశక్తికి షరతులు లేకుండా తన్ను తాను సమర్పించు కోవాలి. ఆత్మసిద్ధికి రెండే మార్గాలు.

## భాషణములు 322

ఆమె తండ్రి మద్రాసులో ప్రసిద్ధి న్యాయవాది. (solicitor) ఆమె నాగరీకురాలు.

భగవాన్ ను ప్రశ్నించింది

భక్తురాలు: భగవాన్ ఉపదేశించినట్లు ఆలోచనలన్నీ విడునాడుటకై ఏమి చేయాలి? 'నే నెవ'రన్న విచార మాత్రమేనా?

మహర్షి: నిశ్చలంగా ఉండడానికే. అది చేసిచూడు.

భ: అది అసాధ్యము.

మ: అవును నే ననేదీ అదే. అందుకొరకే 'నేనెవరు' అన్న విచారం చెయ్యమని చెప్పేది.

భ: ఆ ప్రశ్న నడిగితే లోనుండి జవాబు రాదు.

మ: బదులు ఏ రీతిగా ఉండాలని అనుకుంటున్నావు? అక్కడ నీవు లేవా? ఇంకా ఏమిటి?

భ: ఆలోచనలు ఎంతో ఎక్కువగా వస్తాయి.

మ: అక్కడ అప్పుడే 'నే నెవరు' అన్న ప్రశ్న అడుగు.

భ: వచ్చిన ప్రతి ఆలోచనకూ ఆ ప్రశ్న అడగవలసిందేనా? అయితే సరే. ప్రపంచము మన ఆలోచనేనా?

మ: ప్రపంచం సంగతి దానికే వదిలేయి. ప్రపంచమే “నేను ఎట్లా వచ్చాను?" అని అడగనీ.

భ: ఆ ప్రశ్నకూ నాకే ఏ సంబంధమూ లేదని అర్థమా?

మ: గాఢ నిద్రలో ఏదీ కనబడదు; ఇవన్నీ మేల్కొన్న తర్వాతే గోచరిస్తాయి. ఆలోచనలు తలయెత్తిన తర్వాతే జగత్తు ఉదయిస్తుంది; అది ఆలోచన కాక మరేమి?

మరియొక దర్శనార్థి - మనస్సు నిశ్చలం కావలెనంటే ఏమి చేయాలి?

మ: మొదట పరిగెడుతున్న మనస్సును పట్టుకొని, ఇక్కడకు పట్టుకురా. ఆ తరువాత దాన్ని స్థిరం చేసే ఉపాయాలు ఆలోచిస్తాము.

భ: నా కష్టమేమంటే జపం చేస్తున్నపుడు కూడా అదే పనిగా అది మారుతూనే ఉందే అని.

మ: మనస్సును సుస్థిరం చేయడానికే జపము.

భ: ఏం జపంచేస్తే మంచిదంటారు?

మ: ఏది అనుకూలమో అది - ఉదా|| గాయత్రి.

భ: గాయత్రి జపం చాలా?

మ: దాన్ని మించినదేమైనా ఉందా? అది చేయలేనివాళ్ళు ఇతరాలకై వెదకుతారు. దానిలో సత్యం సంపూర్ణ కళలతో వెలసింది. జపము ధ్యానానికి దారి తీస్తుంది. ధ్యానమే ఆత్మానుభవానికి ప్రధానోపాయం.

భ: దినానికి ఒక అరగంట జపం సరిపోతుందా?

మ: దాన్ని ఎప్పుడూ చెయ్యాలి. లేదా చెయ్యగలిగినంత సేపు చెయ్యాలి.

## భాషణములు 323

అరుణాచలాష్టకంలోని ఆరో పద్యాన్ని శ్రీ భగవాన్ ఇట్లు వ్యాఖ్యానించారు... ఐదవ పద్యం “ఒకటి ఉన్నదా?" అని అంతమౌతుంది. ఆరవది, 'అవును, ఒకటి వున్నది' అని మొదలవుతుంది. అది ఏకైకమయినా, దాని అద్భుతశక్తిచే అది సూక్ష్మబిందువునైన “నేను” భావనలో ప్రతిఫలిస్తుంది. ఈ 'ఆభాస'నే అజ్ఞానమనీ, నిద్రాణాలైన వాసనల సమాహారమనీ అంటారు. ఆ ఆభాసమే సాపేక్ష జ్ఞానము. అది ప్రారబ్ధ వాసనలను రేపుతుంది. అవి ఆలోచనలుగా వెలికి వచ్చి స్థూలమైన, ఆదిభౌతిక జగత్తవుతుంది; లోని సూక్ష్మవాసనలుగ వర్ధిల్లుతుంది. ఆ శక్తిని సూక్ష్మరూపంలో మనస్సనీ, భౌతికంగా మెదడు (మేధ) అని వ్యవహరిస్తారు. ఈ మనోమేధస్సులు, ఆ నిత్యైక వస్తువును విస్తరింపజేసి బయట విశాల విశ్వంగా కనిపించేటట్లు చేస్తుంది. మనస్సు జాగ్రత్ స్వప్నావస్థల్లో బహిర్ముఖమూ, సుషుప్తిలో అంతర్ముఖమూ. మనస్సు నిమిత్తంగా బ్రహ్మము జాగ్రత్ స్వప్నములలో బహురూపిగా భాసించి, నిద్రామూర్ఛాదులతో ఉపసంహృతుడై ఉంటాడు. కాబట్టి 'అదే నీవు' (తత్త్వమసి). మరే విధమూ కావు. మార్పులెన్నైనా సరే, ఆ నిత్యైక వస్తువు నీవుగనే వుంటుంది; నీవు కానిది వేరే ఏదీ లేదు.

ఆ ముందు పద్యంలో ఉన్నది - "సూర్యకాంతి పడ్డాక ఛాయాఫలకంలో (సెన్సిటివ్ ప్లేట్) బింబాలురావు. ఆ రీతిగానే మనస్సు, నీ (ఆత్మ) కాంతిని ప్రసరిస్తే ఆపై ప్రపంచాన్ని ప్రతి ఫలింపచేయలేదు. ఇంతకూ ఆ సూర్యుడు నీవాడేగా? అతని కిరణాలకే ప్రతిబింబాలను వారించేంత శక్తియుంటే, నీ జ్యోతిశ్శక్తి మరెంతగా ఉండాలి? ఇంతకూ తాత్పర్యమిది-- ఆ నిత్యైక వస్తువుకు భిన్నంగా ఏదీ లేదు. అది నీవే.

ప్రస్తుతమైన 6వ పద్యంలోని సూక్ష్మబిందువు = జీవాత్మ; సూక్ష్మబిందువు తమోమయము = వాసనలతో కూడిన అహంకారము. చూచువాడు, చూడబడునది బయటకు వచ్చిన అహంకారం దృశ్యంగానూ, అంతఃకరణంగానూ విస్తరిల్లుతుంది. అహంకారం లేవడానికి ప్రకాశం మందంగా ఉండాలి. పట్టపగలు త్రాడు పామువలె కనబడదు. చిమ్మచీకటిలో అసలు త్రాడే కనబడదు. దాన్ని పామని భ్రమించటమూ జరగదు. మసక వెల్తురులో, సంధ్యవేళలో, నీడకలిసిన కాంతిలో, రాత్రి గ్రుడ్డిదీపపు వెలుగుకొనలలో, త్రాడు చూచినప్పుడు ఆ సర్పభ్రాంతి కల్గేది. అట్లే శుద్ధమూ, ఉజ్జ్వలమూ అయిన కాంతి స్వరూపము అహంకారంగా కనబడడానికి, చీకట్లలో చెదరిన కాంతివల్లనే సాధ్యమవుతుంది. ఈ తమస్సుకు మరొక పేరు (original sin) మూల అజ్ఞానము. దాని ద్వారా ప్రసరించే వెలుగును అభాస కాంతి

అన్నారు. ఆ ఆభాస కాంతిని, కేవలము దాని అర్హతల బట్టియే, శుద్ధమనీ, ఈశ్వరుడనీ, దైవమనీ పేర్కొన్నారు. ఈశ్వరుడు మాయతో ఒకటిగా ఉంటాడని ప్రసిద్ధమే; అంటే ఆభాసకాంతియే, ఈశ్వరుడు.

శుద్ధ మనస్సనగానే, శుద్ధము కాని మనస్సు కూడ స్ఫురిస్తుంది. అది రాజసికము, ప్రవృత్తమగు మనస్సు; అదే అహంకారం. దీనినిగూడ సాత్త్విక మనస్సునుండి, మరియొక ప్రతిబింబ రూపేణ ప్రసరింపజేయవచ్చు; అట్లు అహంకారం అవిద్య అనే చీకటి నుండి పుట్టింది. ఆ తరువాత అంతఃకరణాల రూపంగా వస్తుంది తామసిక, లేక మందమైన మనస్సు. ఇది ప్రపంచంగా గోచరిస్తుంది.

స్థూలదేహ దృష్ట్యా చెప్పాలంటే, అది బుద్ధి ప్రాభవం వల్ల బాహ్యంలో ప్రపంచంగా కనబడుతుంది.

కాని స్థూలదేహం కేవలం మానసికమే. మనసు నాల్గు అంతఃకరణాలతో కూడినదనీ, ఆలోచనలతో కూడినద నీ, ఆరవ ఇంద్రియమని, బుద్ధిఅహంకారాల సంయోగమనీ, చిత్త మనోమేళన (స్మృతి, ఆలోచనమని వర్ణిస్తారు. దానిని

రెండుగా విభజించవచ్చు. 1. అహంకారం 2. మనస్సు.

ఈ రెండవ దానిలో కర్త అంటే విజ్ఞానాత్మ లేదా బుద్ధి లేదా అహంకారము లేదా చూసేవాడు. కర్మ (చూడబడే వస్తువు) అంటే మనోమయకోశము లేదా చూడబడే వస్తువు.

జాగ్రత్ స్వప్న సుషుప్తులు మూడూ మూల అవిద్యలో జనిస్తాయి. జాగ్రత్ స్వప్నములలో మనస్సు బయటకుపోయి వృత్తులవలనా, నిద్రలో లోనికి ఉపసంహృతమైన మాయవృత్తివలనా, అనుభవాలను చేకూర్చుకుంటుంది. ఈ విశిష్టమైన శక్తి, వ్యక్తుల పనులను ప్రపంచపు ఆచరణలను నియమిస్తుంది. ఇవన్నీ స్వయంజ్యోతి ఆధారంపై, ఆభాసద్వారా నడయాడే దృశ్యమాత్రాలు.

ఎలా అయితే పట్టపగలు రజ్జునుసర్పముగా చూడలేమో, అలాగే చిమ్మచీకటిలో అసలు రజ్జువూ కానరానట్లే, స్వయంజ్యోతి స్వరూపుని సమాధిదశలో, నిద్రలో, మూర్ఛలో, ప్రపంచము కనుపించదు. ఆభాస కాంతిలో (వెలుగు చీకట్ల కలయికలో, అవిద్యాదూషితమైన జ్ఞానంలో) మాత్రమే, తన ఆధారాన్ని విడవకుండా ఈ ప్రపంచం జనించి, పెరిగి, లయిస్తున్నట్లు తోస్తుంది. దాని నానాత్వం గూడ, దాని మూలస్థానమైన సత్యానికి దూరంకాదు. ఇదియొక లీలా నాటకము. ఇందు ఏకైక బ్రహ్మము బహురూపాలు దాల్చి, విషయములుగా వ్యక్తుడై, తిరోగమిస్తున్నాడు. అట్లు చేయడానికొక అద్భుత శక్తి ఉండాలి. ఆమె కూడా తన పుట్టువుకు స్వతంత్రించి ఉండలేదు. స్వయం భాసియైన శుద్ధవస్తువులో ఈ శక్తి కానరాదు. కాని ఆ శక్తి ఒనర్చే కార్యాలు జగత్ప్రసిద్ధమే. ఇది ఎంత అద్భుతమో!

ఆమె యొక్క దివ్యమైన ఆద్యశక్తి నుండి (వ్యక్తీకరించబడుతున్న కంపన శక్తి) సత్వముతో నిండిన ప్రతిబింబము జనిస్తుంది. దాని నుండి రాజసిక అహంకారం వస్తుంది. దానినుండి తామసిక ఆలోచనా రూపాలు. వీటినే విజ్ఞానము (knowledge) అన్నారు. భూతద్దమునుండి వెలువడిన కాంతి వంటిది. ఎలా అయితే కృత్రిమ కాంతి కటకము (lens) ద్వారా తెరపై ప్రసరిస్తుందో అలాగే ఆభాసకాంతి బయట ప్రపంచంగా విస్తరిల్లకముందు ఆలోచనల (భూతద్దము) మార్గాన పయనిస్తుంది. అంతేకాకుండా, ఆలోచనే బీజరూపమైన విశాల బాహ్య ప్రపంచము. శక్తి అంత మహితమైనది. ఈ విధంగా ఈశ్వర, జీవ, జగత్తులు ఆభాసకాంతి ప్రతిఫలింప చేసినవే. ఆ ఆభాసకాంతి కాధారం ఏకైకమైన స్వయంభాసి.

ఇక ఈ “నేను ఆలోచన” ఏమిటి? అహంకారం విశ్వ రచనలో అది కర్తయా, కర్మమా?

జాగ్రత్ స్వప్నావస్థల్లో అహంభావన అన్ని విషయాలనూ సాక్షిగా చూస్తోంది. అది సరియైనా కాకున్నా, మనం అట్లనుకుంటున్నాము కాబట్టి అది కర్తగనే ఉండాలి. ఆత్మసిద్ధి తర్వాత అది కర్మ మాత్రంగానే ఉండిపోతుంది.

ఈ "నేను -ఆలోచన" ఎవరిది? ఈ పరిశీలననే విచారము అంటారు. “నేను-ఆలోచన” “ఇదం” యోచన, రెండూ ఒకే కాంతి ప్రసరింపచేసినవే. అవి, క్రమంగా రాజసిక తామసికములు. రజస్తమోగుణ వర్జితంగా, శుద్ధసత్త్వము కావలెనంటే అది “నేను – నేను" స్ఫురణగా, నిరతంగా, ఉజ్జ్వలంగా వెలుగొందాలి. దానిని “ఇదం (ఇది)” యోచన ఏ మాత్రమూ భంగపరచకూడదు. ఈ శుద్ధస్థితి నిద్రకూ మెలకువకూ నడుమ తాత్కాలికంగా తెలుస్తుంది. అది శాశ్వతమైతే, అది విశ్వవ్యాపి చైతన్యం -- ఈశ్వరుడే అనవచ్చు. ఆ పరంజ్యోతిని చేరుకోవటానికి ఇది ఒక్కటే మార్గం.

మేల్కొన్న పిదప, స్మరించే గాఢనిద్రలోని అనుభవాలు రెండు విధాలు "హాయిగా నిద్రపోయాను. ఏమీ తెలీదు." ఆ విధంగా సుఖము మరియు అజ్ఞానము అక్కడి అనుభవాలు. శక్తి 1. ఆవరణ (తమస్సు) 2. విక్షేపం (భిన్నత) రూపాలలోకి మారింది. మనస్సు విక్షేపము నుండి వచ్చింది.

## కొన్ని స్మరణలు

## భాషణములు 324

1. స్కందాశ్రమంలో భగవాన్ ఒక తెల్లని కప్పను చూసారు. అది చిన్నదే కాని పొడవుగా వుంది. వారి కది పది అడుగుల దూరంలో ఉంది. భగవాన్ దానినీ, అది భగవాన్నూ తదేకంగా చూస్తున్నారు. తటాలున అది గెంతి సరిగ్గా భగవాన్ ఒక కంటిపై వ్రాలింది. తక్షణం వారు కను మూసుకోబట్టి గాని, లేకుంటే కన్ను ఏమయ్యేదో!

2. ఆశ్రమంలో రెండు నెమళ్ళుండేవి. అవి మహాఠీవిగా ఇటునటూ అడుగులు వేస్తూ, చుక్కల వీవనలవలె పురివిప్పి విహరించేవి. ఒక నాగుపాము కూడా పడగవిప్పి వాని మధ్యనే ఆ విహారంలో పాల్గొనేది.

3. ఊసరవెల్లి (గ్రీన్ లిజర్డ్) కనబడీ కనబడగనే సూటిగ నెమలి దాని దగ్గరికివెళ్ళి వినీతయై తన తలను నేలపై వుంచుతుందట. అది నెమలి మెడనుబట్టి కొరికి చంపివేయునట. అట్లని శ్రీభగవాన్ చెప్పేరు.

4. శ్రీ రంగస్వామి అయ్యంగార్ ఒక మారు కొండపైకి వెళ్ళారు. దగ్గరలోనే ఒక చిరుతపులి కనబడింది. ఆయన దానివైపొక రాయి విసిరాడు. అప్పుడు అది ఆయనవైపు తిరిగింది. ప్రాణాలరచేత బట్టి ఒక్కటే పరుగు లంకించుకున్నాడు. దారిలో శ్రీ భగవాన్ అగుపించి విషయమేమని అడిగారు. అయ్యంగారి నోట పేరుమాటలేక “చిరుత" అన్నారే గాని పరుగాపలేదు. అప్పుడు భగవాన్ అయ్యంగారు వచ్చిన దిశగానే పోగా అది అచ్చటినుండి వెళ్ళిపోయింది. అప్పుడు ప్లేగు తాండవించిన రోజులవి. గుడి పరిసరాల్లో చిరుతపులులు ఒక్కొక్కప్పుడు రెండూ మూడూ కూడా తిరుగుతూ ఉండేవి.

5. శ్రీ భగవాన్ అన్నారు - కప్పను యోగితో పోల్చడం కద్దు. అది నిశ్చలంగా చాల సేపుంటుంది. మెడ క్రింది కండరాల చిరు కదలిక ఒక్కటే, అది బ్రతికియున్న దనటానికి గుర్తు.

మరొకటి. కప్ప అసలు చేతనమాపి చిరకాలముండగలదు. అది దాని నాలుకను మ్రింగుతుందట. అది యోగుల అభ్యాసాల్లో ఒకటి. దానివల్ల యోగి చనిపోడు గాని, అతడు ప్రాణిచేష్ట మళ్ళీ ఆరంభింపక ముందు, ఇంకెవరైనా ఆయన మ్రింగిన నాలుకను సరిగ చెయ్యాలి. ఆ క్రియను కప్ప తానై ఎట్లు నిర్వహిస్తుందో ఆశ్చర్యం.

6. మలయాళంలో సులభశైలిలో వ్రాసిన రామాయణం "రఘువీరన్", అందులో ఒకచోట హనుమంతుడు తనువుతో లంకాద్వీపం చేరకముందే, మానసికంగా అక్కడ చేరియున్నాడని ఉంది.

ఏ పనియైనా శారీరకంగా కన్న మానసికంగా పూనుకొంటేనే సత్వరంగా నిర్వహించటమౌతుందని శ్రీ భగవాన్ నొక్కి చెప్పారు.

7. శ్రీ భగవాన్ ఒక చిత్రమైన పిట్టకథ చెప్పారు. ఎళుత్తచ్చాన్ అని ఒక మలయాళ యోగి, కవి. ఒకనాడు ఆయన కొన్ని చేపలను తన వస్త్రంలో దాచుకొని గుడిలోకి వెళ్ళాడు. ఆయనంటే కిట్టనివాళ్ళు అది ఇతర భక్తుల చెవిలో వేసారు. ఆయన్ను పట్టి తనిఖీ చేసి రాజు వద్దకు తీసుకొని వెళ్ళారు. "ఏమయ్యా, ఇలా చేశావు?" అని రాజడిగితే, ఆయన జవాబు చూడండి- "ఇందులో నా తప్పేమి? వానిని నా గుడ్డల్లో దాచాను. వానిని గుడిలో బయటికి తెచ్చింది నేనా, వీళ్ళా?" అంటే వానిని వెలికితేవటం తప్పు. మలమూత్రాదులు దేహంలో ఉంటే వాని నెవ్వరూ మురికిగా భావించరు. కాని బయటపడ్డప్పుడే వానిని మురికిగా భావిస్తారు. ఈ విషయంలోనూ అంతే.

# భాషణములు 325

గుంటూరువారు శ్రీ రామశాస్త్రి. శ్రీ భగవాన్పై అష్టకము వ్రాసి వారి ఎదుట భావభరితంగా గానం చేసారు. ఆ పిదప శ్రీ భగవాన్ ఉపదేశాన్నర్థించారు - - "నేను సంసారిని జ్ఞాన మార్గాని కనర్హుణ్ణి. లోకవ్యవహారాలు నన్ను చలింపచేస్తున్నాయి. నేనేమి చేయాలో కరుణించి సెలవీయండి."

మహర్షి: భగవంతుణ్ణి తలచుకో. లోకవ్యవహారాలు ఆయన్నేమైనా కలత పెడుతున్నాయా? నీవూ, అవి గూడా ఆయనలోనివే గదా?

రామశాస్త్రి: నామస్మరణ చేసేదా? ఏ నామం ఎన్నుకొనేది?

మహర్షి: నీవు రామశాస్త్రివి ఆ పేరు సార్థకం చేయి. రామునితో ఒకటిగా వుండు.

# భాషణములు 326

చాలాకాలంగా ఆశ్రమంలోనే ఉండిపోయిన పరిచారకు డొకడు అడిగిన ప్రశ్నకు బదులుగా శ్రీ భగవానిట్లన్నారు

"అందరూ మనస్సు అస్థిరమని మొరపెట్టేవారే. ముందు మనస్సును కనిపెట్టనీ, అప్పుడు వారికి తెలుస్తుంది. నిజమే. ఒకరు ధ్యానానికని కూర్చుంటే ఎక్కువగా ఆలోచనలు ముంచుకువస్తాయి. మనస్సే ఆలోచనల మూట. ఆలోచనల మోహరంగుండా దూసుకొని పోవటం సులభంగా అయ్యేది కాదు. ఏదో ఒక విధంగా ఆత్మలో స్థిరపడగల్గితే బాగుంటుంది. అలా చేయలేని వాళ్ళకే జపధ్యానాలు విధించారు. ఏనుగు తొండంతో పట్టుకొని ఉండటానికి ఒక గొలుసిచ్చినట్లు. దాని తొండం ఒక పట్టాన నిలకడగా ఉండదు. పురవీధుల్లో వెళ్ళేప్పుడది తొండాన్నిటూ అటూ ఊగిస్తూనే ఉంటుంది. పట్టుకొమ్మని ఒక గొలుసివ్వగానే ఆ త్రిప్పడ మాగిపోతుంది. అలాగే చంచల మనస్సుతో గూడ జపధ్యానాదుల్లో కూర్చోగనే, ఇతరాలోచనలను త్రోసిపుచ్చి మనస్సు ఒకే ఆలోచనపై నిలుస్తుంది. ఆ విధంగా అది శాంతిస్తుంది. ఈ శాంతి చాలా సులభంగా లభిస్తుందనుకోగూడదు. ఇతరాలోచనలతో చాలా కాలం పోరాటం తప్పదు.

మరో ఉదాహరణ చూడు. ఒక ఆవు పొరుగు పొలాల్లో బడి మేస్తుందనుకొందాం. ఈ చెడ్డ అలవాటు ఒక పట్టాన పోయేది గాదు. దాన్ని కొట్టంలో నిలిపేదెలాగో ఆలోచించు. బలవంతంగా కట్టిపడేస్తే చెడ్డ మేతకై సమయం కొరకై వేచి వుంటుంది. కొట్టంలోనే మంచిగడ్డివేసి మరపుదామంటే మొదట మొదట క్రొద్దిగా గడ్డికొరికినా, అవకాశం దొరికినపుడు పరుగెడుదామా అనేదే దాని ప్రయత్నం. రెండోరోజు రెండు మూడు మారులు మేస్తుంది. ఇట్లు రోజుకు రోజు మేత హెచ్చుతూపోయి, చివరకు చెడ్డమేత అలవాటు తప్పిపోతుంది. అప్పుడు కట్టువిప్పివేసినా, పొరుగువారి పొలంవైపు పోదు. కొట్టంలో దాని పట్టికొట్టినా సరే, అది అక్కడే వుంటుంది. మనస్సూ అలాగే. ఆలోచనల రూపంలో వాసనల ఒత్తిడికి తట్టుకోలేక, మనస్సు బాహ్యానికి పారిపోవడం అభ్యాసం అయింది. లోన వాసనలున్నంతవరకు అవి బయటకు వస్తాయి. అవి అలా పోవాల్సిందే. ఆలోచనలే మనస్సైతే, మనస్సేమని విచారిస్తే, ఆలోచనలు వెనుతిరిగి నపుడు అవి ఆత్మనుంచే వస్తున్నాయి అని సాధకునికి బోధపడుతుంది. ఈ ఆలోచనల మూటే మనస్సు. ఆలోచనలు ఆత్మనుంచి అని ఎరిగి ఆత్మలోనే స్థిరపడితే, మనస్సు మాయమౌతుంది. ఆనందానుభవం లభిస్తుంది. అంతకు మునుపు ఆలోచనలు

ఆపివేయటం, ఎంత కష్టమో, ఈ స్థితిలో ఆలోచనలను తెచ్చుకోవడం అంతే కష్టం. ఇచట ఈ తిరుగుబోతు ఆవు, మనస్సు, ఆలోచనలు ఇతరుల పొలాలు; ఆలోచనలు లేని ఆద్య నిజస్థితి, పశుశాల.

శాంతివలన వచ్చే ఆనందాన్ని పోగొట్టుకోవడం చాలా కష్టం. ఒకమారు రుచి చూచిన వాడు, అది ఏ విధంగా కలతచెందినా సహించడు, గాఢనిద్రలో నున్నవాడు తన్నెవరైనా లేపితే కోపగించుకొని, వానిపని వాణ్ణి చూసుకో పొమ్మంటాడు. ఆలోచనల వలన వచ్చే పనులకై నిద్రాసౌఖ్యం వదులు కోవడం కష్టం. ఆలోచనా రహిత స్థితియే, సహజస్థితి; అది ఆనందమయం. అట్టి స్థితిని గాదని ఆలోచనల వెంట పోయే స్థితికి పోవడంకంటే కష్టముందా?

ఆలోచన రహితస్థితిలోనే ఎప్పుడూ ఉండగోరితే, ఘర్షణ తప్పదు. ఆద్యసహజ స్థితిని మరల పొందటానికి ఎన్నో కష్టాలెదుర్కోవాలి. అందులో జయించి గమ్యాన్ని చేరెనా, శత్రువులైన ఆలోచనలన్నీ ఆత్మలో అణగి నిర్మూలమవుతాయి. ఆలోచనలే విరోధులు. ఆలోచనలంటే విశ్వసృష్టి యన్నమాట. ఆ ఆలోచన లేనినాడు; జగత్తూ లేదు. జగత్కర్త దైవమూ లేడు. ఆత్మానందమే ఉన్న ఏకైక ఆత్మ.

ప్రహ్లాదుడు సమాధిలో నుండగా విష్ణువిట్లు తలపోశాడు - "ఈ అసురుడు ఒక్కడు సమాధిలో నున్నందువల్ల, అసురులందరూ భద్రంగా ఉన్నారు. తగవులు లేవు. బలాబలాలు తేల్చుకోవడాలు లేవు. అధికార వ్యామోహము లేదు. అధికారం పొందడానికి అవకాశాలూ లేవు. అవి లేనందున యజ్ఞయాగాదుల లేక దేవతలు కష్టపడుతున్నారు. క్రొత్త సృజన లేదు, ఉనికికి సమర్థనమూ లేదు. ఇప్పుడు వీని సమాధిని కదుపుతాను. దానితో అసురులు చెలరేగుతారు. వారి సహజప్రకృతి విజృంభిస్తుంది. సురులు వారితో కయ్యానికి కాలుదువ్వుతారు. అసురులు వారి వారు బలం పుంజుకోడానికై సాధనాల నన్వేషిస్తారు. యజ్ఞయాగాదులు ప్రబలమౌతాయి; దేవతలు వర్థిల్లుతారు. అధికాధికంగా సృజన, సమరాలు సాగుతాయి. నా చేతినిండా పని ఉంటుంది.

ఆపై విష్ణువు ప్రహ్లాదుణ్ణి సమాధినుండి లేపి వానికి అమరత్వమూ, జీవన్ముక్తి వరములుగా ప్రసాదించాడు. దేవాసుర యుద్ధం ఆరంభమైంది. పూర్వం పరిస్థితులు నెలకొన్నాయి. ప్రకృతీ ప్రపంచమూ ఎప్పటిలాగే ప్రవర్తిల్లుతున్నాయి.

భక్తుడు: అసుర ప్రకృతిని రేపి కయ్యాలు రేపడం దైవం తాను చేసేపనేనా? దైవం మంచికి మరో పేరుగా ఉండాలి కదా?

మహర్షి: మంచి అనేది సాపేక్షము. మంచియుంటే చెడుకూడా ఉంటుంది. వాటి రెంటికీ సహజీవనం ఎప్పుడూ వుంది. ఇవి రెండూ నాణెమునకు రెండువైపుల వంటివి.

## భాషణములు 327

హాలులోని వారు సావధానంగా వింటున్నారు- అందు శ్రీభగవాన్ భక్తుల్లో చాల శ్రద్ధాళువుల్లో ఒకరు, వింటూ వింటూ తన్ను తాను మరచిపోయాడు. ఆ తర్వాత అతనే తన అనుభవాన్ని వివరించాడు.

శరీరంలో నుండిగాని మరెక్కడినుండైనాగాని శక్తి ప్రసారం ఎటనుండి మొదలగునా అని ఆశ్చర్యపోతూ ఉన్నాను. ఉన్నట్టుండి నా దేహం సూక్ష్మమై అసలు కనుపించలేదు. నేనెవరన్న విచారము స్పష్టంగా, దృఢంగా సాగుతూ వుంది. "నేను-నేను" శబ్ద మొక్కటే మిగిలింది. విశాల ఆకాశం తప్పమరేమీ లేదు. హాలులో జరుగుతున్నవి చూచాయగా తెలిసీ తెలియనట్లున్నవి. అక్కడి వారందరూ వేదపారాయణం కాగానే నమస్కరించటానికై నిలిచారని తెలుస్తున్నది. నేనూ నిలువగోరాను. ఆ ఆలోచన అంతతోనే పోయింది. మళ్ళీ ఆ విశాల ఆకాశంలోనే ఉన్నాను. ఈ అనుభవం అలాగే శ్రీ భగవాన్ కంఠధ్వని విన్నవరకూ నిల్చివుంది. అంతటితో నన్ను నేను చిక్కబట్టుకొని, లేచి, నమస్కరించాను. శ్రీ అరగంటకు పైగా నాకేదో వింతగా తోస్తుండినది. నేనది మరువలేను. ఇంకా ఆ స్మృతి నన్ను వెంటాడుతూనే వుంది.

అతడు చెప్పుచున్నంతసేపూ వింటూ శ్రీభగవాన్ కొన్ని నిమిషాలు మౌనంగా వున్నారు. ఆ తరువాత వారిట్లు పలికారు.

"దేహాన్ని వదలి వెలుపలికి పోతున్నట్లు అనిపించవచ్చు. దేహం ఆలోచనలకంటే ఎక్కువ కాదు? ఆలోచనలు లేక శరీరం ఉండదు. శరీరం లేక వెలికిపోక, లోనికి రాక లుండవు. కాని అలవాటువల్ల ఇట్లు వెడలిపోతున్నామన్న భావన కలుగుతుంది.

వర్షంలో వడగళ్ళు ఒకటి సముద్రంలో పడి కరగి, నీరుగా, అలగా, నురగగా మారిపోతుంది. అలాగే సూక్ష్మమైన బుద్ధి హృదయం నుంచి ఒక చిన్ని బిందువుగా అహంకారంగా వెడలి, పూరించుకొని తిరిగి హృదయంలోనే ప్రవేశించి దానితో ఏకమవుతుంది.

పాలు సముద్రమంత విస్తృతంగా ఉన్నప్పటికీ బిడ్డ దానిని త్రాగటం సముద్రమంత విశాలమైన నోరు పెంచిగాదు. స్తనాగ్రముల సూక్ష్మ నాళికల ద్వారా మాత్రమే బిడ్డ పాలు త్రాగగలడు.

వైష్ణవయోగి నమ్మాళ్వారన్నారు - "నా ఆత్మయే నీవు" దీని అర్ధమేమి? ఇంకా వినండి - "నన్ను నే నెరుగకముందు, నిన్ను వెదకుతూ పలుతావుల తిరిగాను. ఇప్పుడు నా ఆత్మను తెలిసికొని, నీవు నా ఆత్మవు అని గ్రహించాను" దీనికి విశిష్టాద్వైతానికి పొత్తేమి? అందుకుగా దీన్ని ఇలా వివరిస్తారు -- "నీవు నా ఆత్మను వ్యాపించి అంతర్యామిగా ఉంటావు. ఆ రీతిగానే నేను నీ దేహంలో ఒక భాగాన్ని; నీవు నా శరీరానికి యజమానివి. (శరీరివి)

తన శరీరం తాను గాదని వదలివేసి మరియొకరి (భగవంతుని) శరీరంలో భాగం ఎందుకు కావాలి. ఒక శరీరం ఆత్మగాకపోతే, ఇతర శరీరాలెన్నైతే మాత్రం అనాత్మయే? విశిష్టాద్వైతులు ఆనందానుభవానికి వ్యక్తిత్వం అవసరమంటారు. వ్యక్తిత్వము అంటే అహంకారం. అది పోగూడదు. ఆహా! ఆత్మ దేహం కాదు; కాని నీ ఆత్మ దైవానికి దేహం అవుతుంది? ఎంత అయుక్తమిది?

పోనీ, దైవానికి ప్రపత్తి జరిపావా, ఆయనకు నిన్ను నీవు సమర్పించుకున్నావు. నీవు ఆయన వాడవేగాని, నీవాడవు గావే! ఆయన కొక దేహం కావలసివస్తే ఆయన చూచుకోగలడు. ఆయన దేహ స్వామి అని నీవు చెప్పనక్కర లేదు.

## భాషణములు 328

ఒక యూరోపియన్ పెద్దమనిషి, స్ఫుటంగా, మందగంభీరంగా మొదలుపెట్టాడు . "వ్యక్తులు లోకవ్యవహారాల్లో చిక్కుకొని, ఎందుకు కష్టపడాలి? వారు స్వేచ్ఛగా ఉండరాదూ? తాత్త్విక ప్రపంచంలోనైతే వారెక్కువ స్వతంత్రంగా ఉండవచ్చు కదా".

మహర్షి: ప్రపంచమూ ఆధ్యాత్మికమే. నీ భౌతిక కాయంతో నిన్ను తాదాత్మ్యం చేసి కొంటున్నావు గనుక, ఈ ప్రపంచాన్ని భౌతికమనీ, ఆ రెండవది ఆధ్యాత్మికమనీ, అంటున్నావు. ఉన్నదేదో అది ఆధ్యాత్మికమే.

భక్తుడు: శరీరం వీడిన ఆత్మలకు -- భూతాత్మలకు (spirits) అవగాహన గాఢమూ, స్వేచ్ఛ అధికంగానూ ఉంటుందా?

మ: నిన్ను నీవు దేహమనుకుంటున్నావు గనుక, శరీరం వీడిన ఆత్మలను, భూతాత్మలు అన్నావు. పరిమితుల్లో వర్తిస్తూ, నీవు వానికి పరిధుల భావించి, వాని శక్తి ప్రమాణాలను తెలియగోరుతున్నావు. ఈ స్థూల శరీరము పోయిన ఆత్మలకు కూడా సూక్ష్మ శరీరాలున్నాయి. లేకపోతే "శరీరాలు లేని ఆత్మలు" అనవు. తనువర్జితమంటే "స్థూలదేహము వదలిన" అని అర్ధము. వారికి వ్యక్తిత్వ మాపాదిస్తావు గనుక, అవి వాటి సూక్ష్మ శరీరాలతో ఉంటాయి. వాని అవధులు వాని వాని దశలనుబట్టి ఉంటాయి. పరిధుల తాకిడి నీకెట్లో, వానికినీ అట్లే. నేను చెప్తున్న ఆత్మ, ఆధ్యాత్మిక ప్రపంచమూ, పరమాత్మయే గాని, సాపేక్షం గాదు. నిన్ను నీ ఆత్మగా తెలుసుకొన్ననాడు, ఈ ప్రపంచం ఆధ్యాత్మికమేగాని భౌతికము గాదని తెలుసుకొంటావు.

భ: ఆ శరీరాలు మన శరీరాలవలెనే తాత్కాలికమా? అవి మరల జన్మిస్తాయా?

మ: నువ్వు ఈ శరీరం అనుకోవడమే ఈ ప్రశ్నలకు కారణం. ఈ దేహానికి పుట్టుక చావులున్నాయి. ఈ తనువు పోగానే మరొక తనువు. దీనినే పునర్జన్మ అంటారు. కాని నీవు ఈ దేహమా? నీవు దేహానివి కాదు, ఆత్మవని తెలిస్తే నీకు ఈ స్థూల సూక్ష్మ శరీరాల పరిమితి ఉండదు. పరిమితులు లేని స్థితిలో భౌతికమేమి, ఆధ్యాత్మికమేమి, పునర్జన్మను గూర్చిన ప్రశ్న ఎక్కడ?

వేరొక విధంగా చూడు. స్వప్నంలో నీకొక స్వప్న శరీరాన్ని కల్పించుకొని దానితో స్వప్న ప్రపంచంలో జీవిస్తావు. మెలకువ రాగానే అది కల్లయని తేలిపోతుంది.

ప్రస్తుతం నీవీ దేహమనీ, స్వప్న శరీరముకావనీ అనుకుంటావు. స్వప్నంలో స్వప్న శరీరం దృష్ట్యా, ఇప్పటి నీ దేహం నిజం కాదు. దీన్నిబట్టి ఈ రెండు దేహాలూ యథార్థం కాదు. దేనికది ఆయా కాలంలో నిజం, మరొకటి అబద్ధమునూ, కాని నిజమైనది ఎల్లకాలం నిజంగానే ఉంటుంది. నీవు "నే"నంటావు. ఈ 'నేనన్న ఎరుక, జాగ్రత్ స్వప్న సుషుప్త్యవస్థలు మూడింటిలోనూ సమమే. దానిలో ఏ మార్పులేదు. అది మాత్రమే నిజము. మూడవస్థలూ నిజం కావు. అవి కేవలం మనస్సుకు మాత్రమే. నిజస్వరూపం కనిపించనీయక అడ్డేది మనస్సే. నీ నిజస్థితి అనంతాత్మస్థితి. అదే స్థితి నీ నిద్రలో ఉన్నది. మిగత రెండవస్థల్లో దానికి హద్దులెన్నో గమనించు. ఈ భేదమెందువల్ల? నిద్రలో మనస్సు లేదు; రెండవస్థల్లో అది ఉంది. నియమితులం అనే భావం మనస్సు కల్పించింది. మనస్సంటే ఏమిటి? కనుక్కో దానికై వెదకితే, అది తానై మాయమవుతుంది. దానికి యథార్థంగా స్థితి ఉంటేగదా? అది ఆలోచనల సమూహం. ఆలోచనలు మాయమైతే అదీ మాయమౌతుంది.

భ: అప్పుడు 'నేను' మిగులుతానా?

మ: నిద్రలో నీ అనుభవ మేమిటి? అప్పుడు ఆలోచనలు లేవు, మనస్సూ లేదు, కాని నీవున్నావు.

భో: ధ్యానింప యత్నిస్తే, మనస్సు పరిపరివిధాల పోతుంది. ధ్యానము సాధ్యపడదు. ఏం చేయమంటారు?

మ: నీ ప్రశ్నలోనే జవాబుగూడ ఉంది. నీవు మనస్సును నిలువ ప్రయత్నిస్తున్నావు; అది వీలవడం లేదు. 'నీవు' అంటే 'ఆత్మ'. దేనిపై ధ్యానం నిల్పుతావు? ఏ స్థితిలో నీవు విఫలుడవౌతావు? ఆత్మలు రెండున్నవా, ఒకటి రెండవదానిపై మనస్సు నిలుపడానికి? సఫలుణ్ణి కాలేదని చెప్తున్నది ఏది? ఆత్మలు రెండుగా ఉండ వీలులేదు. అది ఒక్కటే. దానికి ఏ ఏకాగ్రతా ఉండనక్కర లేదు.

“అలా అయితే ఆనందం ఎందుకు లేదని" అడగవచ్చు. నిద్రలోని ఆత్మస్థితిలోనే ఉండకుండా చేసేది ఏంటి? చంచల మనస్సని నీవే ఒప్పుకుంటావు. ఆ మనస్సును కనిపెట్టు. 'భ్రమణం' ఆగితే, అదే నీ ఆత్మ. నీ అహంస్ఫురణ. అది నిత్యము, జ్ఞానాజ్ఞానములకు అతీతమైనది.

భ: నాకు చాలా పనులున్నాయి. చిత్తం నిల్ప యత్నించడానికి తీరిక ఉండదు. దాని కుపకరించేవి ఏమైనా ఉన్నవా? శ్వాసను నియమించడం మంచిదేనా?

మ: శ్వాస (ప్రాణ) మనస్సులు, రెంటికీ మూలం ఒకటే. ఆ మూలాన్ని రెండు విధాల చేరుకోవచ్చు;(1) ప్రాణరోధం వల్ల, 2. మనస్సు మూలం జాడ తీయడం వల్ల. రెండవది సాధ్యపడకపోతే, మొదటిది నిస్సంశయంగా ఉపయోగిస్తుంది. శ్వాస గమనాన్ని పరికిస్తూంటే దాని నియమనం జరుగుతుంది. మనస్సును గమనిస్తే ఆలోచనలు ఆగిపోతాయి. శాంతి లభిస్తుంది. అదే నీ సహజ స్వభావము. జనకులన్నారు - "దోపిడి దొంగను (మనస్సును) నేనిప్పుడు కనుగొన్నాను. వాడే ‘నన్ను’ నానుండి దోపిడి చేస్తున్నాడు. ఈ దొంగను వెంటనే చంపేస్తాను." అని. ఆలోచనలు కలిగించే అలజడి ఆత్మశాంతిని దోచుకున్నట్లు కనబడుతుంది. ఆ అలజడే మనస్సు. ఆ అలజడి ఆగితే మనస్సు పారిపోయింది అంటారు. ఆత్మ నిశ్చలమైన అధిష్ఠానంగా (substratum) మిగులుతుంది.

మరియొకరు కలుగచేసికొని అన్నారు

భ: మనస్సే మనస్సును చంపాలి.

మ: నిజమే, కాని మనస్సొకటి ఉంటే. దానికై వెదకితే అది లేదని తెలుస్తుంది. లేని దానిని చంపేదెలాగు?

భ: వాచిక జపంకన్నా మానసిక జపం మేలుకదా?

మ: వాచిక జపం శబ్దంతో కూడింది. శబ్దం ఆలోచనలనుండి పుడుతుంది. ఆలోచనలను శబ్దముతో చెప్పేముందు ఆలోచించాలి. ఆలోచనలనుండే మనస్సు. అందువల్ల వాచికం కన్న మానసిక జపమే మేలు.

భ: జపాన్ని మనస్సుతో చింతన చేస్తూ, ఆపైన వాచికంగా గూడ చెయ్యకూడదా?

మ: జపం మానసికం అయ్యాక వాచికంతో పనేమి? జపం మానసికం కాగా అది ధ్యానం అవుతుంది. ధ్యానమన్నా, మానసిక జపమన్నా ఒకటే. ఎన్నో ఆలోచనలు లేకుండా, ఒకే ఆలోచన, మిగిలిన ఆలోచనలను అన్నింటినీ తొలగించి, ఆ ఒకే ఆలోచన మిగిలితే దానిని ధ్యానమంటారు. ధ్యాన లేదా జపముల ఉద్దేశ్యమే అది ఎన్నో ఆలోచనలను వదిలేసి, చింతనను ఒకే తలపుపై కేంద్రీకరించటం. ఆపైన ఆలోచనకూడా, తన మూలమందు -- శుద్ధచైతన్యమాత్మయందు -- లయమైపోతుంది. మనస్సు జపంతో ప్రవర్తిల్లి, తన పుట్టుస్థానమందే మునిగిపోతుంది.

భ: మనస్సు (mind) పుట్టేది మెదడు (brain)లో అని అంటారు కదా?

మ: మెదడు ఎక్కడుంది? దేహంలోనేగా, దేహమే మనస్సంకల్పితము. మెదడు గురించిన మాట శరీరం గురించి ఆలోచిస్తేనే కదా వచ్చేది. దేహాన్ని, దానిలో మెదడును సృజించి, మెదడు తన స్థానంలో ఉందో లేదో పరిశీలించేది గూడ మనస్సే.

భ: భగవాన్ తమ రచనల్లో, జపాన్ని, దాని మూలం జాడతీయ వలెనన్నారు. భగవాన్ ఉద్దేశం అది మనస్సు అనే కదా?

మ: ఇవన్నీ మనస్సు చేసేవే. జపము మనస్సును ఒకే ఆలోచనకు కేంద్రీకరిస్తుంది. మిగత ఆలోచనలన్నీ -- అవి అదృశ్యములయినదాకా అధీనంలోనే ఉంటాయి. జపము మానసిక మైనపుడది ధ్యానము. ధ్యానమే నీ సహజ స్వభావము. యత్నకృతం గనుక దానిని ధ్యానమన్నారు. ఆలోచనలు అనేకములుంటే, ప్రయత్నం అవసరమౌతుంది. నీకు ఇతర ఆలోచనలున్నాయి. గనుక ఒకే ఆలోచన సాగుతుంటే, దాన్ని ధ్యానంగా పేర్కొన్నారు. ప్రయత్నం లేకనే ఆ ధ్యానం నిలిచినపుడు అది నీ యథార్థ స్వరూపము.

## భాషణములు 329

రామకృష్ణ విజయమని ఒక తమిళ పత్రిక. దానిలోని సెయింట్ ఎస్టెల్లా గాథనుండి కొద్ది భాగం శ్రీ భగవాన్ చదివారు. దాని సారాంశము "నీ శత్రువులు, లోభమోహాలు నీకు కీడు కల్గింస్తుదని తోస్తే, అంతర్ముఖుడవై, ఆ కీడు కారణమన్వేషించు. ఆ నీ కీడు బాహ్యం కాదు. బాహ్యకారణాలన్నీ అధ్యారోపాలు. (super-impositions) నిన్ను నీవు గాయపరచుకోకపోతే పరమదయాళువు దైవము నిన్ను గాయపరచునా?"

శ్రీ భగవాన్ అన్నారు - సెయింట్ ఎస్టెల్లా చక్కటి యోగి. వారి బోధలు చాల చక్కగా వుంటాయి.

భాషణములు 330

శ్రీ భగవాన్కు ఉబ్బసము, గొంతు బొంగురుపోయింది. ఆ సమయంలో ఒకరు నారింజపండ్లను నివేదించారు. ఎప్పటిలాగానే తొనలందరికి పంచడం అయింది. భగవాన్ గొంతు సవరించుకోవడంలో వారు నోట్లో వేసుకొన్న తొనను ఉమ్మేయవలసి వచ్చింది. అది తప్పనిసరి అయి అలా చేయవలసి వచ్చింది అన్నారు భగవాన్. ఒకరు చెప్పారు 'బహుశః అది తమ ఆరోగ్యస్థితికి సరిపడి ఉండదు'.

"మరొకరుగాక ఆ పండ్లు నీవే తెచ్చి ఉంటే ఆ మాట అంటావా?" అని భగవాన్ అడిగారు.

## భాషణములు 331

అంతర్జాతీయ శాంతి కూటమి (International peace league) సభ్యురాలు ఒక అమెరికన్ శ్రీమతి రూర్నా జెన్నింగ్స్ ప్రపంచంలో శాంతి వ్యాపన గురించి భగవాన న్ను తెల్పమన్నది.

భగవాన్ అన్నారు: ఎవరైనా ఆత్మశాంతిని పొందితే అది ఎటువంటి ప్రయత్నమూ లేకుండా అదే వ్యాపిస్తుంది. తాను శాంతంగా ఉండ లేనివాడు దాన్ని ప్రపంచంలో వ్యాప్తి ఎలా చెయ్యగలడు?

భక్తురాలు: ఆత్మానుభవానికి ప్రాచ్యదేశాలొక నిర్దిష్ట శాస్త్రీయపంథా ననుసరించడం నిజమేనా?

మహర్షి: నీవు ఎప్పుడూ ఆత్మవే. దానిని నిర్ధారించడానికి పెద్ద శాస్త్రీయ " పద్ధతులు అక్కరలేదు.

భ: దాని యథార్థం కొంత తెలుస్తోంది. కాని దాన్ని ఆచరించేందుకొక పథకం ఉండాలి. దానినే నేను శాస్త్రము (science) అంటున్నాను.

మ: అట్టి ఆలోచనలు అంతంకావడం, ఆత్మను పొందడమే. ఉదాహరణకు పోయినదనుకొన్న కంఠాభరణం. జగత్తునుగాని తన సొంత దేహాన్నిగాని తనకంటే దూరముగా ఎవ్వడూ జూడడు. ఎల్లప్పుడూ ఆత్మగా ఉండి, తానన్యము లన్నింటినీ చూస్తాడు. దైవమూ, జగత్తూ, ఇవన్నీ హృదయంలో వున్నాయి. చూచువానిని చూడు. సర్వమూ ఆత్మగా కనుగొంటావు. నీ దృష్టిని మార్చుకో. లోనజూడు. ఆత్మను కనిపెట్టు. కర్తృకర్మల కధిష్టానమెవరు? అది చూడు. అన్ని సమస్యలూ పరిష్కార మవుతాయి.

శ్రీమతి రూర్నాకు ఒకరు "నేనెవరు" అన్న చిన్ని పుస్తకమొకటున్నదని తెలిపారు. అది చదివిన తర్వాతనే శ్రీభగవాన్ ప్రశ్నించడానికి ఆమె అంగీకరించింది.

## భాషణములు 332

భక్తుడు: తమిళములో "ముప్పాళ్" అంటారే (మూడు శూన్యములు) అవి ఏవి ?

మహర్షి:
1. తత్ = ఈశ్వర తురీయ
2. త్వమ్ = జీవ తురీయ
3. అసి = అసి తురీయ

జాగ్రత్ స్వప్న సుషుప్తువులకు మూడింటికీ ఆధారము తురీయము.

భ: మొదటి రెండూ తెలుస్తూనే వున్నాయి. ఆ మూడవదేమి?

మ: సర్వవ్యాపకత్వము. జాగ్రత్ అంటారు. తేజస్సర్వము స్వప్నము అంటారు. అనంతత్వము సుషుప్తి (నిద్ర) అంటారు. ఈ మూడింటి అధిష్ఠానమును "అసి" తురీయము అంటారు.

భ: వింతగా ఉంది.

మ: అంతేనా. వాదానువాదములకు (polemics) అంతమంటూ లేదు. వినండి వారి వాదం. తత్త్వమసి యన్న మహావాక్యము సామాన్యము! అయిదు పదముల 'తతత్వమ్ అసి అతి నిజం" అన్నది దక్షిణామూర్తి నిశ్శబ్దంగా కావించిన గుహ్యాతి గుహ్య బోధ. ఆ అయిదు పదములకు ప్రతిగా వారు అయిదు అవస్థలు కల్పించారు.

'విచార సాగర' గ్రంథం చూడు. ఆ గ్రంథకర్త ఆధారాన్ని అధిష్ఠానాన్ని వేరుగా నిర్వచించాడు. ఆయన దృష్టిలో రజ్జువు సర్పంవలె ఉన్నప్పుడూ లేనప్పుడూ గూడ, ఆధారమే. తన యథార్థస్థితికి భిన్నంగా కనబడింది కనుక రజ్జువు అధిష్ఠానం. ఇది సామాన్య అధిష్ఠానము. అది సర్పంగా కన్పించడం విశేషాధిష్ఠానం. ఇక్కడ ఇంకొక ప్రశ్న వేస్తాడు. జీవుని అధిష్ఠానం వేరు, ఈశ్వరుని అధిష్ఠానం వేరుగదా?

ఈ రెండూ ఏకమెటౌను? అని. ఈ అధిష్ఠానములు రెంటికీ ఆధార మొక్కటేయని సమాధానము.

ఇవిగాక కొన్ని ఖ్యాతులను పేర్కొన్నాడు...

1. అసత్ ఖ్యాతి - రజ్జువున్నందు వలన లేని సర్పం దానిలో భాసించింది.

2. సత్ ఖ్యాతి - రజ్జువే సర్పంవలె భాసించింది.

3. ఆత్మఖ్యాతి - రజ్జువని తెలియదు; మునుపెక్కడో చూచిన సర్పస్మృతి

ఈ భ్రాంతికి కారణము.

4. అఖ్యాతి - పూర్తిగా లేనిది. (పూర్తి అబద్ధం)

5. అన్యథా ఖ్యాతి - మనస్సులోని సర్పాకృతి బయట తన ఎదుటనే ఉన్నట్లు దృశ్యమానం కావడం.

6. అనిర్వచనీయఖ్యాతి - వివరించలేనిది.

ఇక్కడ ఇంకొక ప్రశ్న లేవదీస్తాడు - జగత్తు, అది మాయగాని, మిథ్యగాని, పై వానిలో ఏ ఒక్కటైనా అవునా? అది ఏదైనా, పూర్వానుభవ ఫలమే అయివుండాలి. అప్పటి కది యథార్థమే; ఒకప్పుడు నిజమైతే ఎప్పుడూ నిజమే అయి వుండాలి.

దానికి సమాధానం - ఆ అనుభవము తప్పనిసరిగా నిజం కానక్కరలేదు. చూచినది నిజమైన పాముగాదు; దాని బొమ్మను చూచినపుడు మనస్సులో దాని ముద్రయేదో పడింది. అందుచేత రజ్జువును చూచి పామని పొరబడవచ్చు. ఆ రీతిగా జగం సత్యం కానవసరం లేదు.

ఈవాద వివాదాలతో కాలం వ్యర్థం చెయ్యడమెందుకు? అంతర్ముఖుడవై కాలం సద్వినియోగం చేయి.

జీవేశ్వరైక్యంలో ఈశ్వరుని భాగం విన్నది మాత్రమే. ప్రత్యాక్షానుభవం జీవునిది. నీవు ప్రత్యక్ష అనుభవాన్ని ఉపయోగించుకో గలవు. కాబట్టి నీ వెవ్వరో చూడు. అయితే ఈశ్వరుణ్ణి ప్రస్తావించడం ఎందుకు?

నీవు ప్రపంచాన్ని చూస్తున్నావు. దాని పుట్టుపూర్వాలు తెలియ గోరుతున్నావు. దైవం దాన్ని సృజించాడని వారంటారు. ఈ ప్రపంచమూ, నీవూ, సర్వమూ దైవసృష్టియంటే, నీ మనస్సుకేదో సమాధానంగా వుండి, పూర్వమంత చపలంగా ఉండదు. కాని అది అంతా ఆత్మజ్ఞానం కాదు. అలా అయ్యేది నిన్ను నీవెరిగినప్పుడే. అప్పుడే అది పూర్ణమైనా, ఆత్మస్థితియైనా.

వాదానువాదాల విషయానికి తిరిగివస్తాం. 'వృత్తిప్రభాకర' కర్త తానా పుస్తకం వ్రాయడానికి 3,50,000 గ్రంథాలు చదివాను అన్నాడు. ఇంత చదువు ఆత్మానుభవాన్ని సంపాదించి పెడుతుందా? 'విచారసాగరం' నిండా తర్కమూ, పారిభాషిక పదాలే. ఇన్నిన్ని బృహద్గ్రంథాలవల్ల ప్రయోజనం యధార్థంగా ఏమి? కాని కొందరు వానిని చదివి యోగులను వెదుకుతూ వస్తారు. వారు తమ ప్రశ్నలకు జవాబు చెప్పగలరో లేరో చూద్దామని. వానిని చదివి క్రొత్త సందేహాలను కనిపెట్టి వానికి సమాధానాలు సమకూర్చుకోవటం, వారి కది యొక సరదా. అది వ్యర్థమని, తెలిసిన జ్ఞానులు వారిని ప్రోత్సాహించరు. వారి నొక్కమాటు ప్రోత్సహిస్తే, ఇక దానికి అంతుండదు.

ప్రయోజనకరం ఆత్మవిచార మొక్కటే.

తర్కం, వృత్తి ప్రభాకరం, విచారసాగరం, సూత్రభాష్యాది ఉద్గ్రంథాలతో బాగా పరిచయమున్నవాళ్ళు, సంచిత వాసనల వలన 'సద్విద్య'లాంటి చిన్నపుస్తకాలను మెచ్చరు. దానిలో ఆత్మవిచారం తప్ప వేరే విషయమే లేకపోవడం వలన, స్వచ్ఛమైన లేదా తక్కువ మలినముగల మనస్సుకలవారే చిన్నవయినా సరే. ప్రయోజనకరములయిన పుస్తకాల పట్ల ఆసక్తి చూపగలరు...

## భాషణములు 333

ప్రత్యభిజ్ఞ = ప్రతి + అభిజ్ఞ

అభిజ్ఞ = ప్రత్యక్ష జ్ఞానం; ప్రతి = అంతకుముందే తెలిసి ఉన్నదానిని స్మృతికి దెచ్చుకోవటం.

ఇది ఏనుగు = ప్రత్యక్ష జ్ఞానము

ఇది ఆ ఏనుగు = ప్రత్యభిజ్ఞ

పారితోషిక గ్రంథాలలో నిత్యస్థితమైన సత్యాన్ని ఎరిగి గుర్తించడాన్ని ప్రత్యభిజ్ఞ అంటారు.

'శూన్య', 'అతిశూన్య', 'మహాశూన్య' అన్నీ ఒకే అర్థం గలవి. అనగా "సద్వస్తువు" అని అర్థము.

## భాషణములు 334

ఎంతగా రుద్దుకొన్నా, కాళ్ళలో స్పర్శ (sensation) తోచడం లేదన్నారు, శ్రీభగవాన్, "నడవటానికి ఉపయోగిస్తే చాలు, స్పర్శ తోస్తేనేం, తోచకుంటే ఏం?" మరికొంత సేపటికి, క్రొత్తగా కనుగొన్న ఒక కాంతి కిరణాన్ని శ్రీ భగవాన్

వర్ణించారు. దాన్ని ప్రసరింపచేస్తే, ప్రచాలకుడు కనిపించడు. కాని వాడా దృశ్యాని చూడగలడు. సిద్ధాదులూ అట్లే. వారు శుద్ధమైన కాంతి. వారితరలును చూస్తారే గాని, ఇతరులు వానిని చూడలేరు. ప్రభులింగడు ఉత్తరదేశయాత్ర చేస్తూ గోరఖ్నాథ్ను కలుసుకున్నాడు. గోరఖ్నాథ్ తమ యోగసిద్ధులను ప్రదర్శించారు. ఖడ్గంతో ఆయన చేతిని తెగవేయబోతే కత్తి వంగిపోయింది. చేతి కావంతైనా గాయం కాలేదు. దీన్ని కాయసిద్ధియన్నారు. సవినయంగా ప్రభులింగడు ఆ కత్తిని తనపై ప్రయోగించమన్నాడు. ఎన్నిమార్లో ఎన్ని దిశలుగానో కత్తివారి దేహాన్ని, ఈ కొసనుంచి ఆవలి కొసకు, గాలిని

నరికినట్లు నరికిందిగాని, ఆయన దేహంలో ఏ గాయమూ కనబడలేదు. గోరఖ్నాథ్ విస్మయం మేరలు దాటింది. అతడు తక్షణం ప్రభులింగని శిష్యుడైనాడు.

కైలాసంలో శివ పార్వతుల సంవాదమొకటి. అల్లమప్రభు విషయం చెబుతూ శివుడు ఆయన పార్వతి విభ్రమవిలాసాల కేమాత్రం చలింపడన్నాడు. పరీక్షిస్తానని పార్వతి తమోగుణాన్ని పంపింది. అది ఒక రాజు కూతురుగా పుట్టి, పెరిగి అల్లమని వశీకరించుకోవలెనని ఆదేశం. సర్వకళాకోవిదగా ఆ పిల్ల ఎదిగింది. ఆమె దేవాలయంలో గానం చేసేది. అల్లమ అక్కడ మృదంగం వాయించేవాడు. ఆమె అతన్ని వలచింది. ఒకమారామె పడకగదిలో వారిర్వురూ చేరడం తటస్థించింది. వాని నామె కౌగలించుకొంది గాని, అతని స్పర్శయే ఆమెకు తెలియరాలేదు. ఆమె మన్మథజ్వరంతో ఆర్తి చెందింది. కాని ఒక దేవదూతిక ఆమె వద్దకు వచ్చి ఆమె జన్మించిన కారణం విడమరచి చెప్పింది. ఆమె అల్లమ వశపరచుకోవడానికి తల్లక్రిందులైంది గాని సఫల కాలేదు. చివర కామె కైలాసానికి మరలిపోయింది. పార్వతి పంపిన సత్త్వగుణం భూమిపై బ్రాహ్మణ సన్న్యాసినిగా అవతరించింది. ఆమె తన్ను అల్లమకు శరణాగతి చేసేకనే అతని మహానుభావత ఆమెకు తెలిసివచ్చింది.

శ్రీ భగవాన్ 'నాయన'ను మెచ్చుకొంటూ ప్రసంగించారు - 'నాయన' కావ్యకంఠ గణపతి ముని. వారెంతటివారో వారి 'ఉమాసహస్ర', 'హరసహస్రా'ల రచన, వారు విద్యార్థుల కెట్లు బోధించేది, భట్టశ్రీ నారాయణ శాస్త్రితో వారి వాగ్వాదము, పాండిత్యమూ శక్తి అంతగా వున్నా వారెంత వినయమూ సరళచిత్తము గలవారో, గంటకు పైగా ఏకరువు పెట్టారు.

సంగం కాలములో విద్వాంసుడు నక్కీరర్ శివుని ఆగ్రహానికి గురియైన వైనం భగవాన్ వర్ణించారు. శివుని తమిళ రచనల్లో ఒకదానిలో నక్కీరర్ తప్పుపట్టాడు. శివుడు ఉగ్రుడైనాడు. ఆయన భూతగణాల్లో ఒకటి నక్కీరర్ను పట్టి బాధించి, ఆ తరువాత ఎప్పుడో వదలిపెట్టింది.

ఒక తీర్థక్షేత్రంలో నక్కీరర్ తపస్సు చేస్తున్నాడు. ఆయన సమీపంలో ఒక చెట్టు. దాని ఆకురాలింది ఆకులో సగం నీటిలో, సగం భూమిపైనా ఉంది. ఉన్నట్లుండి నీటిలోని సగం చేప అయింది; నేలమీది సగం పిట్ట అయింది. అది నీటిలోనికి, ఇది భూమిపైకి పెడదామని ఒకే పోరు. కాని వాని రెంటినీ అ ఆకు వదలలేదు. నక్కీరర్ ఆశ్చర్యంగా చూస్తున్నాడు. తటాలున ఏదో దేవత వచ్చి నక్కీరర్ను పట్టి ఒక గుహలో పడవేసింది. అక్కడ అప్పటికే 999మంది బంధితులున్నారు - అందరూ తపోభ్రష్టులే.

భక్తుడు: నక్కీరర్ తపోభ్రష్టులా?

మహర్షి: కాదా? ధ్యానం చేస్తున్నవాడు, ఎదుట జరిగే వింత దృశ్యం చూడడానికై ధ్యానం మానివేస్తాడా?

శ్రీ భగవాన్ ఆ తరువాత నక్కీరర్ తిరుమురు హాట్రుప్పడై రచించి ఆ వేయిమంది బంధితులనూ ముక్తుల జేసిన గాథను వర్ణించారు.

## భాషణములు 335

భక్తుడు: కామవాంఛ పోయేదెలా?

మహర్షి: భేదబుద్ధి (వేరు భావము) పోయినప్పుడు.

భ: అదెట్లు సాధ్యం?

మ: లింగభేదమూ, దాని సంపర్కమూ, రెండూ మనస్సు కల్పించినవే.

ఉపనిషత్తు వచించినట్లు అందరూ ప్రియులే, తన్ను ప్రేమించని వాడెవడూ ఉండడు గనుక. సౌఖ్యము మనలో ఉంది - ప్రేమ ఆత్మపరమే. అది కేవలం అంతస్థము. అది బయట ఉందని అనుకోవద్దు. అప్పుడు ఆ భేద బుద్ధి పోతుంది.

## భాషణములు 336

వైశ్యులొకరు, ఉపనిషత్తులు శ్రీ మద్భగవద్గీత చదివినట్లున్నారు. ఆయన అడిగారు

భక్తుడు: ఆత్మ సాక్షాత్కారము ఎలా?

మహర్షి: ఆత్మ ఎప్పుడూ ప్రత్యక్షమే. అది అట్లుండని క్షణంలేదు. అది నిరూపించే దెట్లు? ఆత్మను వెదకి పట్టుకో. నీవే అది.

భ: కాని పరమాత్మ కనిపించేటప్పుడు హృదయగ్రంథులు తెగిపోతాయనీ సంశయాలన్నీ మాసిపోతాయనీ అంటారే!

మ: ఆత్మగా ఉండటమే ఆత్మను దర్శించటం. ఒకటి మరొకటిని చూడటానికి ఆత్మలు రెండు లేవు.

తరువాత కొంతసేపు ఆత్మవిచార చర్చయే సాగింది.

భ: ఆత్మ సాక్షాత్కారం అయ్యే దెలాగ?

మ: అది ప్రత్యక్షంగానే వుంది. ఈ చిన్న విషయం తెలుసుకుంటే చాలు.

భ: నాకది తెలియదే. తెలుసుకోవడమెలాగ?

మ: నీవు ఉన్నావని ఒప్పుకుంటావా? లేదా?

భ: ఒప్పుకుంటాను.

మ: అంటే సత్యాన్ని అంగీకరించావు అని అర్థం!

భ: అయినా, నాకేమీ బోధపడలేదు. ఆత్మను నేనెలా సాధించుకొనేది?

మ: 'నే'నంటున్నావా? ఆ అనేదెవరో చూడు.

భ: సరే, 'నే'నని నే నంటాను.

మ: ఆ 'నేను' ఎవరు? అది దేహమా? దేహ భిన్నము మరేదైనానా?

భ. అది దేహం కాదు, దానితో కూడ మరొకటి.

మ: అది కనుక్కో

భ: నా చేత కావడం లేదు. ఎట్లా కనుగొనేది?

మ: నీ దేహం నీ కిప్పుడు తెలుసు; కాని గాఢనిద్రలో ఎరుగవు. అయినా నిద్రలో నీవు వుండనే వున్నావు. లేవటం మొదలు దేహానికి తాదాత్మ్యం చెంది, "ఆత్మానుభవం నావల్ల గాదు" అంటావు. ఆ మాటను నీ నిద్రలో అన్నావా? అనలేవు, నీ వప్పు డఖండాకారంగా వున్నావు గనుక. ఇప్పుడు దేహపరిమితిలో కుచించుకొనిపోయి "నేను ఆత్మానుభవం పొందలేదంటావు. నిన్ను నీవు పరిమితం చేసుకోనేల, దుస్థితిలో ఉన్నావని బాధ ఏల? నీ సహజస్థితిలో ఉండి సుఖపడు. నిద్రలో నీవు 'నే'ననవు; ఇప్పుడట్లంటావు. ఏం? దేహాన్ని పట్టుకొని ఉన్నావు గనుక. ఎక్కడినుండి ఈ 'నేను' వచ్చిందో కనిపెట్టు. అప్పుడు ఆత్మసాక్షాత్కార మౌతుంది.

దేహము జడం గనుక తన్ను 'నే'ననదు. ఆత్మ అనంతం, అనవధి గనుక, అదీ 'నే'ననలేదు. మరి ఈ 'నే'ననే దెవ్వరు?

భ: నా కర్థం కాలేదు. ఈ 'నేను'ను కనుగొనే విధమేమి?

మ: ఈ 'నేను' ఎక్కడ పుడుతున్నదో చూడు. అప్పుడు, ఈ "నేను" అనే భావన పోయి, అనంతమైన 'అహం' స్ఫురణ మిగులుతుంది. ఈ "నేను" అనేది చైతన్యం జడముల నడుమనున్న గ్రంథి. దేహము 'నేను'కాదు. ఆత్మ "నేను" కాదు. మరెవ్వరీ "నేను?" అదెక్కడినుంచి వస్తుంది?

భ: అదెక్కడనుండి వస్తుంది?

మ: కనిపెట్టు.

భ: నాకు తెలియదు. దయచేసి తెలియచేయండి.

మ: అది బయటనుండి వచ్చేది కాదు. అది లోపలనుండే వస్తుంది. దాని రాక ఎక్కడినుండి? ఇంకెక్కడో ఉంటే ఇతరులు నిన్నక్కడ చేర్చవచ్చు. నీలోనే ఉన్నది కాబట్టి నీవే కనుక్కోవాలి.

భ: తలనుండేనా?

మ: "నేను" అనే భావన వచ్చే "తల" అనే భావన వస్తుందా లేక "తల నుండి" "నేను" పుడుతుందా? 'నేను' తలలోనిదైతే నిద్రావశుడవైనప్పుడు, తలను వంచుతావెందుకు? 'నే'నెప్పుడూ స్థిరమే. కాబట్టి దాని స్థానమూ స్థిరంగా ఉంటుంది. తల ఒకప్పుడు వంగీ మరొక్కప్పుడు నిటారుగా మారుతుంటే, అది 'నేను'స్థాన మెట్లౌతుంది? నిద్రలో తల నడ్డంగా ఉంచి పడుకుంటావు. మెలకువలో తల ఎత్తి ఉంటుంది. అది 'నేను' కాగలదా?

భ: అది మరేమి?

మ: 'నేను' లోపలినుండి వస్తున్నది. నిద్రలో 'నేను' లేదు. నిద్రనుంచి లేవడానికి ఒక్క క్షణం ముందు "నేను" ఉంటుంది.

భ: హృదయగ్రంథి, భ్రూమధ్యంలో ఉందంటారే.

మ: భ్రూమధ్యంలో అని కొందరూ, మూలాధారంలోనని మరి కొందరు అంటారు, ఏదైనా శరీరాన్ని దృష్టిలో నుంచుకొనే. కాని దేహభావన, "నేను" భావనకు తరువాత.

భ: కాని నేను నా దేహాన్ని విసర్జించలేను.

మ: ఆ అనడంలో నీవు దేహానివి కాదని ఒప్పుకొంటున్నావు.

భ: ఈ దేహంలో ఎక్కడైనా బాధ వుంటే నాకు తెలుస్తుంది. ఇంకొకరి దేహమైతే, తెలియదు. ఈ దేహభావం నుండి బయటపడలేను.

మ: ఈ దేహబుద్ధియే, అట్లనుకోవటానికి కారణం. హృదయగ్రంథి అంటే అదే.

భ: ఆ గ్రంథి పోయేదెలా?

మ: ఎవరికా గ్రంథి? అది పోవలెనని, నీకెందుకు? అది నిన్ను అడుగుతోందా?

లేదా నీవు దాన్ని అడుగుతున్నావా?

భ: అది అడగలేదు గనుక, నేనే అడుగుతున్నాను.

మ: ఆ 'నే'నెవరు? అది తెలుసుకుంటే ఆ గ్రంథి యుండదు.

భ: ఆ గ్రంథి దేహానికి అనుషంగికం (సహచారి) పుట్టుకవలన దేహం ఉంది. పునర్జన్మ లేకుండేదెలా?

మ: పుట్టినదెవరు? ఆత్మ పుట్టిందా? లేక పుట్టింది దేహమా?

భ: దేహమే.

మ: మరి? మరింక పుట్టకుండా ఉండే ఉపాయంగురించి దేహాన్నే అడగనీ.

భ: అది అడగదు గనుకే నే నడగటం.

మ: ఈ దేహం ఎవరిది? గాఢ నిద్రలో నీవు దేహం లేకుండా వున్నావు “నేను” ఆలోచన కల్గగానే దేహం మేల్కొన్నది. కాబట్టి మొదటి పుట్టుక “నేను”ఆలోచన. ఆ తర్వాత పుట్టుక దేహానిది. కాబట్టి దాని పుట్టుకఅంత ప్రధానం

కాదు. ప్రధాన కారణాన్ని వదల్చుకో, రెండవది తనంతతానే అదృశ్యమౌతుంది. భ: ఈ "నేను" ఆలోచన లేవకుండా ఆపేదెలా?

మ: ఆత్మవిచారంవల్ల.

భ: అర్థం చేసుకో యత్నిస్తున్నాను, కాని చేతకావడం లేదు. జపం వల్ల ఆత్మను కనుగో వీలవునా? అది ఎలాగో దయచేసి చెప్పండి.

మ: ఏ జపం? అసహజాలైన జపాలెందుకు? నీలో నిరంతరం జరుగుతున్న నిత్య, సహజ జపాన్ని కనిపెడితే సరి.

భ: ఏదైనా ఉపదేశం నాకు సాయమౌనేమో?

మ: నీవలెగాక, పుస్తకాలతో కుస్తీపట్టని వానిని, 'రామ, రామ'యని జపించమంటా ననుకో. వాడు దానిని చేస్తాడు, మరి వదలడు. నీవలె చదువులు చదివీ, విషయాల లోతుపాతులు తీస్తున్న వారికి నేను చెపితే, వారు చాల రోజులు చేయనూ చేయరు; పైగా 'నేనెందుకీ జపం చేయాలి? ఈ జపం చేస్తూ కూర్చోడానికి 'నే'నెవరు? ఇకపై జపించకముందు 'నే'నెవరో కనుక్కో” అని జపాన్ని ఆపి, విచారం సాగిస్తారు.

భ: ఇంద్రియాలు వెలుపలికి ప్రసరించేవి (పరాంచిఖాని), కాని లోజూపు 'ఆవృత్త చక్షువు" అంటారే, ఆవృత్త చక్షువు అంటే ఏమిటి?

మ: అంటే కనుపాపను వెనిత్రిప్పి ఉంచడం గాదు. చక్షువంటే ఏమి?

భ: కన్ను

మ: చూచేది కన్నా, దాని వెనుక మరేదైనానా? కన్ను చూడగలిగితే, శవం చూస్తుందా? కంటి వెనుక నున్నదేదో, కంటి ద్వారా చూస్తుంది. చక్షువంటే అది.

భ: భౌతికమైన కన్ను సామాన్య చక్షువు. దైవవిభూతి పరికించటానికి దివ్యచక్షువు అవసరము.

మ: ఓహో! అలాగా? నీవు 'సహస్రాదిత్య సంకాశం' అతనిని జూడ గోరుతున్నావన్నమాట. ఇత్యాదిగా,

భ: ఏం చూడగూడదా?

మ: ఒక సూర్యుణ్ణి చూడగలవా, వేయింటి మాటెందుకు?

భ: దివ్యదృష్టితో చూడసాధ్యమై ఉండవలె. 'అక్కడ రవి ప్రకాశింపడు ... అదీ నా పరమపదము' అంటే సూర్యుడు నిస్తేజుడయ్యే స్థితి ఒకటి ఉన్నట్లే. ఆ స్థితియే బ్రహ్మము.

మ: సరే, కృష్ణుణ్ణి పట్టుకో. చిక్కు వీడిపోతుంది.

భ: కృష్ణుడిప్పుడు బ్రతికి లేడే!

మ: గీత చదివి నీవు నేర్చిందింతేనా? ఆయన తాను నిత్యుడ ననలేదా? కృష్ణుడంటే నీ ఆలోచనేమి? వానిని దేహమనెనా?

భ: వారు బ్రతికి యుండగా ఒరుల కుపదేశించారు. ఆయన చుట్టూరా ఉన్నవాళ్ళు తరించి యుంటారు. నే నలాంటి బ్రతికి ఉన్న గురువును వెదకుతున్నాను.

మ: అంటే ఆయన దేహం వదిలివేశాక, గీత పనికిమాలిందన్న మాట. ఆయన తన్ను దేహంగా నిర్వచించారా?

భ: "నత్వే వాహం జాతునాసం..." (నే నెప్పుడూ ఉండకపోయింది లేదు) కాని నాకు కావలసింది ప్రత్యక్షంగా, స్వముఖతః సత్యం దెల్పే గురువు.

మ: ఆ గురువు వెవరౌతారోగాని, వానికి శ్రీకృష్ణుని గతే పడుతుంది. పృచ్ఛకుడంతతో వెళ్ళిపోయాడు. ఆ తరువాత భగవాన్ అన్నారు. దివ్యచక్షువంటే స్వప్రకాశము. 'దివ్య' పదము అది సూచించేదదే. పూర్తిగా దివ్యచక్షువనుకుంటే, అది 'ఆత్మ'కు పర్యాయపదము. దివ్యచక్షువును ప్రసాదించే వారెవరు? చూచేదెవరు? పుస్తకాల్లో చదువుతారు శ్రవణం, మననం, నిదిధ్యాసనము' లవసరములని. ఆత్మసిద్ధికి ముందు సవికల్ప సమాధి, నిర్వికల్పసమాధి అన్నీ గడపవలెననుకుంటారు. అందుచేతనే, ఈ ప్రశ్నలన్నీ. ఆ వ్యూహంలో పడి పరిభ్రమించడ మెందుకు? దానివల్ల తుదకు ఒరిగేదేమి? విచార ప్రయాస తప్పించుకొనే ఉపాయం తప్ప, మరొకటి గాదు. ఆత్మనిత్యమూ, స్వయంసిద్ధమూ అని వారిక తెలుసు. వారా ప్రశాంతిని ఇప్పుడే ఏల పొందరాదు?

పెద్ద చదువులు చదవని సరళచిత్తుడు, జపంతో అర్చనతో తృప్తిపడతాడు. జ్ఞానులంటారా, వారికి ఎలాగూ తృప్తి ఉంటుంది. కష్టమంతా ఈ పుస్తకాల పురుగులకే. మంచిదే. మంచిదే వారూ ఎలాగోలాగ ముందుకెళ్తారు.

## భాషణములు 337

కె.ఆర్.వి. అయ్యర్: మనస్సును శుద్ధి చేయుట ఎట్లు?

మహర్షి: కర్మ, భక్తి యోగాదుల వల్లనని శాస్త్రము లంటాయి. నా పరిచారకుడా ప్రశ్నసే మునుపడిగాడు. “దైవార్పిత కర్మవల్ల" అన్నాను. కర్మచేస్తున్నంతసేపే భగవంతుని చింతించిన మాత్రం చాలదు. అవిరళంగా సదా, అతనిని ధ్యానించవలె. అట్లైతేనే మనస్సు శుద్ధమవుతుంది.

ఆ పరిచారకుడది తనకు వర్తింపచేసుకొని ఇట్లన్నాడు శారీరకంగా భగవంతుని నేను పరిచరించిన మాత్రాన చాలదు. ఆయన్ను నేను సదా స్మరిస్తూనే ఉండాలి."

అదే ప్రశ్న అడిగిన మరొకరికి భగవాన్ చెప్పారు - "ఆత్మ విచారం చేయి. దేహాత్మ బుద్ధి నష్టమైపోవాలి.” (ఆత్మవిచారం అంటే దేహాత్మ బుద్ధి పోవడమే)

## భాషణములు 338

శ్రీమతి జెన్నింగ్స్ అమెరికన్ వనిత కొన్ని ప్రశ్న లడిగింది.

"ఆత్మ విచారం కన్న దైవమందలి దృఢవిశ్వాసం, ఎక్కువ శక్తివంతం కాదా? విశ్వాసప్రకటనం, అసందిగ్ధమూ, ప్రత్యక్షమూ, ఆ రెండవది, లేదు అనే భావం మీద ఆధారపడినది, మరియూ అది “పేరు” అనే భావాన్ని సూచిస్తుంది.

మహర్షి: ఆత్మానుభవానికై వెదకినంతకాలం, ఆత్మవిచారం చేయమని సలహా.

మార్గాన్ని వెదకటం అనడంతోనే ఇతరత్వం సూచిస్తుంది.

భ: 'నేను పరమాత్మ'ననడం, 'నే నెవరు' అని ప్రశ్నించడంకన్న మేలుగదా?

మ: ఆ విధంగా ప్రకటించే దెవరు? అలా చెప్పడానికి ఒకరుండాలి కదా! వారెవరో తెలుసుకో.

భ: విచారంకన్న ధ్యానం మేలుగదా?

మ: ధ్యానం మానసిక రూపకల్పన నపేక్షిస్తుంది. విచారం సత్యానికై వెదకడం, మొదటిది విషయికము (objective); రెండవది ఆత్మ ప్రత్యయికము. (subjective)

భ: కర్తృనిర్ధారణకు శాస్త్రీయవిధాన మొకటుండాలి.

మ: అయథార్థం వీడి, యథార్థాన్ని వెదకటమే శాస్త్రీయము.

భ: నా ఉద్దేశ్యం మిథ్యానిరాకరణానికి ఒక క్రమం వుండవలెనని మొదట మనస్సు, తరువాత బుద్ధి, ఆ పైన అహంకారం ఈ విధంగా,

మ: ఆత్మయే సత్యం. ఇతరములన్నీ మిధ్యలే. నీకు వేరుగా మనోబుద్ధులు లేవు. "నిశ్చలంగా వుండు, నేను దైవమని తెలుసుకో" అన్నది బైబిల్, ఆత్మయే దైవమని ఎరుగుటకు నిశ్చలత ఒక్కటే కావలసింది.

భ: పాశ్చాత్య ప్రపంచము ఈ బోధనలు గ్రహించగల్గుతుందా?

మ: కాలదేశముల మాటయే లేదు. గ్రహణశక్తి మనఃపరిణితిని బట్టి ఉంటుంది. ప్రాచ్యమైతేనేం, పశ్చిమమైతేనేం.

శ్రీ భగవానామెను 'సద్విద్య'లోను, తాయుమానవర్ రచనలోనూ కొన్ని పద్యాలను చూడమన్నారు. ఆమె వానికై వెళ్ళింది.

తరువాత భగవాన్ వేదాంతమంతా బైబిల్ ని రెండు వాక్యాలలో ఇమిడి ఉందన్నారు. 'నేనదే నేను (I am that I am) "నిశ్చలంగా ఉండు. నేను దైవమనని తెలుసుకో" (Be still and know that I am God) ఇవే ఆ వాక్యాలు.

'విశ్వ చైతన్యము' (cosmic consciousness) గ్రంథకర్త, వ్యక్తి జీవితంలో కొన్ని వయఃపరిమితుల్లోనే ఆత్మానుభవం సాధ్యమన్నారని ఒక రైల్వే అధికారి అయిన శ్రీ కె.ఎస్.ఎన్. అయ్యర్ భగవాన్కు తెలిపారు.

మ: నేను ఇన్నేండ్లు పూర్వము, లేక ఇన్నేండ్లకు పిదపే రావలె ననేవాడెవడైనా ఉన్నాడా? పరమాత్మ, ఇక్కడే, ఇప్పుడే ఉన్నాడు. ఆ గ్రంథకర్త రచించిన వాక్యాల లాంటివి విపరీతార్థాలూ, జనులు వానివలన వంచితులై, ఈ జన్మలోనే తమకాత్మసిద్ధి కలుగదనీ, మరుజన్మలో సాధ్యమౌనేమో యత్నించి చూడవలెననీ అపోహపడతారు. దీనికి అర్థం లేదు.

## భాషణములు 339

శివవిశిష్టాద్వైతము (శైవసిద్ధాంతము) పై భగవానిట్లన్నారు 'గరుడోహం భావన' (నేను గరుడనన్న ఆలోచన). మానవుణ్ణి గరుడ పక్షిని జేయదు; కాని పాముకాటు వేస్తే, ఆ విష ఫలితాలనుండి రక్షిస్తుంది. అలాగే 'శివోహం' భావనగూడా. ఎవడూ శివుడై కూర్చోడు. వాని అహంకారం వలన కలిగే దుష్ఫలితాలను అంతమొందిస్తుంది. అట్లుకాకుంటే, అతడు తన వ్యక్తిత్వాన్ని నిలుపుకొని శుద్ధుడై శివతనువులో భాగంకాగల అర్హతను సంపాదించవచ్చు. అట్లే, అతడు పరమానందాన్ని అనుభవించవచ్చు. ఇదే ముక్తి అంటారు. శైవసిద్ధాంతులు, ఇది వారి వ్యక్తిత్వాభిమానాన్ని తెలిపేదేగాని, యథార్థమైన మోక్షానందాన్ని తెలుపదు.

## భాషణములు 340

శ్రీ బోస్ మొదలుపెట్టాడు - "శరీర చేతన వచ్చిన తరువాత ..."

మహర్షి: 'శరీర చేతన' అంటే? అది మొదట చెప్పు. చైతన్యం కాకుండా నీవెవరవో చెప్పు, శుద్ధ చైతన్యం నుండి అహంచేతన, దానినుండి శరీరం చేతన, దానివలనే శరీరం తెలుస్తుంది.

చైతన్యం ఎప్పుడూ ఉంటుంది. అది తప్ప మరేదీ లేదు. నీవు శరీర చైతన్యం అనుకుంటున్నావే, అది అధ్యారోపం. శుద్ధచైతన్యమే మిగిలి మరేమీ లేకుంటే

అప్పుడు ---

"ఆత్మనస్తుకామాయ సర్వం ప్రియం భవతి" (ఆత్మ ప్రీతి వల్లనే అందరియెడల ప్రీతి) యన్న శ్రుతివాక్యం సరిగా అర్థమవుతుంది. అలా అయితే ఆత్మహత్య లెందుకన్న ప్రశ్న రావచ్చు. తానెందుకు తన్ను చంపుకుంటాడు? సుఖం

కరవైపోయి, తన దుస్థితిని తుదముట్టించుటకట్లు చేస్తాడు. తన దేహం అన్ని దుఃఖాలనూ సూచిస్తుంది. అట్టి దేహంతో సంపర్కము ఆత్మహత్యతో తెగతెంపు చేసుకుంటాడు. వాని శరీరాన్ని చంపటాని కొక హంతకుడుండాలి. ఆత్మహత్య పిదప మిగిలినది వాడే. అదే ఆత్మ.

## భాషణములు 341

శ్రీమతి జెన్నింగ్స్: ఆలోచనల దాడి నుండి మోచనమే ఆత్మస్థితియన్నారు భగవాన్. ఈ జీవిత విధానంలో ఆలోచనలకెట్టి స్థానమూ లేదా? ఆ స్థానం కొంత క్రింది స్థాయిలోనయినా సరే ఉండవచ్చు.

మహర్షి: ఆత్మనుంచి "నేను" భావన. దానినుంచి వచ్చేవే ఆలోచనలు. కాబట్టి ఆత్మరూపమే "నేను" భావన, ఆలోచనలూ. ఇక ఆలోచనలుంటే ఏం, లేక పోతే ఏం?

భ: మంచి ఆలోచనలు ఆత్మానుభవానికి సాయపడతాయా? అచటికి చేర్చే నిచ్చెనలో అడుగు భాగంలోనే అయినా, అవి సరియైన సోపానాలని నమ్మవచ్చా?

మ: అవును అవి చెడుతలంపులను రానీయవు. ఆత్మస్థితికి ముందు, అవి కూడా పోవల్సిందే.

భ: సృజనాత్మకాలైన యోచనలు, ఆత్మజ్ఞానంలో అంశాలు గనుక సహాయకాలు గావా?

మ: అవి చేసే సాయం, నేను పైన చెప్పినట్లే. అవన్నీ ఆత్మలో లయమవాల్సిందే. మంచివిగాని, చెడ్డవిగాని, ఆలోచనలన్నీ నిన్ను ఆత్మకు దూరం చేసేవేగాని, దరికి చేర్చేవి గావు. ఆలోచనలకన్నా ఆత్మ మనకు సన్నిహితం. నువ్వు ఆత్మవు, ఆలోచనలు ఆత్మకు భిన్నమైనవే.

భ: సాయపడిన తన సృష్టినే ఆత్మ తనలో లీనంచేసుకొంటుదన్నమాట. నాగరికతగూడ తన్ను ప్రవృద్ధము చేసే సాధనాలను కల్పించుకుంటుంది. కాని అయథార్థాలను పూజించడంతో వానిని దురుపయోగం చేసి దూరం చేసుకుంటుంది.

మ: నీ ఆలోచనలకు నీవు వేరు గావా? అవిలేక నీకు ఉనికి లేదా? కాని నీవులేక ఆలోచనలు ఉంటాయా?

భః ప్రాయికంగా (generally) నాగరకత, నెమ్మదిగానైనా, నిశ్చయంగా ఆత్మానుభవానికభిముఖంగానే సరియైన మార్గాన సాగుతున్నదా?

మ: జీవన చక్రంలొ నాగరకతా ఒక భాగమే. అన్నింటివలెనే అది కూడా చివర కాత్మానుభవంలో కలిసిపోవాల్సిందే.

భ: విశేషంగా మనోబుద్ధు లాదేశించినట్లే వర్తిల్లే నాగరునికన్నా ఎక్కువగా అచ్చమైన ఆదిమజాతి మనిషి ఆత్మానుభవానికి దగ్గరా?

మ: ఆత్మజ్ఞు డాటవికుడుగా కనిపించవచ్చు. కాని అటవికుడు ఆత్మజ్ఞుడు కాడు.

భ: మనకు సంభవిల్లేవన్నీ దైవనియతివల్లనే అనీ, అందుచేత అవి మనమేలు కొరకే అనుకోవచ్చునా?

మ: తప్పక. కాని దైవమూ తదితరులూ ఆత్మకు భిన్నులు కారు. నీ వాత్మస్థితుడవైతే. వారిని గూర్చి ఆలోచన లెలావస్తాయి?

భ: “శరణాగతి”యంటే చీమలూ, దోమలూ, పాములూ వంటి పీడాకరాలను సహించుటమా? ఆ ఒప్పుకోవడం, యిష్టపడి భరించడం లేదా నిజంగానే ఏ బాధా లేకుండానే ఉండిపోవటమా?

మ: అవి యేవైనా కానీ. చూసేవాడు లేక ఆలోచించే వాడు అయిన నీకు అవి వేరుగా ఉన్నాయా?

సభ్యుల్లోంచి ఒక పార్సీ యువతి -- "అవి వేరుకావన్న మాత్రాన చీమలు కుడితే తెలియదా?

మ: చీమ ఎవరిని కరచింది? దేహాన్ని, నీవు దేహం కావు. నీవు శరీరంతో తాదాత్మ్యం చెందినంత కాలం చీమలుంటాయి. చెట్లూ వుంటాయి. నీవు ఆత్మగా నిలిస్తే నీకు వేరుగా మరేమీ లేవు.

భ: కాటువల్ల దేహం బాధపడుతుంది.

మ: బాధ దేహానికైతే, ప్రశ్నను అదే అడగనీ. శరీరాన్ని దాని సంగతి అది చూసుకోనీ. మధ్య నీకెందుకు?

శ్రీమతి జెన్నింగ్స్: పూర్ణశరణాగతియంటే, చుట్టూరానున్న గోల, శబ్దాలూ, ధ్యానంలో నున్నాసరే ఒప్పుకోవలసిందేనా? లేదా ఏకాంతికానికై ఏ కొండ గుహన్నా చూసుకోవాలా? శ్రీభగవాన్ కూడ అలా చెయ్యలేదా?

మహర్షి: పోవటం లేదు. రావటం లేదు ఆత్మ పంచభూతాల చేత అబాధితము. అది అనంతం. నిత్యం, స్థిరం. అదెక్కడికని కదలిపోతుంది.

భ: ఆత్మవిచారం చేసేప్పుడు బాహ్యసాహాయ్య మపేక్షించడం, అధ్యాత్మికంగా సరియేనా?

మ: ఆత్మను దేహమనుకోటంలో ఉన్నది పొరపాటంతా. భగవాన్ దేహమే అయితే మీరా దేహాన్ని అడగవచ్చు. మీరెవర్ని భగవాన్ అంటున్నారో, అతన్ని అర్థం చేసుకోండి. అతడు దేహం కాదు, ఆత్మ,

అంత ఆమె హరిజన్ పత్రికలోని ఒక వాక్యం ఎత్తిచూపారు - "సర్వమూ దైవమే, వ్యక్తికి చెందే దొక్కటీ లేదు.”

మహర్షి: సర్వమూ -- అంటే వ్యక్తి, దైవమూ, అంతా ఆత్మయే. షెల్లీ వ్రాసిన పద్యాన్ని శ్రీమతి జెన్నింగ్స్ వల్లించింది within Cavern of man's trackless spirit

“పథ మేర్పడని ప్రాణపద కందరమ్మందు
గద్దపై వెలసె చిక్కని చక్కనిది మూర్తి,
తనుజేర సాహసించిన తలంపులు దాని
కొలుచు భక్తిని, మోకరిల్లి భీతి కంపిల్లు
పరమ సన్నిధి వైభవము చూచి; తత్కాంతి కలవోలు తలపుతల్పుల దూరు; నాత్మాభ మహిమచే శక్తి సంపత్తి
పెంపారగా."

'షెల్లీ ఆత్మజ్ఞుడు కాదా?' అని అడిగింది.

మహర్షి: అవును, పద్యపాదాలు అద్భుతంగా ఉన్నాయి. అతడు వ్రాసినది తప్పక అతనికి అనుభవంలోకి వచ్చే వుంటుంది.

అంతట ఆమె భగవాన్కు కృతజ్ఞత తెలిపి సెలవు తీసుకొంది.

# భాషణములు 342

రాత్రి 11 గంటలయింది. గుంటూరునుండి ఆంధ్రులు కొందరాశ్రమానికి వచ్చారు. వారిలో మధ్య వయస్కురాలు దృష్టి స్థిరమైనా, సవిషాదంగా ఉన్నది; ఆమె తల్లీ, ఇర్వురు పురుషులూ, వారు శ్రీభగవాన్ ను చూడగోరారు.

ఆమె భగవాన్తో ఇలా చెప్పింది:

"నా మగబిడ్డ గర్భంలో ఉండగనే నా భర్త పోయాడు. ఆ తరువాత కాన్పు. అయిదేండ్లు బాగానే పెరిగాడు. అంత వానికి పిల్లల పక్షవాతం వచ్చింది. 9 ఏండ్లు వచ్చినప్పుడు మంచం పట్టాడు. అయినా చురుకుగా సంతోషంగానే ఉన్నాడు. అట్లు రెండేండ్లైనాయి. ఇప్పుడు వాడు చనిపోయాడంటున్నారు. కాని "నాకు తెలుసు, వాడు నిద్రించి వున్నాడనీ, త్వరలో మేల్కొంటాడని. వాడు కూలిపోయాడంటే నా నెత్తిపై పిడుగు పడ్డట్టయింది. నాకొక దృశ్యం కనుపించింది. దానిలో నొక సాధువు నా బిడ్డ శరీరాన్ని నిమిరినట్లూ వాడంతలో తేరినట్లూ, ఆ దృశ్యంలోని సాధువు తామని నా దృఢవిశ్వాసం. దయచేసి ఒక మారటివచ్చి నా బిడ్డను తాకండి, నాకు వాడు దక్కుతాడు."

మహర్షి: వైద్యులేమన్నారు?

ఆమె: వాడు పోయాడనే వారంటున్నారు. కాని వారికేం తెలుసు? గుంటూరునుండి నా బిడ్డ నింతదూరమూ తెచ్చాను.

మహర్షి: ఏమీ! శవాన్నిక్కడికి తెచ్చారా?

ఆమె: మైలుకు అర్ధరూపాయివంతున యిస్తే దేహాన్ని తేనిస్తామన్నారు. రూ. 150 కట్టి వాని నొక సామానుగా తీసుకొచ్చాను.

మహర్షి: నీ దృశ్యము నిజమైతే నీ బిడ్డ రేపు ప్రొద్దున లేస్తాడు.

ఆమె: స్వామీ, వాని నొక్కమారు తాకండి. వానిని ఆశ్రమం ఆవరణలోకి తెమ్మంటారా?

ఇతర లొప్పుకోలేదు. వారామెను, ఆమె తోడనున్నవారిని ఎలాగో సాగనంపారు. వారు వెళ్ళిపోయారు, మరురోజు ప్రొద్దుట ఆ శవాన్ని దహనం చేసారని తెలిసింది.

అడిగితే శ్రీ భగవాన్ అన్నారు. "మృతులను బ్రదికించారని కొందరు యతులను గూర్చిన గాథలున్నవి. వారుగూడ మరణించిన వారి నందరినీ బ్రదికించలేదు. అట్లే అయితే ప్రపంచమూ లేదు, చావూ లేదు, స్మశానమూ లేదు.

అక్కడ ఒకరన్నారు - ఆ తల్లి విశ్వాసమెంతో గాఢంగా ఉండింది. అంత ఆశాజనకమైన దృశ్యం చూచిన ఆమె, ఇంత నిరాశ చెందడమా! బిడ్డపై ఆమె ప్రేమయే ఆ దృశ్యాన్ని కల్పించియుంటుందా?

మహర్షి: ఆమె, ఆమె బిడ్డ కూడా నిజం కానప్పుడు, ఆ దృశ్యం మాత్రం కల్పితం కాకుండా ఎలా ఉంటుంది.

భక్తుడు: అలా అయితే దానికి వివరణ మెలా?

భగవాన్ జవాబు చెప్పలేదు.

## భాషణములు 343

భక్తుడు: చేయితెగవ్రేసినా, అది తెలియకనే ఉండాలి; శ్రీమద్గీతలో ఆత్మ దేహానికి భిన్నమని ఘోషించింది కదా.

మహర్షి: జ్ఞానమంటే, గాయాలవలని నొప్పి తెలియకుండుట అనా?

భ: ఆయనకు బాధ తెలియక ఉండవద్దా?

మ: పెద్ద పెద్ద శస్త్ర చికిత్సలు, రోగికి మత్తుమందిచ్చి, ఏ నొప్పి వానికి, తెలియకుండానే చేస్తున్నారు. ఆ సమయంలో అతడికి జ్ఞానం వస్తుందా? నొప్పి తెలియక పోవడం జ్ఞానం కాదు.

భ: జ్ఞానికి నొప్పి ఉండకూడదు కదా?

మః శరీరము తెలిసియున్నంతవరకు శరీరబాధ తెలుస్తూనే ఉంటుంది. దేహచేతనే లేకుంటే, ఏ బాధా లేదు. దేహాన్ని తెలియని మనస్సు, బాధ నెరుగదు, సంతోషాన్ని తెలియదు. యోగవాసిష్టంలోని ఇంద్రాహల్యల గాథ చదువు. దానిలో మృతిగూడ మనఃకృతమని యున్నది.

నొప్పులన్నీ అహంకారం మీద ఆధారపడతాయి. 'నేను' లేక అవేవీ ఉండవు; కాని అవి లేక 'నేను' ఉండగలదు.

## భాషణములు 344

భక్తుడు: ఆత్మసిద్ధికి ఆటంకాలు నాల్గని విచారసాగరం పేర్కొన్నది. మహర్షి: నాలుగేయేం? కొందరవి తొమ్మిదన్నారు. అందులో నిద్రగూడ ఒకటి. నిద్రఅంటే ఏమి? మెలకువకు విపరీతము. మెలకువ లేకపోతే నిద్ర ఏమిటి? నిద్ర అకళంకమైన ఆత్మ. నీవు మేల్కొని ఉన్నావనుకొంటావేమో, అట్లెంచకు. నిద్రా లేదు, ఆ మూడవస్థలూ లేవు. ఆత్మను మరచి పోతావు. దాన్ని స్వప్నమంటావు. ఆత్మలేక ఏ యొక్కటైనా ఉండగలదా? దానిని వదిలేసి అనాత్మనే పట్టి వ్రేళ్ళాడుట ఎందుకు?

మనస్సుకు బయటకు వెళుతున్నప్పుడు ఎక్కడికక్కడే దాన్ని లోనికి మళ్ళించు. మనస్సు బయటకు వెళ్ళడానికి కారణం, తనకు బయటగా ఆనందం వెదికే అలవాటు వలన, కాని బాహ్యవిషయములు సౌఖ్యకారణాలు కావన్న జ్ఞానం దాన్ని అదుపులో వుంచుతుంది. దీనినే వైరాగ్యమంటారు. పూర్తిగా వైరాగ్యం కుదిరాకానే, మనస్సు స్థిరపడుతుంది.

మనస్సు కేవలము జ్ఞానాజ్ఞానాల కలయిక; నిద్రాజాగ్రత్తుల సంయోగము.

అది అయిదు విధాల వర్తిల్లుతుంది

క్షిప్త (కర్మోద్యుక్త), (చురుకైన)

మూఢ (స్తబ్ధ), మందమైన

విక్షిప్త (చలిత, అస్థిర)

కషాయ (అవ్యక్తంగా వున్న)

ఏకాగ్ర్య (ఒకే స్థానంలో - ఒకే ఆలోచనలో నిలిచిన)

పై వానిలో కషాయము వాసనలు అణిగి ఉండడాన్ని తెలుపుతుంది కాని, రాగము, ద్వేషములాంటి వాసనలను తెల్పదు.

ఆనందం నీవేనే! దాని ననుభవిస్తూ, 'ఆహా! ఎంత ఆనందంగా ఉందో' అని నీవు హర్షించడమేమిటి? ఇది రసాస్వాదము.

మగవాని కలయిక అనుభవం లేకుండానే కన్య, పెళ్ళి కుమార్తెగా సంతోషాన్ని అనుభవిస్తుంది. ఇది రసాస్వాదం.

భక్తుడు: జీవన్ముక్తే ఆనందం

మహర్షి: మధ్యలో ఆపి ఇలా అన్నారు: శాస్త్రాల కోసం చూడకు. జీవన్ముక్తి అంటే ఏమిటి? ఆనందం అంటే ఏమిటి? ముక్తే సందేహం. అలాంటప్పుడు ఈ పదాలన్నీ ఏమిటి? ఇవన్నీ ఆత్మనుండి వేరుగా ఉండగలవా?

భ: ఇందులో ఏదీ మాకు అనుభవంలో లేదు.

మ: లేనిది ఎప్పుడూ లేనట్లే. వున్నది సదా నిలిచేదే. ఈ సృష్టిలో వస్తున్న క్రమమే అది. ఉదా -- మెడలో వున్న కంఠాభరణము.

## భాషణములు 345

కొంతసేపాగి శ్రీ భగవాన్ చెప్పసాగారు - "మనశ్శక్తిని అన్వేషణం చేత నాశం చెయ్యి. మనస్సును పరిశీలిస్తే దాని ఆలోచనలు తమంతవే ఆగిపోతాయి.

మనోమూలాన్ని జాడతీయడం మరొక మార్గం. ఆ మూలాన్ని దైవమనీ, ఆత్మయనీ, చైతన్యమనీ పిలువవచ్చు.

ఒక ఆలోచనపై మనస్సు నిలిపితే, ఇతరాలోచనలన్నీ అదృశ్యమౌతాయి. చివరకా ఒక్క ఆలోచనా నశిస్తుంది. ఆలోచనలను వశీకరించుకొనేప్పుడు ఎరుకలో, అప్రమత్తంగా నుండటం అవసరం, లేకపోతే అది నిద్రకు దారితీస్తుంది.

భక్తుడు: మనస్సును అన్వేషించే దెలా?

మహర్షి: శ్వాసనిరోధము కొంత సాయపడవచ్చు. కాని అది మాత్రమే గమ్యం చేర్చదు. అది యాంత్రికంగా జరుపుతూనే మనస్సును చురుకుగా (సావధానంగా) ఉంచుకో. “నేను” ఆలోచనను జ్ఞప్తియుంచుకొని దాని మూలం జాడతీయి. అంత నీకు తెలుస్తుంది. శ్వాస ఎక్కడ అణుగుతుందో, “నేను” ఆలోచన అక్కడే జనిస్తుంది. అవి రెండూ లేవడం, పడటం ఒకే మారు, కలిసే చేస్తాయి. శ్వాసతో గూడ “నేను” ఆలోచన అడగిపోతుంది. తక్షణమే మరొక స్వయంభాసి, అనంతమూ అయిన “నేను-నేను" స్ఫురణ గోచరించి నిరతంగా నిరంతరంగా వెలుగొందుతుంది. గమ్యమదే. దానికి ఎన్నో పేర్లు -- దైవము, ఆత్మ, కుండలినీ శక్తి, చైతన్యము ఇత్యాది.

ప్రయత్నం చేయడం మొదలు పెడితే, అదిగానే నిన్ను గమ్యం చేరుస్తుంది.

## భాషణములు 346

విధి, పురుషకారములు రెండూ శరీరమున్నంతకాలమూ నిలుస్తాయి. కాని శుద్ధ జ్ఞానము (wisdom) ఆ రెంటినీ అధిగమిస్తుంది. ఎందుకంటే ఆత్మ జ్ఞానాజ్ఞానాల కతీతం కనుక.

## భాషణములు 347

మనస్సు ఆలోచనల మూట. ఆలోచించే వాడు ఉన్నాడు కనుక ఆలోచనలు వస్తాయి. ఆ ఆలోచించేది అహంకారం. దాని మూలం వెదకితే, అహంకారం తనంతతానే పోతుంది. అహంకారం అన్నా మనస్సన్నా ఒకటే. అహంకారం ఆలోచన లన్నిటికీ మూలము. దానినుండే ఇతర యోచనలెల్లా జనిస్తాయి.

## భాషణములు 348

భక్తుడు: స్వప్నంలోవలె ఒక్కొక్కవేళ వస్తువులూ, మనుష్యులూ అస్పష్టంగా, పారదర్శకంగా అయిన రూపాలతో కనిపిస్తారు. వారిని చూస్తే, ఎవరో బయటివారిని చూచినట్లుండదు. నిర్లిప్తంగా వారి ఉనికి తెలుస్తూంటుంది. కాని చురుకుగా అహంకారంగా ఏదీ తెలీదు. మనస్సు శాంత గంభీరంగా ఉంటుంది. అలాంటి సమయాల్లో ఆత్మలో మునిగిపోయే ప్రయత్నం చేయాలా? లేదా ఇది తన్నుతానే మభ్య పెట్టుకొనేలాంటి (self-hypnotism) అనారోగ్య లక్షణమా? తాత్కాలికంగానైనా శాంతినిస్తుంది లెమ్మని దాన్ని ప్రోత్సాహించవచ్చా?

మహర్షి: మనస్సులో శాంతితో బాటు చైతన్యం ఉండే స్థితే, గమ్యం. ఈ స్థితిని గూర్చి సంశయం వచ్చిందంటే, అదే ఆత్మస్థితి యని తెలియలేదని, ఆ స్థితి ఇంకా తాత్కాలికమై స్థిరపడలేదని స్పష్టమవుతోంది.

మనస్సు బహిర్ముఖ సంస్కారాల వెంటబోయే సమయాల్లో దాన్ని మళ్ళించి అంతర్ముఖం చేసే యత్నంలో “మునగడం" అనే పదం బాగుంటుంది. కాని చైతన్యం చెదరకుండా వెలసే గంభీరశాంతి సందర్భంలో ఆ మాటకు ఔచిత్యమేమి? ఆత్మస్థితి అది యని గుర్తించనప్పుడు, ఆ గుర్తించే ప్రయత్నంలో “మునుగు” అని ఉపయోగించవచ్చు. ఆ విధంగా ఆ స్థితిని ఆత్మసిద్ధికి లేదా ఆత్మమజ్జనానికి (ఆత్మలో మునగడానికి) అనుగుణం అని చెప్పవచ్చు. కాబట్టి నీవడిగిన ఆ చివరి రెండు ప్రశ్నలూ అనవసరం.

భ: పిల్లలయందు మనస్సెక్కువ మక్కువ పడుతుంది. గమ్యాన్ని తెలపడానికి పిల్లల్ని ఉదాహరణగా చూపిస్తారు గనుకనేమో. ఈ అభిరుచి నుండి బయటకు ఎదిగేది ఎలా?

మ: ఆత్మను పట్టుకో. పిల్లలను, వారిని జూచినప్పటి మనస్థితినీ గూర్చి ఆలోచనలెందుకు?

భ: తిరువణ్ణామలైకు నేను రావటమిది మూడోమారు. ఈసారి నా అహంకారం బాగా గట్టిపడినట్లనిపిస్తున్నది. ధ్యానం పూర్వమంత సులభంగా లేదు. ఈ దశ తాత్కాలికం మరియు మారిపోయే స్థితేనా లేదా నేనాయాస్థలాలకు దూరంగా వుండవలెనన్న సూచనా?

మ: అది నీ ఊహ. ఈ చోటైనా, వేరేదైనా అది నీలోనే వుంది. అట్టి అపోహ లంతం కావాలి. మనః ప్రవృత్తులకు స్థలాలకూ ఏ సంబంధం లేదు. నీ పరిసరాలు నీవుకోరినంతలో వచ్చినవి కావు. అవి అలా ఉండటం తటస్థించింది. అంతే. వానితో మనస్సు ముడివేయక. వాని కతీతంగా ఉండు.

### శ్రీశంకరుల వివేక చూడామణి

శ్రీమహర్షి అవతారిక

## భాషణములు 349

(శ్రీ శంకరుల వివేక చూడామణిని తమిళములోని కనువదించి శ్రీ రమణులు దానికొక ఉపోద్ఘాతము వ్రాశారు. దాని కాంగ్లం శ్రీ కృష్ణ M.A. "విజన్" పత్రిక జనవరి సంచికలో ప్రకటించారు.)

ప్రపంచంలో ప్రతి జీవి శోకం పొడచూపని సుఖాన్ని ఎల్లప్పుడూ కోరుకుంటాడు. అసహజాలైన శరీర రుగ్మతలను పోగొట్టుగోరుతాడు. ప్రతివాడూ తన్ను సర్వాతిశయంగా ప్రేమిస్తాడు. అందులో ఆనందము లేకుంటే ఆ ప్రేమ సాధ్యమే కాదు. గాఢనిద్రలో ఏదీ లేకున్నా సరే సుఖాన్ని అనుభవిస్తాడు. తాను కాని ఆనందమే రూపుగొన్న నిజస్వరూపం సరిగా తెలియనందున, ఆనందానికి ఋజువైన మార్గాన్ని వదలి, ఆనందమంటే ఇహపరభోగాలను పొందడమనే భ్రాంతితో సంసార మహా సముద్రంలో కొట్టుమిట్టాడుతూ ఉంటాడు.

భద్రమార్గము: కాని దుఃఖచ్ఛాయపడని ఆనందానుభూతి వానికి దొరకదు.

ఆనందానికి ఋజుమార్గం చూపడానికే పరమశివుడు శంకరాచార్యులై వేదాంతంలో ప్రస్థానత్రయానికి భాష్యం వ్రాసారు. అందు ఆనందాతిశయాన్ని కీర్తించారు. దానికి ఆయన జీవితమే ప్రమాణము. వాని నధ్యయనం చేసే శక్తి చాలక మోక్షానందాన్ని శ్రద్ధగా అత్యధికంగా వాంఛించే పలువురికి ప్రస్థానత్రయ భాష్యము అంతగా ఉపయోగం లేదు.

అట్టివారికై శంకరుల ప్రస్థానత్రయసారాన్ని. ఈ చిన్ని గ్రంథం 'వివేకచూడామణి'లో నిబంధించారు. ముముక్షువులకు యోగ్యాలైన సకలాంశములూ ఇందు వివరించి, సరియైనది, సూటియునైన మార్గాన్ని వారికి నిర్దేశించారు.

పాండిత్యమాత్రం చాలదు: మానవజన్మ అతి దుర్లభమని అది లభించిన ప్రతిజీవి తనకు సహజస్థితియైన మోక్షానందానుభూతికై యత్నించి తీరవలెనని శ్రీ శంకరులు తమ బోధ నారంభిస్తారు. కైవల్యం జ్ఞాన మొక్కదానివల్లనే; జ్ఞానం విచారసాధ్యం; ఈ విచారమార్గం తెలియడానికి గురుప్రసాదం ఆవశ్యకం, అంటారు శంకరులు. గురుశిష్యుల అర్హతానర్హతలూ, గురువునెడల శిష్యుడు నెరపవలసిన వినయసేవాదుల వివరించారు. మోక్షానందానుభవానికై శిష్యుని స్వప్రయత్నం అత్యంతావశ్యకమని శ్రీ శంకరులు నొక్కి చెప్పారు. గ్రంథాధ్యయన మాత్రాన ఈ ఆనందం లభించదు. దానికి విచారమే గతి. విచారమార్గంలో మూడుదశలు - 1. శ్రవణం గురునుపదేశాల ఎడల భక్తి శ్రద్ధలు, 2. మననము దీర్ఘచింతన 3. నిది ధ్యాసనము - ఆత్మసంస్థితి నలవరచుకొనడం.

మూడుమార్గాలు: స్థూల సూక్ష్మ, కారణదేహాలు మూడూ అనాత్మయే, కనుక మిథ్యలే. ఆత్మ ("నేను") వానికి పూర్తిగ భిన్నమైనది. అజ్ఞానం వల్ల ఆత్మభావన (నేనన్న తలపు) అనాత్మకారోపింపబడింది. బంధమంటే నిజంగా ఇదే. అజ్ఞానం వల్ల బంధం గనుక, జ్ఞానం విమోచనకారణం కావాలి. గురువువల్ల దీనిని తెలియడమే శ్రవణము.

మననము: ఈ శరీరత్రయాన్నీ, పంచకోశాలను (అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ) అనాత్మగా, నిరాకరిస్తుంది. కుశాగ్రసూక్ష్మమైన విచారంవల్ల, “నేను ఎవరు” అనే విచారంవల్ల, ఆత్మ ఈ మూడు శరీరాలకు భిన్నమనీ, అది ఏకమూ, సర్వాత్మకమునుఅయి, హృదయంలో అహం స్ఫురణంగా వెలసియున్నదనీ, 'తత్త్వమసి' యన్న శ్రుతి వాక్యంలోని 'త్వమ్' ఈ అహంస్ఫూర్తియే యనీ నిర్ధారిస్తుంది.

కైవల్యము: నామరూపాత్మక జగత్తు సత్ లేక బ్రహ్మమునకు లక్షణము. అది బ్రహ్మమునకు వేరుగాదు గనుక దానిని ప్రత్యేకంగా పరిహరించి బ్రహ్మముతో ఒకటిగనే అంగీకరించారు. జీవేశ్వరైక్యాన్ని ప్రకటించి “తత్త్వమసి” అన్న మహావాక్యం గురువు శిష్యునికి చేసే బోధ, ఉపదేశము. ఆ తరువాత శిష్యుని 'అహం బ్రహ్మమను స్థితిలో నిలకడగా ఉండుమని ఆదేశం. కాని మనోవాసనలు ఎంతకూ ఆగక మొలకెత్తి మరల మరల గాఢంగా, దృఢంగా క్రమ్మి అతన్ని భంగపెడతాయి. ఈ వాసనలు మూడు విధాలు వానికి మూలమైన అహంకారము, రజోగుణాధిష్ఠితమైన విక్షేపము మరియు తమోగుణ విశిష్టమైన ఆవరణముల వలన బహిర్ముఖము మరియు నానాత్వమనిపించే చైతన్యంలో, ఈ అహంకారం వృద్ధి పొందుతుంది.

మనోన్మంథనము: వాసనలను నాశనం చేసేవరకు మనస్సును దృఢంగా హృదయంలో నెలకొల్పి, చెదరని సడలని జాగరూకతతో, ఆత్మకు విశిష్ట లక్షణమైన యథార్థజ్ఞానాన్ని ఉన్మీలించుట నిదిధ్యాసనము, లేక ఆత్మానుసంధానము.

దానిని తెలుపుననే 'అహం బ్రహ్మాస్మి', 'బ్రహ్మైవాహం' అన్న మహావాక్యాలు. దీనినే భక్తియని, యోగమనీ, ధ్యానమనీ వర్ణిస్తారు.

ఆత్మానుసంధానాన్ని వెన్నకై పెరుగును చిలుకుటతో పోలుస్తారు. మనస్సు కవ్వము; హృదయము పెరుగు; ఆత్మలో స్థిరంగా నిలబడడాన్ని అభ్యసించడం చిలకడం. పెరుగు తరిచి వెన్నదీసినట్లు, రాపిడివల్ల అగ్ని రేచినట్లు, నిశ్చలమూ అవహితమూ అయిన ఆత్మధ్యానమువల్ల, స్రోతస్సమమైన తైలధారవలె సహజమూ, మార్పులేని నిర్వికల్పసమాధి కల్గి అది సరళంగా, తత్క్షణమే, అవాంతరాలు లేని ప్రత్యక్షమూ, నిరాటంకమూ అయిన బ్రహ్మచైతన్యము అనుభవమౌతుంది. ఈ బ్రహ్మము ఏకకాలమందే జ్ఞానమూ, అనుభవమూ, దేశకాలాతీతమూనూ.

నిరవధి సుఖము: ఇది ఆత్మానుభవము. దానివల్ల హృదయగ్రంథి తెగిపోతుంది. ఆ ముడికి కారణాలైన చిరకాలానుగతములైన దుష్టవాసనలూ అజ్ఞానజనిత భ్రాంతులూ అన్నీ నష్టమౌతాయి. సంశయములు నశించి, కర్మబంధము తెగిపోతుంది.

శ్రీ శంకరు లీరీతిగా తమ వివేకచూడామణిలో నిస్సీమమూ, నిస్సంశయమూ, నిర్ద్వంద్వమూ, నిరవది సుఖమూ అయిన నిర్వికల్ప సమాధిని వర్ణించి దానితోపాటే దాని సాధనా విధానాన్ని సైతం వివరించారు. ద్వంద్వ భావననుండి తప్పి బయటపడటమే జీవిత పరమార్ధము - దాన్ని సాధించి నాతడే జీవన్ముక్తుడుగాని, పురుషార్ధముల గూర్చి పుస్తకమాత్ర జ్ఞానము గలవాడు కాడు.

మోక్షము: (Final freedom) - ఇట్లు జీవన్ముక్తునికి సంచిత, ఆగామి, ప్రారబ్ధ కర్మబంధములుండవు. ఈ స్థితినందుకొన్న శిష్యుడు తన అనుభవమును వివరిస్తాడు. ముక్తుడు యథేచ్ఛగా వర్తించవచ్చు. నశ్వరమైన ఈ దేహాన్ని విడగానే, అతనికి విదేహ కైవల్యము లభిస్తుంది. అటుపై జీవన్మృతదశ ఆయనకుండదు.

ఇట్లు శంకరులు ఆత్మసాక్షాత్కారము రెండు విధములంటారు. 1. జీవన్ముక్తి, 2. విదేహముక్తి. గురుశిష్య సంవాదరూపంలో వ్రాసిన ఈ చిన్నగ్రంథంలో మరెన్నో తత్సంబంధి విషయాలను గూడ చర్చించారు.

("వివేక చూడామణిని శ్రీ భిక్షుశాస్త్రి ఇంతకు పూర్వమే తమిళ పద్యానువాదం గావించారని తెలుస్తున్నది. నానావర్ణాలూ, నానా రూపాలతో ఉన్నా మిఠాయి ఒక్కటే. వివేకి జనులు తమ తమకు నచ్చిన దాని ననుభవించి రసానుభవము పొందుదురు గాక ...." ఇది భగవాన్ లిఖితము)

## భాషణములు 350

జి. షణ్ముగం న్యాయవాది భక్తిశ్రద్ధలు గలవాడు. ఆయనతో మాట్లాడుతూ భగవాన్ -- "ఆత్మసిద్ధికై గురువును పన్నెండేండ్లు సేవించవలెనని శాస్త్రములు అంటాయి. గురువేం చేస్తారు? దాన్ని శిష్యుని చేతికిస్తారా? ఆత్మ సదాసిద్ధమే కదా. ఆ దీర్ఘ శుశ్రూష విషయంలో సామాన్యుడేమంటాడు? జీవి తానెప్పుడూ ఆత్మయే. కాని అది వాడెరుగడు. వాడు దేహాది అనాత్మను ఆత్మగా భ్రాంతిపడతాడు. అట్టి విపరీతం అజ్ఞానం వల్లకలుగుతుంది. అజ్ఞానం తుడిచివేస్తే, ఆ భ్రమగూడ తొలగుతుంది. యథార్థజ్ఞానం వెలుగుపడుతుంది. ఆత్మజ్ఞుల సాంగత్యంచేత జీవికి తన అజ్ఞానం క్రమంగా తగ్గి చివరకు పూర్తిగా నశిస్తుంది. ఆ విధంగా నిత్యమైన ఆత్మ తెలియవస్తుంది.

అష్టావక్ర జనకుల గాథవల్ల తెలిసేదిదే. వేరువేరు గ్రంథాలు ఈ కథను వేర్వేరు రీతుల్లో పలికినవి. ఈ కథలోని పేర్లతో, కథా కథనంతో మనకేపని లేదు. దాని తత్త్వం ఏమరకపోతే చాలు. శిష్యుడు తన్ను గురువుకు అర్పించుకుంటాడు. ఇక శిష్యునికి ప్రత్యేక వ్యక్తిత్వమంటూ లేదు. స్వార్పణం పూర్తిగానైతే వ్యక్తిభావన సర్వం నష్టమై యుంటుంది. అటుపై దుఃఖకారణమూ నశిస్తుంది. నిత్యుడు ఆనంద స్వరూపమే. అదే తెలియవస్తుంది.

సరిగా అర్థంకాక, గురుపేదో "తత్త్వమసి'లాంటి వాక్యాన్ని శిష్యుని కుపదేశిస్తారనీ, శిష్యుడంతలో తాను బ్రహ్మమని కనుగొంటాడనీ జనులు అభిప్రాయపడతారు. అజ్ఞానంవల్ల వారు బ్రహ్మమనేది గురుతర భారమనీ, అత్యంత శక్తిమంతమనీ ఊహిస్తారు. పరిమితమైన 'నేను' అయిన వ్యక్తి తాను పట్టిన యోచనను వదలడు మూర్ఖపుపట్టు. అట్టి 'నేను'విస్తారంగా పెరిగితే ఏం గతి? అతని అజ్ఞానం మౌర్ఖ్యం గూడా అంత విస్తారంగానే వుంటాయి. ఈ మిథ్య 'నేను' నష్టం కావాలి. దాని నాశం గురుసేవా ఫలం. ఆత్మానుభవం నిత్యసిద్ధము. దాన్ని గురువు క్రొత్తగా కలుగచేయడు. అజ్ఞాన నివారణానికి సాయపడుతాడు, అంతే.

## భాషణములు 351

డాక్టరు సుబ్రహ్మణ్యయ్యర్, ఉద్యోగము విరమించిన సేలం హెల్త్ ఆఫీసరు, ఒక రచనను బిగ్గరగా చదివారు. దానిలో ఈ క్రింది సలహాలున్నవి "ప్రపంచము కూడా క్షణభంగురమని తెలుసుకో. ఇహభోగాలు వ్యర్థాలు. వాని నసహ్యించుకొని వానికి దూరంగా ఉండు. ఇంద్రియములు నిగ్రహించు. ఆత్మను పొందటానికై, దానినే ధ్యానించు",

మహర్షి: ప్రపంచంకూడా క్షణభంగురమని తనకెట్లు తెలుసు? ఏదో శాశ్వతమైనది ఉంటే గాని ప్రపంచం నశించేదని బోధపడదు. వ్యక్తి తానింతకు పూర్వమే ఆత్మ గనుక. ఆత్మ నిత్యం సత్యం గనుక, వాని దృష్టి నటు మళ్ళించాలన్నారు. కాని ధ్యానమంతా నిత్యసత్యమైన ఆత్మయందే కేంద్రీకరించమన్నారు.

## భాషణములు 352

వివిధ మత విశ్వాసాలు (different creeds)

ఆలోచన కర్తగామరియు కర్మగానూ పుడుతుంది. 'నేను' ఆలోచన మాత్రమే మిగిలి ఇతరమంతా మాయమౌతుంది. సమర్థులకు (అధికారం కలవారికి) అది ఒక్కటే సరిపోతుంది.

ఒరులు వాదిస్తారు. “అది అలాగే, నా నిద్రలోని జగత్తు, నా పుట్టువు పూర్వమే ఉండింది; నా తర్వాతా ఉంటుంది. ఇతరులు దానిని చూడరా, యేం? నా అహంకారం పోయినంత మాత్రాన, ప్రపంచమే లేకపోతుందా?" జగత్ సృష్టివాదమూ, ఇతర మతములూ అలాంటివారి తృప్తికై పుట్టినవి.

భక్తుడు: కాని అవన్నీ విజ్ఞాన కల్పితాలే (ఇంటలెక్ట్) గనుక అవి మనస్సు నంతర్ముఖం చేయలేవు.

మహర్షి: అదే కారణంగా శ్రుతులు 'అంతర్దృష్టి'యని 'ఏకాగ్రదృష్టి'యనీ చెప్పాయి.

ఆత్మ ఎప్పుడూ ఆత్మే కనుక, ధీరున కొక్కనికే ఆత్మప్రకాశన మేల ఉండాలి? ధీరుడంటే ధైర్యవంతుడని అర్థం కాదు. ధీః = బుద్ధి; రః = రక్షణ మరియు జాగరూకతతో కాపలా లేదా చూచుట. ధీరః అంటే మనస్సును విశృంఖలంగా వదలక దాని నంతర్ముఖంగానే సదా నిలిపేవాడు.

## భాషణములు 353

భక్తుడు: 'తురీయ' అంటే ఏమి?

మహర్షి: ఉన్న అవస్థలు మూడు. జాగ్రత్ స్వప్న సుషుప్తులు; తురీయం నాల్గవది కాదు. పై మూటికి ఆధారమైనది. కాని ఇది సులభంగా అర్థం కాదు. అందువల్ల దానిని నాల్గవ అవస్థగా, ఏకైక సత్యంగా పరిగణించారు. నిజానికి అది దేనికీ భిన్నం కాదు. అది సర్వసంభవాలకు ఆధారం. అది ఏకైక సత్యం. నీ అస్తిత్వమే అది. అవస్థాత్రయము ఆ తురీయం మీద క్షణిక విషయములుగా కనబడి తరువాత దానిలోనే అణగిపోతాయి. కాబట్టి అవి యథార్థాలు కావు.

సినీ దృశ్యంలో చిత్రాలు తెరమీది నడిచేది నీడలు. అవి తెరమీద కనిపించి, ముందువెనుకలకు కదలాడి, ఒకనదానినుండి మరియొకటిగ మారుతాయి. అందువలన అవి నిజం కాదు. అంతసేపూ మారనిది ఆ సినీ తెరయే. వానిని దేనిపై ముద్రిస్తారో ఆ కేన్వాస్ నిజము. మన విషయమూ అట్లే. ప్రాపంచిక వ్యవహారాలూ బాహ్యాంతరాల్లోనివి; అన్నీ తాత్కాలికాలు. ఆత్మను కాదని నిలిచేవిగావు. అవన్నీ నిజాలనీ, మనకు వెలిగా నున్నవనీ అనుకొనే అలవాటు వలన అవి ముఖ్యమైనవనుకోవడం. మన నిజస్వరూపం కప్పివేయడం జరుగుతున్నది. సదాయున్నదీ, ఏకైక సత్యమూ అయిన ఆత్మను కనుగోగానే, ఈ మిధ్యలన్నీ కరగిపోయి, అవన్నీగూడ ఆత్మకు వేరుకావన్న ఎరుక మిగులుతుంది. తురీయమని ఆత్మకు మరొక పేరు. జాగ్రదాది మూడవస్థలు ఉన్నవని ఎరిగిన మనకు తెలియనిది ఆత్మయొక్కటే. కాని అదొక్కటే సత్యం. అది నిత్య సిద్ధమే. అది గానిదేమీ లేదు. దేహాత్మ బుద్ధి ఉన్నంతకాలమూ జగత్తు మన కన్యథా

బాహ్యంగా ఉన్నట్లు తోస్తుంది. ఆత్మను కనుక్కో, అవి ఉండవు.

## భాషణములు 354

థియాసొఫిస్ట్, అమెరికన్ యువతి, ఒకామె అడిగింది “నా గురువు వద్దకు సుగమంగా” నన్ను చేర్చే ఉపాయమేమన్నా ఉన్నదా?

మహర్షి: వానికెంత దూరంలో నువ్వు వున్నావు?

భక్తురాలు: చాల దూరంలో, కాని దరి చేరవలెననే కోరిక వుంది.

మ: నిన్ను నీవు తెలిసికొంటే, అప్పుడు తెలుస్తుంది నీ కాయన ఎంత దూరంలో ఉండేది. ప్రస్తుతము నీ వెవరు? వ్యక్తివా?

భ: అవును. నేను వ్యక్తినే.

మ: ఆ వ్యక్తిత్వం ఆత్మకు భిన్నంగా ఉందా?

భ: అప్పుడప్పుడు.

మ: ఎప్పుడు?

భ: ఒక్కొక్కప్పుడు, నాకా సత్యం మెరుపులు అగుపిస్తాయి. ఇతర వేళల్లో అవి రావు.

మ: ఆ మెరుపులు తెలుసుకొన్న దెవరు?

భ: నేను. అంటే నా వ్యక్తిత్వము.

మ: ఈ వ్యక్తిత్వానికి తానాత్మకు వేరని తెలుసునా?

భ: ఏ ఆత్మకు?

మ: వ్యక్తిత్వమంటే ఏమని నీ యూహ?

భ: అపర లేక క్రింది స్థాయికి చెందిన ఆత్మ యని.

మ: అయితే ఈ క్రింది ఆత్మ (Lower self) తాను ఉచ్చతర ఆత్మకు (Higher self) భిన్నమని ఎరుగునా?

భ: అవును. అప్పుడప్పుడు.

మ: ఈ క్షణంలో గురువుకి దూరమనుకుంటున్న దెవరు?

భ: ఉచ్చతర ఆత్మ.

మ: ఆ ఉచ్చతర ఆత్మకు శరీరమున్నదా? గురువు తనకు దూరమని ఆ ఆత్మ అంటున్నదా, నీ ముఖతః అది పలుకుతున్నదా? దానికి నీవు వేరా?

భ: నిద్రలో వలె దేహములేని స్థితిలో ఎలా ఉంటానో దానిని జాగరూకతతో గుర్తించే శక్తిని సంపాదించు విధానాన్ని దయచేసి నాకు తెలుపండి.

మ: ఎరుక నీ స్వభావము. నిద్రలోనూ, మెలకువలోనూ అది ఒక్కటే. దానిని క్రొత్తగా ఎలా పొందడం?

భ: కాని నిద్రలో నేనేమి జేసానో, ఎట్లు చేసానో నాకు జ్ఞప్తిలేదు.

మ: జ్ఞప్తి లేదనే దెవరు?

భ: ఇప్పుడు నేను అంటున్నాను.

మ: నిద్రలో గూడ ఈ నీవేనే. ఈ మాట అప్పుడేల అనలేదు?

భ: నిద్రలో ఏం మాట్లాడుతానో నాకు జ్ఞప్తి యుండదు.

మ: ఇప్పుడు మేల్కొన్నప్పుడు "అవునవును, నాకు జ్ఞప్తియుంది" అంటావు. ఈ వ్యక్తియే నాకు తెలియలేదు, నిద్రలో నాకు జ్ఞప్తిలేదు" అనడం. ఈ ప్రశ్న నిద్రలో ఏల రాలేదు?

భః నిద్రలో ఏం జరుగుతుందో నాకెట్లు తెలుస్తుంది? అందుచేతనే ఈ అడగటం.

మ: ఈ ప్రశ్న నిద్రావస్థకు చెందినది. ఆ అవస్థలో అడగవలసింది అది జాగ్రదవస్థలోనిది గాదు. ఈ ప్రశ్నకిప్పుడు స్పష్టమైన కారణం లేదు.

నిజమేమంటే, నిద్రలో నీకెట్టి పరిధులూ లేవు. ఏ ప్రశ్నా రాదు. ఇప్పుడు నీ కెన్నెన్నో హద్దులు. నిన్ను నీ దేహం అనుకుంటావు. అందుచేతనే ఇన్ని ప్రశ్నలు.

భ: నాకది అర్థమవుతూనే ఉంది. కాని నానాత్వంలోని ఏకత అనుభవంలోకి రావటం లేదు.

మ: నీవు నానాత్వంలో ఉన్నావు గనుక ఏకతను ఎరుగుదునంటావు, మెరుపులవలె జ్ఞానం రావడం విషయాలు జ్ఞాపకం రావడం మొదలైనవి. ఈ నానాత్వము నిజమనే భావిస్తావు. యథార్థంగా ఏకతే నిజం, నానాత్వం మిధ్య.

నానాత్వం పోతేనే, ఏకత దాని సత్యంగా తానుగా గోచరిస్తుంది. మిధ్య అయిన నానాత్వంలో తానున్నాననటానికి, ఏ మెరుపులూ అక్కరలేదు. అంతేకాదు, ఈ నానాత్వమే సత్యాన్నద్దుతుంది.

అంత ఇతరులు కొందరీ సంవాదంలో పాల్గొన్నారు.

మ: అభ్యాస లక్ష్యము అజ్ఞాన నివారణమేగాని ఆత్మజ్ఞాన సంగ్రహణం కాదు. ఆత్మస్థితి ఎపుడూ, ఎల్లెడా వున్నదే. అది క్రొత్తగా పొందేదైతే అది ఒక్కొకప్పుడుండటం, మరొకప్పుడు లేకపోవడం జరగాలి. ఆ దశలో అది అశాశ్వతం. దానికై ప్రయత్నం వ్యర్థం. కాని ఆత్మస్థితి శాశ్వతము, నిత్యము. అది సర్వత్ర సర్వదా ఉన్నది.

భ: అజ్ఞానం తొలగడానికి అనుగ్రహం అవసరం.

మ: నిజమే. అనుగ్రహం కూడ సదాసిద్ధమే. అనుగ్రహమే ఆత్మ. దాన్ని ఆర్జించే మాటేలేదు. కావలసిందల్లా అది ఉందని తెలియటమే. ఉదాహరణకు సూర్యుడు కేవలం వెలుగే. అతడు చీకటిని చూచి ఎరుగడు. సూర్యుడు ఉదయించగానే చీకట్లు పోతాయి అనేది ఇతరులు; అట్లే అజ్ఞానం గూడ అభూతకల్పన, నిజం కాదు. అది మిధ్య గనుక, అది లేదు అని తెలియడమే. దాన్ని తొలగించడం.

సూర్యుడున్నాడు, ప్రకాశమూ వుంది. నిన్ను ఆ తేజం ఆవరిస్తుంది. అప్పటికీ నీవు సూర్యుణే చూడవలెననుకొంటే, నీ కళ్ళు వానివైపు త్రిప్పాలి. అలాగే అనుగ్రహం కూడ. అది సదా సిద్ధమే అయినా, అభ్యాసం వల్లనే గోచరిస్తుంది.

భ: ఎప్పుడూ స్వార్పణం చేసుకొనే కోరిక వలన అనుగ్రహం కూడ ఎక్కువగా లభిస్తుందని ఆశింపవచ్చా.

మ: స్వార్పణం ఒకేమారు పూర్తిగా చేసుకో. ఆ కోరిక మిగుల్చుకోవద్దు. కర్తృత్వభావన ఉన్నంతకాలం కోరిక ఉండనే ఉంటుంది. అది కూడ వ్యక్తిత్వంలో భాగమే. ఇది పోతే ఆత్మయొక్క స్వచ్ఛప్రకాశం తెలుస్తుంది.

బంధము కర్తృత్వభావనయే, కార్యాలు కావు.

"నిశ్చలంగా ఉండు, నేను దైవమని తెలుసుకో". ఇచటి నిశ్చలత వ్యక్తిత్వాన్ని లేశమైనా మిగల్చని స్వార్పణం. నిశ్చలత నిలబడి మనశ్చాంచల్యం ప్రశ్నే ఉండదు. కర్తృత్వభావనకు, కాంక్షకు, వ్యక్తిత్వానికి మనశ్చాంచల్యమే కారణం.

అది ఆపితే శాంతి నెలకొంటుంది. అక్కడ "ఎరుగుట" అంటే "ఉండుట". అది జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాత అనే త్రిపుటిలోనిది గాదు.

భ: దైవము నేనన్న ఆలోచన పరమాత్మను నేనే యన్న భావములు సాయపడతాయా?

మ: 'నేనదేనేను' (I am - That-I am) 'నేనున్నాను' I am - ఇది దైవమే - 'దైవమును నేను' 'నే నున్నాను', అని తెలుసుకో, ఆలోచించడంగాదు. నేను దైవమని గుర్తించు. కాని నేను దైవమని ఆలోచించమనలేదు.

శ్రీ భగవాన్ తమ భాషణ సాగించారు - "నే నదే నేను' అని యున్నది. దాని అర్థం, జీవి ఆత్మస్థితిలో ఉండవలెననియే. అతడెప్పుడూ 'అహమే. మరొకటి కాదు. అట్లైకూడ 'నే నెవరు' అని అడుగుతున్నాడు. భ్రాంతిలో పడినవాడు తప్ప, చక్కగా తన్నెరిగిన వాడెవ్వడూ 'నే నెవరు' అని ప్రశ్నించడు. అనాత్మను ఆత్మతో తప్పుగా తాదాత్మ్యం చేయడం వలనే 'నేనెవ'రన్న ప్రశ్నకు కారణము.

కొంతసేపాగి, మరల భగవాన్ 'తిరువణ్ణామలై చేరడానికి మార్గాలు చాల ఉన్నాయి' ఎటువచ్చి చేరినా, తిరువణ్ణామలై ఒక్కటే. ఏ విషయానికైనా దారి వ్యక్తిభేదాన్నిబట్టి వేరౌతుంది. ఆత్మ మాత్రము ఒక్కటే. మరి తిరువణ్ణామలైలోనే ఉండి

అక్కడికి దారి నడిగేవానిని ఏమనాలి? అలాగే ఆత్మ తానే అయివుండి దాన్ని గుర్తించడ మెట్లనడం కన్న మౌఢ్యం మరొకటి ఉంటుందా? నీవే ఆత్మ: ఆత్మగానే ఉండు, చాలు. సరికాని దేహాత్మబుద్ధివల్లనే అన్ని సంశయాలూను. అది అజ్ఞానము. అది పోవాలి. దాన్ని త్రోసిపేస్తే ఆత్మ ఒక్కటే మిగులుతుంది."

## భాషణములు 355

భక్తుడు: చదువులేని వానికన్నా బాగా చదువుకున్న జ్ఞాని వలన ప్రపంచాని కెక్కువ ఉపయోగం కదా?

మహర్షి: పండితుడు గూడా చదువులేని జ్ఞానికి మ్రొక్కవలసిందే. నిరక్షరాస్యత అజ్ఞానం; పాండిత్యం, చదువుకొన్న అజ్ఞానం. ఇద్దరూ సరియైన గమ్యమేదో తెలియనివారే; జ్ఞానికి అట్టి అజ్ఞానం లేదు; ఆయనకు గమ్యమే లేదు గనుక.

భాషణములు 356

భక్తుడు: ప్రపంచంలో నిద్ర ఎందుకుండాలి?

మహర్షి: పాపంవల్ల,

భ: దానిని నాశం చేయవచ్చా?

మ: చేయవచ్చు.

భ: ఫలమనుభవిస్తేనే గాని అది పోదంటారే?

మ: అయితే దైవభక్తి ఎందుకు?

భ: నిద్ర నెట్లు నశింపచేయటం?

మ: దాని కార్యాలు, వాని ఫలితాలు తెలుసుకోకుంటే సరి.

భ: అదెలాగ?

మ: ఆత్మవిచారం వల్లనే?

స్మృతులు

## భాషణములు 357

తిరువణ్ణామలై ఊరిలో తామున్ననాటి సంగతులు కొన్ని శ్రీభగవాన్ చెప్పారు.

1. ఒకనాడెవరో ఒక ఆకు నిచ్చారు. దానిపై, అదేమో తెలియదు. ఒక చుక్క ఉంది. 'దాన్ని నాకివేయి, మంచి జీర్ణకారి' అన్నారు. అలాగే చేసి ఆ తరువాత భుజించారు. కొంత సేపటికి చుట్టూరా ఉన్నవారెల్లా తేజోమయులుగా అగుపించారు. కొంతసేపటికి ఆ అనుభవం పోయింది.

2. పవళకుండ్రులో ఉంటుండగా ఒకనాడా కొండ చరియలోని మడుగులలో స్నానము చేయవలె ననిపించింది. పళనిస్వామి కది తెలిపారు. త్వరలో ఆ వార్త వ్యాపించింది. అప్పుడు జటాపద్మనాభస్వామి ఆ కొండలోనే ఒకచోట నివసిస్తున్నారు. ఆయనా పళనిస్వామి కూడబలుకుకొని, ఆయన కుటీరం దాపున్నే ఉన్న కొండసానకు స్వామిని తీసుకొనివెళ్ళవలెనని నిశ్చయించారు. పళనిస్వామి, శ్రీ భగవాన్ కది తెలుపకుండానే వారి నక్కడికి తీసుకువెళ్ళారు. అక్కడ శ్రీభగవాన్కు వైభవంగా స్వాగతం ఏర్పాటు చేసి ఉంది. వారికొక ఉన్నతాసనం వేసారు. పాలుపండ్లు నివేదించారు. జటాపద్మనాభస్వామి చాల ఆదరంగా వారిని సేవించారు

3. ఆత్మసిద్ధి (సెల్ఫ్ రియలైజేషన్) గ్రంథంలో జటాపద్మనాభస్వామి శ్రీ భగవాన్కు చెరుపుదలంచినారని ఉంది. కాని నిజంగా ఆయనకు భగవాను ఎడల ఎంతో ప్రీతి. ఆయన వెర్రిమొర్రి చేష్టలు చూచి భగవానంటే ఆయనకు ఈర్ష్య అనుకుంటారు. ధనసేకరణకై భగవాన్ను ఉపయోగించి చూడటమే ఆయన లోపము. భగవాన్కది నచ్చలేదు. కాని జటాపద్మనాభస్వామిలో తప్పేమీ లేదు.

4. గుడిలోని పాతాళ గుహలో నెలల తరబడి శ్రీ భగవాన్ ఆహారము లేకనే ఉండిరా? అని పరిచారకుడు మాధవస్వామి అడిగాడు.

మహర్షి: ఊఁ ఊఁ, ఆహారము (పాలుపండ్లు) వస్తూ ఉండేవి. కాని ఆహార విషయం ఆలోచించె దెవరు?

5. చూతగుహలో ఉంటూండగా శ్రీ భగవాన్ కోవెలలో దేవునికై పచ్చని సురపొన్నలు, తామరపూలు, ఆకుపచ్చని ఆకులలో మాలలు గ్రుచ్చేవారు.

6. కల్యాణమంటపం కట్టిన తర్వాత శ్రీభగవాన్ మారువేషంతో అక్కడ ఒక రాత్రి యుండిరి.

7. గుడియావరణంలో ఒక చెట్టుక్రింద కూర్చుని ఉండగా, ఆయన ఒళ్ళంతా మురికిచేరి యుండింది - ఎప్పుడూ స్నానం చేసేవారు కాదు. డిసెంబరు నెల చలి రాత్రిళ్ళలో మోకాళ్ళు ముడుచుకొని, తలనందు తోసుకొని, అక్కడే పడుకునేవారు. తెల్లవారి లేచేప్పటికి ఒంటిపై మట్టిపొర, దాన్ని కప్పుతూ మంచుతెర. చూడటానికి తెల్లగా ఉండేవారు. సూర్యరశ్మికి ఒళ్ళు ఎండి అది నల్లనయ్యేది.

8. కొండమీద నున్న రోజుల్లో జటాపద్మనాభస్వామి పూజ చేస్తుంటే, శ్రీ భగవాన్ గంటలు వాయిస్తూ పాత్రలు శుద్ధి చేస్తూ సాయంచేసేవారు. అన్నీ మౌనంగానే. మలయాళంలో అష్టాంగహృదయం అనే వైద్య గ్రంథం చదివేవారు. ఆ రెండో యోగి వద్దకు వచ్చే రోగులకు గ్రంథంలో చెప్పిన చికిత్స సూచించేవారు. ఆ రెండవ సాధుకు, పాపం, ఈ పుస్తకాలు చదవటమే రాదు.

## భాషణములు 358

హాలులో ఒక దృశ్యం -- సాయంత్రం 8.20 గంటలయింది. భోజనం అయ్యాక భగవాన్ తిరిగివచ్చి సోఫాపై నడుం వాల్చారు. వెల్తురు మసకగా వుంది. నేలపై ముగ్గురు కూర్చుని ఉన్నారు. ఒకరు పత్రికలో నేదో చూచి వ్రాసుకుంటున్నారు; రెండవవారు ధ్యానంలో ఉన్నారు; మూడో అతను చేసేదేమి లేక ఇటూనటూ చూస్తున్నాడు. శ్రీ భగవాన్ అప్పుడప్పుడూ గొంతు సవరించుకొంటున్న ధ్వని తప్ప, అంతా నిశ్శబ్దంగా వుంది.

పరిచారక భక్తుడు, మాధవస్వామి చేతిలో తమలపాకుల పొత్తితో చప్పుడు చేయకుండా లోపలికి వచ్చి, బల్లవద్దకు వెళ్ళాడు. సోఫాపై పండుకొనియున్న భగవాన్ అతన్ని చూచి పిలిచి 'ఏం చేస్తున్నావు?' అని మెల్లగా గుసగుసలాడినట్లున్నారు.

పరిచారకుడు: 'ఆఁ ఏమిలేదని గొణిగి, ఆకు లక్కడపెట్టి అనుమానిస్తూ దేనికొరకో తడవసాగాడు.

మహర్షి: 'నాకది అక్కర లేదు' (పరిచారకుడు నేలపై చతికిల పడ్డాడు) శ్రీ భగవాన్ - కస్తూరిమాత్ర -- ఒకటి తర్వాత మరొకటి. రోజూనా? సీసా ఖాళీ అయిపోతే మరొక సీసా. నాకు అక్కరలేదు.'

మాధవ: (చాల నేర్పుగా) మధ్యాహ్న భోజనంలో అవియల్ భగవాన్ శరీరానికి పట్టినట్లు లేదు.

మహర్షి: "అదేం కాదు, అవియల్ చాలా బాగుంది.' త్రేన్పు, దగ్గు శ్లేష్మమ్ముమియు శబ్దము తప్ప అంతా నిశ్శబ్దం. కొన్ని నిముషాల తర్వాత పరిచారకుడు గదినుండి చల్లగా జారుకున్నాడు. అంతలో తిరిగి వచ్చాడు. చేతిలో చిన్న సీసా వుంది. భగవాన్ వద్దకు వెళ్ళి చేయిజాపి "జీరగం మాత్ర (జీలకర్ర మాత్ర) అన్నాడు. శ్రీ భగవాన్ సణిగారు – "దానిలో నిమ్మరసం వుంది. దీనికి నిమ్మరసం మంచిదిగాదు." ఇంతలో ఒక భక్తుడు, రంగస్వామి అయ్యంగారు, ధ్యానం నుంచి బాగా మేల్కొని అంతా చూస్తున్నాడు. పరిచారకుడు మాత్రం చేయి జాపే వున్నాడు.

శ్రీ భగవాన్: 'దాన్నెవరు నమలడం"?

రంగస్వామి అయ్యంగార్: "అది నమలేది గాదు. బుగ్గలో నుంచుకొని చప్పరిస్తే చాలు."

పరిచారకుడు: త్వరగా, 'అవునవును, దాన్ని చప్పరిస్తే చాలు.'

మహర్షి: రంగస్వామి అయ్యంగారిని చూపిస్తూ, 'అదిగో, ఆయనకియ్యి, చప్పరిస్తాడో, నమలుతాడో; నాకు మాత్రం వద్దు.'

నిరుత్సాహంతో పరిచారకుడు వెళ్ళి నేలపై కూలబడ్డాడు, మళ్ళీ లేచాడు. మహర్షి: 'నీవేం చేస్తావు? నాకది అక్కరలేదు.' పరిచారకుడు మందుల పెట్టెవద్దకు వెళ్ళి, 'కస్తూరి మాత్ర బాగా పనిచేస్తుంది.'

శ్రీభగవాన్: 'అది లేకున్నా నాకు త్వరలో ఒళ్ళు బాగౌతుందిలే. ఆ మాత్రను తీయకు. అక్కడే ఉంచేయి. నేను దాన్ని తీసుకోను. నీ యిష్టం వచ్చినట్లు చేసుకో.' పరిచారకుడు తిరిగి నేలపై చతికలబడ్డాడు. అందరూ నిశ్శబ్దంగా వుండిపోయి ఆ తర్వాత శయనించారు.

## భాషణములు 359

ప్రొద్దున 7-30 గంటలకు కాఫీ ఫలహారం కాగానే, భగవాన్ కొండపైకి వెళుతున్నారు. పాదానంద వెళ్ళి సాష్టాంగపడి, లేచి అన్నాడు "మంచిది, దర్శనం చేసుకున్నాను; ఇక నేను వెళ్తా.' భగవాన్ నవ్వుతూ - 'ఎవరి దర్శనం, నీ దర్శనం నా కిచ్చావని అనవేమి?" అన్నారు.

9 గంటలైంది. పూనానుండి శ్రీ పార్కి వచ్చి భగవాను నమస్కరించి, అష్టకం వల్లించి శ్రీ భగవాన్ అనుగ్రహం అర్థించాడు. ఆ స్తుతిలో చివర 'ఝటితి ముక్తి' (తొందరగా మోక్షం) అని ప్రయోగించాడు. ఆ మాటను పార్కి ఒత్తి పలికాడు కూడా.

మహర్షి: ముక్తి, విమోచనము, ఇకపై ఎపుడో తెచ్చుకొనేది గాదు. అది

ఎప్పుడూ ఉన్నదే. అప్పుడూ, ఇక్కడే ఉంది.

భక్తుడు: నే నొప్పుకుంటాను. కాని, నాకది అనుభవంలో లేదు.

మ: ఆత్మానుభవం "ఇప్పుడే" "ఇక్కడే". వ్యక్తి తనను తాను లేదనులేడు.

భ: దాని కర్థం ఉండడం. ఆనందంగా ఉండడం కాదు.

మ: ఉండడం = ఆనందం = స్థితి. ముక్తి అనే పదం కొంత ప్రకోపం కల్గిస్తుంది. ఎవరుగాని దాన్నెందుకు కోరడం? ఇప్పుడేదో బంధముండి, దానినుండి మోచనం వలసియున్నట్లు? ఉన్నదే ముక్తి, బంధమే లేదు. దానికొక పేరు పెట్టి, దానికై వెదకుట ఎందుకు?

భ: నిజమే. కాని మే మజ్ఞానులం.

మః అయితే అజ్ఞానం పోగొట్టుకో. చేయవలసిందంతే.

## భాషణములు 360

స్థితిమంతుడొకరు లక్నోనుంచి పాల్ బ్రంటన్ కు జాబు వ్రాసాడు. ఆయన భార్య శ్రీ భగవాన్ దర్శనార్థం పూర్వం వచ్చినప్పుడు లభించిన మనశ్శాంతిని ఇప్పుడు కోల్పోయిందట. దయచేసి శ్రీ భగవాన్ ఆమెకా శాంతిని పునః నెలకొల్పవలెనని ప్రార్థిస్తూ ఆ లేఖ.

అది విని శ్రీ భగవాన్ అన్నారు. ఒకమారు దొరికిన శాంతి తరువాత పోయిందంటే, దానికి మనోదౌర్బల్యమే కారణం.

## భాషణములు 361

శ్రీ భగవాన్కు రోజూ భిక్షదెచ్చే అవ్వ కొడుకు ముదలియార్ స్వామి, ఈ క్రింది ఆసక్తికరమైనా వృత్తాంతం వర్ణించాడు

అవి శ్రీ భగవాన్ విరూపాక్ష గుహలో ఉండే రోజులు. ఒకనాడు శ్రీ భగవాన్, తానూ, స్కందాశ్రమం వెనుకగా నడచిపోతున్నారు. అక్కడ 15 అడుగుల ఎత్తు బండ ఒకటుంది; దానిలో ఒక చీలిక. అక్కడ గొర్రె కాపరి కూతురొకతె ఏడుస్తూ నిల్చుని వుంది. ఏమని అడిగితే 'నా గొర్రె ఒకటి ఈ చీలికలో పడిపోయింది. ఏమి చేయలేక ఏడుస్తున్నా'నన్నది. శ్రీ భగవాన్ ఆ చీలికలో దిగి, గొర్రెను భుజాలపై కెత్తికొని, బండపైకి ఎక్కి వచ్చి, దాని నా పిల్లకు అందించారు. మొదలియార్స్వామి చెప్పేది వింటే, సాధారణ మానవుని కాపని దుస్సాధ్యం.

## భాషణములు 362

నెల్లూరు కాలేజి ప్రొఫెసర్, సుబ్బరామయ్య ముక్తిని గూర్చి అడిగారు.

మహర్షి: ముక్తిని గూర్చిన ఏ ప్రశ్నలూ ఉపదేశాలు (అంగీకరింపదగ్గవి) కావు. ముక్తియంటే బంధములనుండి విడివడటం, ముందేవో బంధనాలున్నట్లు! అట్టివేవీ లేవు, ముక్తీ లేదు.

భక్తుడు: శాస్త్రాలు వానిని, వాని వివిధ దశలను గూడ వర్ణిస్తాయి.

మ: శాస్త్రాలు, ఎరుక గలిగినవారికి కావు. వారికవి అనవసరం. అజ్ఞానులు వానిని కోరరు. శాస్త్రాలు పరికించేవారు ముముక్షులు మాత్రమే. అంటే శాస్త్రాలు జ్ఞానికి, అజ్ఞానికి కూడా పనికిరావు.

భ: వసిష్ఠులు జీవన్ముక్తులనీ, జనకులు విదేహముక్తులనీ అంటారే.

మ: వసిష్ఠులూ, జనకులూ వారి విషయం మనకెందుకు? మన సంగతి ఏమిటి?

ఈ రోజు దర్శనానికి చాలమంది క్రొత్తవారు వచ్చి ఉన్నారు. అందులో ఇద్దరు భగవాన్ ఎదుటనే గణపతి మునిని గూర్చి మాట్లాడుకుంటున్నారు. వారితో శ్రీ భగవాన్ మాటలు కలిపారు.

1. ముక్తిని చేరుకోడానికి ఉపాసన, జ్ఞానము రెండు రెక్కలు, అని కొందరి మతం. జ్ఞానమేమి? ఉపాసనయేమి? జ్ఞానం నిత్యం, పరమ గమ్యమూ అదే. ఏమైనా యత్నిస్తే, ఆ యత్నం ఉపాసన. అయత్న సిద్ధము జ్ఞానము, అదే ముక్తి,

2. వారిలో వారు చర్చించుకొన్న పిదప అందులో ఒకరన్నారు: మా బహిః ప్రవృత్తులనంతా పోగొట్టేందుకు ఏదో ఉన్నతశక్తి సాయం కావలసే ఉంది.

మ: బాహ్యప్రవృత్తులను చూచెదెవరు? కాక అవి తామున్నామని ఘోషిస్తున్నవా? అట్లైతే అవి ఉన్నవని ప్రపంచాన్నే చెప్పమను. ప్రపంచము లోనుండి వెలుపలకు ప్రసారితమైతే, అది “నేను” ఆలోచనతోపాటు ప్రసారితమని గుర్తించాలి. ఎట్లైనా 'నేను' పరమ ప్రధానమైన ఆధారం. అది తెలిస్తే, అన్నీ తెలుస్తాయి.

3. ఒకరన్నారు గణపతి ముని 'తాము ఇంద్రలోకానికి గూడాపోయి, ఇంద్రుడేమి చేస్తున్నది వచ్చి చెప్పగలను. కాని ఈ 'లోనికి పోయి 'నేను'ను కనుగొనడం మాత్రం సాధ్యం కాదు' అనేవారు.

శ్రీ భగవాన్ కలిపారు 'గణపతిముని ముందుకు పోవడం సులభమే కాని, వెనుకకు వెళ్ళడం అసాధ్యమనేవారు.'

ఎంత దూరమున్నా ఉన్నచోటనే ఉంటారు; వెనుకకు పోదామన్నా ఎక్కడికి? ఈ సత్యమే ఈశావాస్యోపనిషన్మంత్రంలో ఉంది.

4. గణపతి ముని ఆశుకవి ఎట్లైనాడన్న ప్రశ్నకు సమాధానంగా అన్నారు - 'ఆయన తపస్సు చేస్తుండగా శివుడాయన వద్దకు వచ్చి ఆయనకు పాలనో, తేనెనో త్రాగ ఇచ్చారట. దానితో ఆయన ఆశు కవియైనాడట.

## భాషణములు 363

డాడ్వెల్ ఒక యూరోపియన్ సివిల్ ఉద్యోగి. మద్రాసు ప్రభుత్వ ఆర్థికశాఖలో

డిప్యూటి సెక్రటరిగా ఉన్నాడు. భార్యతో సహా వచ్చి మధ్యాహ్నం ఒంటి గంటక ముందుగనే హాలులోకి వచ్చి మధ్యాహ్నం 3.30 గంటలవరకు కూర్చున్నాడు. ఆయన భార్య అడిగింది - 'పాశ్చాత్య దేశాల్లోని ప్రముఖ తత్త్వవేత్తలు, ఆధ్యాత్మిక జీవన కేంద్రం ఇండియాలో ఉందంటారు. ఇచటి వేదాంత గురువుల్లో పరస్పరం సంప్రదింపులుంటాయా? ప్రాక్ పశ్చిమ తత్త్వజ్ఞుల పరస్పర సంపర్కం సాధ్యమా?

మ: ఆధ్యాత్మిక కేంద్రం అంటున్నావే, దాని కర్థం యేమి?

భ: ఆధ్యాత్మిక జీవితాన్ని సమకూర్చగల నాయకులు ఉండే స్థానం.

మ: ఆధ్యాత్మిక నాయకులంటే?

భ: పశ్చిమదేశాల్లో సందిగ్ధ దశ ఒకటి ఏర్పడింది. భౌతికశాస్త్ర పరిజ్ఞానం విపరీతంగా పెరిగింది. అది వినాశకర శక్తుల నిర్మాణానికే వినియుక్త మవుతున్నది. వానిని సదుపయోగానికి తేవలెననే ఉద్యమం బయలుదేరింది. అట్లు చేయగల్గితే ప్రపంచాని కెంతో శుభం కలుగుతుంది. ఈ ఉద్యమ నాయకులే రక్షించేవారౌతారు.

మ: ఆధ్యాత్మిక నాయకులూ, గురువులూ అంటే మేమర్థం చేసుకొనేది వేరు. ఆధ్యాత్మిక అంటే భౌతికం కాని యని. ఆత్మకవధి లేదు, రూపు లేదు. ఆధ్యాత్మిక కేంద్ర విషయంలోనూ అంతే. అట్టి కేంద్రం ఒకే ఒకటి వుంది. తూర్పునగానీ, పడమటగాని, ఎక్కడైనా ఆ కేంద్రం భిన్నం గాదు. దానికొక స్థానమూ లేదు. నిరవధి గనుక, దానిలోనివారే ప్రజలూ, ప్రముఖులూ, ప్రపంచమూ, వినాశకర శుభంకర శక్తులూ సర్వమూనూ. సంపర్కమన్నావే, ఆధ్యాత్మ గురువులను కేవలం శరీరధారులుగా ఎన్నినందువల్ల, ఆ భావం కలిగింది. ఆధ్యాత్మిక జీవులు, దేహాలు కారు; వారికి శరీర స్మృతే ఉండదు. వారు అవధి ఆకృతులులేని ఆత్మ మాత్రమే. వారిలో వారికి సర్వానికీ ఏకత ఉంది; ఏకతే కాదు, వారే సర్వమూనూ.

తత్త్వము (స్పిరిట్) ఆత్మయే. ఆత్మను తెలిస్తే, ఈ ప్రశ్నలు కలుగవు.

అడయారు - శ్రీమతి జినరాజదాస: ఆత్మజ్ఞానం వినడానికి అతి సులభమని తోస్తుంది. కాని ఆచరింప వచ్చేప్పటికి అంత కష్టమైనది మరొకటి లేదు.

మహర్షి: అంతకన్నా సులభతరమొకటి ఉంటుందా? ఇతరాలన్నింటికన్నా ఆత్మ అత్యంత సన్నిహితం. దాన్నే సిద్ధింప చేసుకోకపోతే, మనకు వేరుగా, దూరంగా ఉన్నదాన్ని సాధించటం తేలికవుతుందా?

భ: ఆత్మానుభవం అంతా భ్రమవలె ఉంది. దాన్ని శాశ్వతం చేసుకొనేదెట్లు?

మ: ఆత్మ ఎన్నడూ భ్రమ గాదు. ఏకైక సత్యమది. కనబడేది, కనరాకపోవచ్చు. కావున అది శాశ్వతం కాదు. ఆత్మ ఒకప్పుడగపడి, ఇంకొకప్పుడు అంతరించేది కాదు. అందువల్ల అది శాశ్వతము.

భ: అవును, నిజమే. అది మీకు తెలుసు. థియోసాఫికల్ సొసైటీవారు (దివ్యజ్ఞాన సమాజం వారు) మార్గ దర్శనం కోసం, గురువులను ధ్యానిస్తారు.

మ: గురువు లోననే ఉన్నారు. ధ్యానం, ఆ గురువు వెలుపల ఉన్నారన్న అజ్ఞానం నివారించడానికి. అతను నీ వెదురు చూడవలసిన నూతనాగంతకుడైతే, అతడంతలోనే వెళ్ళిపోనూవచ్చు, ఇటువచ్చి అటుపోయే వ్యక్తితో ఏం ప్రయోజనం?

అయినా, నిన్ను నీవొక వ్యక్తిగా, శరీరంగా గణించినంతకాలం గురువు అవసరమే. అతడు శరీరధారి కాక తప్పదు. ఈ తప్పు తాదాత్మ్యం తొలగినప్పుడు ఆత్మయే గురువుగా భాసిస్తుంది.

కైవల్య నవనీతంలోని పద్యం చూడు

"నీవు జన్మజన్మలుగా నన్ను రక్షిస్తూ, నాలో ఆత్మగా నిల్చియున్నావు. ఇప్పుడు నన్నుగ్రహింపదలచి నా గురువుగా గోచరించి, ఆత్మగా వెలుగొందినావు."

నిద్రలో ఏం జరుగుతుందో కొంచెం గమనించు. అహంకారం లేదు. హిందూదేశం లేదు, ముముక్షువులు లేరు, గురువు లేరు. ఎవ్వరూ లేరు. కాని నీవున్నావు -- సుఖంగా కూడ.

దేశము, సాధకులూ అందరూ, ఇప్పుడు కనబడతారు. కాని వారు నీకు భిన్నులూ నీనుండి స్వతంత్రులూ కారు.

ఎన్నికల సంరంభంలో సెలవులిచ్చినందువల్ల, ఆశ్రమంలో జనం సందడి ఎక్కువగా వుంది. వారిలో కొందరీ సంవాదంలో పాల్గొన్నారు. ఒకరు పునర్జన్మను గూర్చి ప్రశ్నించారు.

మః పునర్జన్మ అజ్ఞానం ఉన్నంతవరకే. అది ఇప్పుడూ లేదు, పూర్వమూ లేదు, ఇటుపైనా ఉండదు. ఇదే నిజం.

భ: జీవాత్మ అంటే ఏమి?

మ: జీవాత్మ మరల మరల కనబడుతూ పోతూవుండే క్షణికమైనది. నిజమైన ఆత్మ శాశ్వతంగా నిలిచియుండేది. నిజంగా నీవు సత్యాత్మవయ్యుండీ నిన్ను నువ్వు తప్పుగా జీవాత్మగా భ్రమ చెందుతావు.

భ: ఈ భ్రాంతి ఎట్లు కల్గింది?

మ: భ్రాంతి కలిగిందో లేదో, అది చూడు.

భ: జీవాత్మను ఉత్కృష్టంగా, సత్యాత్మగా తీర్చి దిద్దాలి.

మ: జీవాత్మంటూ అసలు లేదు.

భ: అయితే అది మనలను ఎందుకు ఇబ్బంది పెడుతుంది?

మ: ఆ ఇబ్బందులు ఎవరికి? ఆ కష్టాలు గూడ కల్పనలే. కష్టమూ, సుఖమూ అహంకారానికే.

భ: ప్రపంచం ఎందుకు ఇంతగా అజ్ఞాన ఆవరణలో చిక్కుకొంది?

మ: నీ సంగతి నీవు చూసుకో. ప్రపంచం సంగతి దానికే వదిలేయి. నిన్ను చూడు. నీవు దేహమైతే, ప్రపంచమూ స్థూలమే. నీవు ఆత్మవైతే, అంతా ఆత్మయే.

భ: వ్యక్తికి చెందినంత మటుకు అది సరికావచ్చు. కాని ఇతరుల మాటేమిటి?

మ: ముందు నిన్ను జూడు. ఆ పైన ప్రశ్నలు వచ్చునేమో చూడు.

భ: అవిద్య ఉందా?

మ: ఎవరికి?

భ: జీవాత్మకు.

మ: ఉంది, అహంకారానికి, అహంకారం తొలగించు, అవిద్య ఎగిరిపోతుంది. దానికై వెదకితివా, అది అసలుండదు. యథార్థమైన ఆత్మయే మిగులుతుంది. అవిద్య కలదనుకొనే అహంకారం కానరాదు. నిజానికి అవిద్య లేదు. అవిద్యలేదని నిరూపించడమే అన్ని శాస్త్రాల ప్రయోజనము.

భ: అహంకారం ఎలా పుట్టింది?

మ: అహంకారం అంటూ లేదు. ఉంటే, ఆత్మలు రెండుండవలసి వస్తుంది. అది నీవు ఒప్పుకుంటావా? జీవాత్మ లేనప్పుడు, అవిద్య ఎట్లుంటుంది? అది నీవు విచారిస్తే, ఇప్పటికే లేని అవిద్యను, లేనిదని కనుగొంటావు, లేకుంటే అది పారిపోయిందంటావు.

అవిద్య అహంకారానికి సంబంధించినది. అహంకారమును తలచుకొని తిరిగి బాధ కూడా ఎందుకు? ఇంతకూ అవిద్య అంటే ఏమిటి? ఏది లేదో అది. కాని నిత్య జీవితానికి అవిద్య అనే అనుమానం (హైపోతీసిస్) అవసరం. అవిద్య అంటే తెలియక పోవడం అంతే. అది ఆత్మ అంటే తెలియక పోవడం లేదా మరుపు. సూర్యుని ఎదుట చీకటి ఉంటుందా? అట్లే స్వప్రకాశమూ, స్వయంవ్యక్తమూ అయిన ఆత్మసన్నిధిలో అవిద్య నిలబడగలదా? నీవు ఆత్మ నెరిగితే, చీకటి ఉ ండదు, అవిద్య ఉండదు, దుఃఖము వుండదు.

కష్టాలతో, దుఃఖాలతో బాధపడేది మనస్సు. చీకటి రానూరాదు, పోనూపోదు. సూర్యుని చూడు, చీకటి లేదు. అలాగే ఆత్మను దర్శించు, అవిద్య అనేది లేదని తెలుస్తుంది.

భ: శ్రీ రామకృష్ణాదులు చిత్తైకాగ్రతను అభ్యసించారు కదా.

మ: ఏకచింతన, ఇతర అభ్యాసాలూ అవిద్య అనేది లేదని గుర్తించట కొరకే. తాను లేనని ఎవ్వడూ అనడు. స్థితి (ఉనికి)యే విద్య, లేక ఎరుక. ఎరుక కర్థం అవిద్య లేకపోవటం. అందువల్ల అందరూ సహజంగానే అవిద్య లేదని ఒప్పుకుంటారు. మరి వానికి కష్టాలేల? తానిది అదియని భావిస్తాడు గనుక, అది తప్పు. “నేను - ఉన్నాను" (I-am) సత్యం. “నేను - ఇది - అదిగా ఉన్నాను” (I-am-so and so) తప్పు. ఉనికి పరమమైనపుడు (absolute) అది యథార్థము. వైయ్యక్తిక (particularised) అయితే, అది తప్పు. సత్యసర్వస్వమిదే. ప్రతివాడూ తానున్నానని అంగీకరించడం చూడు. వాడేం అద్దంలో చూచి చెపుతున్నాడా తానున్నానని? వాని ఎరుక వాని ఉనికిని నిరూపిస్తున్నది. కాని వాడు ఈవిషయం దేహాదులతో కలిపేస్తాడు. అట్లెందుకు చేయాలి? నిద్రలో వాడు దేహమెరుగునా? లేదే? అయినా నిద్రలో తానుండక పోలేదు. ఉన్నాడు, కాని శరీరం లేకుండా ఉన్నాడు. నిద్రలో తానున్నానని వానికెట్లు తెలుసు? మెలకువలో తానున్నా ననటానికి వాని కద్దం అక్కరలేదు. ఎరుకగా ఉండు. నీ ఎరుకలో నీ ఉనికి సువ్యక్తంగా ఉంటుంది.,

భ: ఆత్మనెరిగే దెలాగు?

మ: ఆత్మనెరుగుట అంటే ఆత్మగా నుండటం. ఆత్మను నీ వెరుగవని అనగలవా? నీ కళ్ళను నీవు చూడలేవు; అద్దమూ దగ్గరలేదు - అంత మాత్రానికే నీకు కళ్ళ లేవనవుగా? అలాగే నీకు ఆత్మ ఎరుకే అది ఒక విషయంగా తెలియదుగాని, అది విషయం కాదని, నిన్ను నీవు లేవనవు. 'నే నాత్మను తెలియలేకున్నాను' అంటే నీ నితర వస్తువులను తెలిసినట్లుగా ఆత్మను తెలియలేకున్నావని. అంటే దాని విషయంగా నీకు సాపేక్ష జ్ఞానం లేదు. నీవు సాపేక్ష జ్ఞానంతో అలవాటు పడి వున్నావు. ఆత్మ ఒక విషయంగా గోచరించదు. సాపేక్షజ్ఞానంతో అలవాటుపడి, తప్పు సామ్యం వలన స్పష్టమైన ఆత్మను తెలిసికోవడం కష్టం అవుతోంది. అందువల్లనే ‘ఆత్మనెరుగుట ఎట్లు?' అని అడగడం జరుగుతోంది. నీ కష్టమంతా 'ఎట్లు'తోనే. ఆత్మ తెలియవలసింది ఎవరికి? దేహానికది తెలుస్తుందా?

దేహాన్ని బదులు చెప్పమను. దేహమిప్పుడు గోచరిస్తున్నదని చెప్పు వాడెవ్వడు? ఇటువంటి అజ్ఞానాన్ని పోగొట్టడానికి శాస్త్రాలు, 'దైవలీల' లేక 'దైవక్రీడ' అనే వాదాన్ని ఉపపాదించాయి. దైవము మనస్సుగా ఇంద్రియములుగా తనువుగా రమించినవాడు, ఆటలాడినవాడు. ఆయన ఆట సంకటమనడానికి నీవెవరు? దైవచేష్ట నాక్షేపించేందుకు నీవెవరు?

ఉండటమే నీ విధి, ఇట్లుండుట అట్లుండుట గాదు. "I am that I am" మొత్తం సత్యం యొక్క సారాంశం. ఆ విధానమంతా ముక్తసరిగా 'నిశ్చలంగా ఉండు' (Be still) ‘ఊరకే ఉండు'లో ఉంది. నిశ్చలత అంటే ఏమిటి? నిన్ను నీవు నష్టం చేసుకొమ్మని. రూపమేదైనా సంకట కారణమే. 'నేనంతవాడను, అట్టివాడను' అనే భావం వదిలెయ్యి. మన శాస్త్రాలు 'అహమితి స్ఫురతి (“నేను” అని వెలుగుతుంది) అన్నవి.

భ: స్ఫురణ ఏమి?

మ: 'అహమహ'మనేది ఆత్మ. (నేను-నేను) 'నేనిది, నేనది' అనేది అహంకారం. ప్రకాశము ఎటూ ఉన్నది. అహంకారం క్షణికము. "నేను నేను"గానే నిలచియుంటే, అది 'ఆత్మ'. అది అడ్డంగా ఒకమారు దుమికి 'నేనిది' అన్నదో, అది "అహంకారం".

భ: దైవము ఆత్మకు భిన్నమా?

మ: ఆత్మయే దైవము. 'నే నున్నాను', దైవము; 'అహమాత్మా. గుడాకేశ' అన్నది గీత.

నీవు జీవాత్మననుకొన్నందువల్ల, ఈ ప్రశ్న. యథార్థమైన ఆత్మను గట్టిగా పట్టుకుంటే నీకీ ప్రశ్న రాదు. నిజమైన 'ఆత్మ' ఏ ప్రశ్ననూ అడుగదు. అడుగలేదు. ఆత్మకు దైవం భిన్నమైతే దైవానికి ఆత్మ లేకపోవలె. అది అర్థం లేదు.

భ: సాష్టాంగ నమస్కారమంటే ఏమిటి?

మ: సాగిలపడటం, అహంకారం అణగడమన్న మాట. అణగడం అంటే ఏమి? తాను జనించిన చోట లయించడం, బహిరంగంగా మ్రొక్కడం, సాష్టాంగాలతో దైవాన్ని మోసం చేయలేము. అసలు వ్యక్తిత్వమున్నదో లేదో అతడు పరికిస్తాడు.

శామణ్ణ: నేనున్నానని తెలియుటకు షష్ఠమేంద్రియమేమన్నా ఉందా?

మహర్షి: నీకది నిద్రలో ఉందా? ఉన్నది ఏకమే, పంచేంద్రియముల ద్వారా ప్రసరిస్తుంది. కాక ప్రతి ఇంద్రియమూ భిన్నమూ స్వతంత్రమూనై అయిదు ఆత్మలుగా, తమ్ము వశంలో ఉంచటానికి మరొక ఆరవ ఆత్మకు తావిస్తున్నవంటావా? ఈ పంచేంద్రియముల ద్వారా ప్రవర్తిస్తూన్న శక్తి ఒకటుంది. అట్టి శక్తిని కాదనలేవు. నీ ఉనికిని కాదనలేనట్లే. దేహమే తెలియని నిద్రలో గూడ నీ వుండటం లేదా? ఆ నీవే ఇప్పుడూ ఉన్నావు. దేహమున్నా, లేకున్నా మన ముండటం ఒప్పుకోవలసిందే. ఇంద్రియాలు అప్పటప్పటికి పనిచేస్తాయి. వాని పనులకు మొదలుంది, తుదీ ఉంది. ఆ పనులకు ఒకే ఆధారమేదైన ఉండాలి. ఏకమేమీ కనబడలేదంటే, అది ఏకమే అని ఒప్పుకొన్నట్లే. దాన్ని తెలుసుకొనే ద్వితీయం లేదని నిర్ధారమౌతుంది.

ఈ చర్చలన్నీ అజ్ఞాన నివారణకే. అది అయితే అన్నీ సుస్పష్టమౌతాయి. సామర్థ్యమూ, పరిణతీ ఉంటే సరి.

భ: సాధకుని సామర్థ్యాన్ని అనుగ్రహం పెంచలేదా?

మ: దాన్ని దైవానికి విడిచేయి. సంపూర్ణంగా స్వార్పణం చేసుకో. రెంటిలో ఏ ఒకలో చేయవలె. నీవు సమర్థుడవుకావనీ, ఏదో ఉచ్చతర శక్తి సాయం నీ కవసరమనీ నమ్మితే, శరణాగతి చెందు. అట్లుకాకపోతే దుఃఖకారణ విచారము చేసి, దాని మూలం తెలిసికొని అందులో మునిగిపో. ఎటైనా నీవు దుఃఖాన్నుంచి తప్పుకుంటావు. ప్రపన్నుణ్ణి దైవమెప్పుడూ వదలడు. 'మామేకం శరణం వ్రజ' చెప్తోంది గీత.

భ: శరణాగతి తర్వాత మనస్సే విధంగా వర్తిస్తుంది?

మ: శరణాగతి చేసిన మనస్సు ఈ ప్రశ్నను అడుగుతోందా? (అందరూ నవ్వులు)

## భాషణములు 364

నెల్లూరు ప్రొఫెసర్ సుబ్బరామయ్య: విశ్వరూప దర్శనం గూర్చి తెలియగోరారు. మహర్షి: విశ్వాత్మ దర్శనమే విశ్వరూప దర్శనము. విశ్వాత్మ అంటే, జగత్తు యొక్క ఆత్మ, జగత్తే. రెండవ అధ్యాయంలో సంవాదం ప్రారంభిస్తూ శ్రీ కృష్ణులు "నాకు రూపము లే" దన్నారు. పదకొండవ అధ్యాయంలో 'నా రూపాన్ని విశ్వంగా చూడు'మన్నారు. ఇది అన్వయంగానే ఉంది.

ఇంకోచోట అంటారు - 'నేనీ త్రిలోకాల నధిగమిస్తాను' అని. కాని అర్జునుడాయన దేహంలో ముల్లోకాలను చూస్తాడు. "నన్ను మానవులు, దేవతలనూ గూడ చూడశక్తులుగారు.' అన్నా ఆయనలోనే అర్జునుడు తన్నూ, దేవతలనూ కనుగొన్నాడు. ఎవ్వరూ చూడజాలరు, కాని ఆయన్ను చూడటానికై అర్జునునికి దివ్య చక్షువు ప్రసాదించాడు. ఇదంతా పరస్పర వైరుధ్యాలతో నిండినట్లుగా లేదూ?

దీనికి సమాధానము ఒక్కటే. మనం దాన్ని సరిగా అర్థం చేసుకోలేదు. భూతలంలో (ఫిజికల్ ప్లేన్) స్థూలదృష్టికి అర్థం లేదు. కావలసింది జ్ఞానదృష్టి (సూక్ష్మదృష్టి) అందుకే అర్జునునికి దివ్యచక్షువు నిచ్చాడు. అట్టి దృష్టి స్థూలం కాగలదా? అట్టి వివరణం సరియైన అవగాహనకు సహాయం చేస్తుందా?

'కాలోస్మి' (నేను కాలాన్ని) అన్నారు శ్రీ కృష్ణులు. కాలానికి రూపమున్నదా? ఇంక, విశ్వమే ఆయన రూపైతే, అది ఏకమూ, అవికారమూ (మార్పునొందనిది) కావలె. అయితే 'నీవు చూడగోరినవన్నీ నాలో చూడు'మన్నారు శ్రీకృష్ణులు. అంటే ఆయన రూపం, చూచేవాని కోర్కెకనుగుణంగా ఉంటుందన్నమాట. దివ్యదృశ్య మంటూనే ప్రతివాడూ వాని వాని దృష్టిని బట్టి దాన్ని చిత్రిస్తాడు. చూచేవానిలో అర్జునుడు తానూ ఉన్నాడు, ఏమిటిదంతా? వింత వింత దృశ్యాలు చూపడానికి ఐంద్రజాలికుడు చాలడా? కాని వాడుచేస్తే, దాన్ని ఇంద్రజాలం అంటారు. శ్రీకృష్ణులు కావిస్తే అది దివ్యము. ఎందుకీ భేదం? దృశ్యమేదీ నిజంగాదు, అసలు నిజమదే.

## భాషణములు 365

భగవాన్ ఆ ధోరణిలో ఉండగానే, ఒకరు అడిగారు.

భక్తుడు: దేహాత్మ బుద్ధిని దాటేదెలా?

మహర్షి: నిద్ర మాటేమి?

భ: అక్కడున్నది అజ్ఞానము మాత్రమే.

మ: నిద్రలో నీకు తెలియదని నీకెట్లు తెలుసు? నిద్రలో నీ వుంటివా లేదా?

భ: నాకు తెలీదు.

మ: అప్పుడు నీవు లేవంటావా?

భ: నేనున్నాననే అనుమానించాలి.

మ: నీ ఉనికి అనుమానమా?

భ: అనుమానమూ, అనుభవమూ గూడా.

మ: అనుభవానికి అనుమానం కావలెనా? (నవ్వు)

భ: ధ్యానంలో చేసేది తత్త్వవివేచనా (అనలిటికల్) లేక సమన్వయమా ( సింథటికల్ )?

మ: ఆ రెండూ విజ్ఞాన స్థితిలోనివి. ఆత్మ వానికతీతము.

## భాషణములు 366

శ్రీమతి దాద్వెల్ 3.30కు వెళ్ళిపోతూ రెండవ ప్రశ్న వేసింది 'నేతి, నేతి' యంటే ఏమి?

మహర్షి: ఇప్పుడు ఆత్మను ఇంద్రియ దేహాదులుగా భ్రమపడుతున్నావు. వానిని పరిహరించడానికి పూనుకొంటావు. ఇది 'నేతి'యనటం. ఇది సరిగా నిర్వర్తించడానికి, పరిహరింప వీలుగాని దానిని పట్టుకోవాలి. అది 'ఇతి' మాత్రమే.

## భాషణములు 367

అనుకోకుండా అచ్చటికి వచ్చిన ఒక మరాఠి యువతి వెళ్ళిపోతూ కన్నీళ్ళు నిండిన కళ్ళతో శ్రీ భగవాన్తో అన్నది - "ముక్తి ఒక జన్మలో అసాధ్యమని నాకు తెలుసు. కాని ఈ జీవితంలో మనశ్శాంతైనా దొరకదా?"

మహర్షి ఆమె వైపు కరుణార్ద్రంగా చూచి, చిరునవ్వుతూ, మృదువుగా అన్నారు "జీవితమూ, ఇతర సర్వమూ బ్రహ్మములోనే ఉన్నాయి. బ్రహ్మము ఇప్పుడే ఇక్కడే ఉన్నాడు. దీని గురించి విచారం చెయ్యి."

భక్తుడు: నేను కొన్ని యేండ్లుగా ధ్యానం చేస్తున్నాను.

అయినా నా మనస్సు

స్థిరం కాలేదు. ధ్యానంలో ఏకాగ్రత కుదరటం లేదు. మహర్షి: ఆమెవైపే స్థిరంగా చూస్తూ అన్నారు -"ఇప్పుడది చేసి చూడు. అంతా సరిపోతుంది."

## భాషణములు 368

9, 10 ఏండ్ల ఆడపిల్ల, వాళ్ళ అమ్మ మద్రాసు యూనివర్సిటీ సంస్కృతశాఖలో పరిశోధన చేస్తున్నది. ఆ పిల్ల, మోరిస్ ఫ్రిడ్మన్తో కూడా, మధ్యాహ్నం 12 గంటలకు, శ్రీ భగవాన్ న్ను పల్లాకొత్తులో కలుసుకుంది. ఎప్పటిలాగే శ్రీ భగవాన్ ఆ పిల్లను చూచి చిరునవ్వు నవ్వారు. ఆ అమ్మాయి భగవానన్ను అడిగింది. "లోకంలో దుఃఖ మెందుకుంది?"

మహర్షి: కర్మవల్ల.

భక్తురాలు: కర్మను ఫలింపచేసే దెవరు?

మ: దైవం.

భ: కర్మలను చేయించేది దైవం. అవి చెడువైతే చెడుఫలితాలనిచ్చేది ఆయనే. ఇది న్యాయంగా ఉందా?

శ్రీ భగవాన్ బిగ్గరగా నవ్వేట్లయింది. ఆ పిల్లను చూచి ఆయనకు ముచ్చట వేసింది. తరువాత హాలులోకి రాగానే ఏదో చదువమని ప్రోత్సహించారు. అప్పటినుంచి ఆ పిల్లను భగవాన్ చూస్తూనే ఉన్నారు.

## భాషణములు 369

మరాఠి దంపతులొకరు ఆశ్రమానికి వచ్చారు. వారు శాంతంగా, నిరాడంబరంగా ఉన్నారు. ఆశ్రమం వదలి పోయేటప్పుడు వారి కళ్ళల్లో నీరు నిండింది. మగవాడు సగద్గదంగా భగవాన్ అనుగ్రహం వేడాడు. శ్రీ భగవాన్ వారివైపే చూచారు. పెదవులు విడివడి, తెల్లని పలువరస కనబడింది. ఆయన కంటిలో కూడ అశ్రుబిందువు నిలిచింది.

## భాషణములు 370

శ్రీ భగవాన్ గోశాలలో ఉన్నారు. పనివారేదో పనిలో నిమగ్నులు. వారినే పరికిస్తున్నారు భగవాన్. ఇంతలో ఎవరో వచ్చి, ఎందరో హాలులో శ్రీవారికై వేచియున్నారని నివేదించాడు. ఎప్పటిలాగే శాంతంగా, శ్రీ భగవాన్ "అవునవును, మీ పని మీరు చేయండి. నా పనికై నేను వెళ్తాను. జనులు నాకై కాచుకొని ఉన్నారు. వెళ్తాను" అంటూ అక్కడ నుండి వెళ్ళారు.

## భాషణములు 371

ముగ్గురు ఆంధ్రులు, నడివయస్సులోనివారు వచ్చారు. వారిలో ఒకడు మోకరిల్లి నమస్కరించి భగవానన్ను అడిగేడు. “కొంత కాలంగా బస్తి, ధౌతి, నేతి లాంటి హఠయోగాభ్యాసాలు చేస్తున్నాను. మడమలో ఒక రక్తనాళం గట్టిపడింది. అది యోగాభ్యాసం వల్లనా?”

మహర్షి: ఇతర కారణాలవల్ల అది యెలాగూ గట్టిపడే ఉంటుంది. ఆ బాధ ఇంకెంతగానో కలగవలసింది. దానివల్ల ఇప్పుడు తక్కువగా ఉంటున్నది. హఠయోగం శుద్ధిచేయు పద్ధతి. అది ప్రాణాయామానికి దారి తీసి నీకు మనశ్శాంతి గూడ కల్గిస్తుంది.

భక్తుడు: నేను ప్రాణాయామం చేసేదా? అందువల్ల ఉపయోగము వుంటుందంటారా?

మ: మనోనిగ్రహానికి ప్రాణాయామ ముపకరిస్తుంది. కాని ప్రాణాయామంతో మాత్రం ఆగకూడదు. దానిపై ప్రత్యాహార, ధారణ, ధ్యాన సమాధులను గూడ అభ్యసించాలి. అప్పటికిగాని పూర్ణప్రయోజనం సిద్ధించదు.

వారిలో మరొకరన్నారు - కామక్రోధాది అరిషడ్వర్గాన్ని పోగొట్టుకొనేదెలా?

మ: ధ్యానం వల్ల.

భః ధ్యానమంటే ఏమి?

మ: ఒకే ఆలోచనపై చిత్తముంచి, వేరు ఆలోచనల నన్నింటినీ తొలగించడం.

భ: ధ్యానం దేనిపై?

మ: నీకేది ప్రియమో, దానిపై.

భ: శివ, విష్ణు, గాయత్రి వీని మహిమ సమమంటారు. వీనిలో డేని సెన్నుకొనేది?

మ: ఈ మూడింటిలో నీ కత్యంత మిష్టమైనదాన్ని, వాని యన్నింటి శక్తి సమమేకాని నీవు వాటిలో ఒక్క దానినే అంటిపెట్టుకోవాలి.

భ: ధ్యానం చేయట మెలాగ?

మ: వానిలో నీవెన్నుకొన్న దానినే చింతనచెయ్యి. ఒకే తలపు ప్రదానంగా స్థిరపడితే, ఇతరాలోచనలు తొలగిపోయి, చివరకవి నష్టమౌతాయి. నానాత్వ మున్నంతవరకు చెడు తలపులూ వుంటాయి. ప్రేమపద మత్యంత ప్రబలమైతేనే మంచి తలపులు సమకూడుతాయి. కాబట్టి ఒకే ఆలోచనను పట్టుకో. ధ్యానం ప్రధానమైన సాధన.

కొంతసేపాగి మరల భగవాన్ 'ధ్యానం ఒక పోరు. ధ్యానం మొదలిడగానే, ఇతరాలోచనలు గుడికూడి కమ్ముకుంటాయి. బలం పుంజుకొని నీవు ప్రత్యేకాలంబంగా ఎన్నుకొన్న తలంపులను ముంచివేయ యత్నిస్తాయి. నీ ఆలంబనం క్రమంగా మరల మరల అభ్యసించడం వల్ల దృఢపడాలి. ఆ పైన ఇతరాలోచనలు పరారి చిత్తగిస్తాయి. ధ్యానసమయంలో ఈ హోరాహోరి పోరు తప్పదు.

ప్రతివాడూ దుఃఖనివృత్తిని కోరుతాడు. దానికి మనశ్శాంతి కావాలి. అంటే వివిధాలైన ఆలోచనలవల్ల కలిగే విక్షేపం ఉండరాదు. ధ్యాన మొక్కదానివల్లనే మనశ్శాంతి సాధ్యమవుతుంది.

భ: మరి ప్రాణాయామ మెందుకు?

మ: తలపులను సూటిగా అరికట్టలేని వానికి ప్రాణాయామం. అది కారుకు బ్రేక్ లాంటిది. కాని అక్కడే ఆగక, ముందు చెప్పినట్లు ప్రత్యాహారాదులను గూడ అభ్యసించాలి. ధ్యానం ఫలించిన తర్వాత ప్రాణాయామం లేకున్నా మనస్సు అధీనంలోకి వస్తుంది. ఆసనాలు ప్రాణాయామానికి, ప్రాణాయామం ధ్యానానికి సాయం చేస్తాయి. ఫలితం మనశ్శాంతి. హఠయోగ ప్రయోజనం ఇదే.

ధ్యానం సుప్రతిష్ఠితమైన తర్వాత దానిని వదలుదామన్నా వీలుకాదు. నీవు ఆటలోనున్నా, ఉల్లాసాలలోవున్నా, పని చేసుకుంటున్నా, అది నీ యత్నం లేకుండానే సాగిపోతుంది. అది నిద్రలోనూ ఆగదు. అది నీ సహజ స్వభావమయ్యేంత వరకు తీవ్రంగా అభ్యసించాలి.

భః ధ్యానం పెంపొందడానికి ఏపైనా క్రతుకార్యాలవసరమా?

మ: ధ్యానమే కార్యమూ, క్రతువూ, యత్నమూను. అన్నింటికన్నా అది గాఢమూ, శక్తివంతమూను. దానికై వేరే యత్నమేమీ అక్కరలేదు.

భ: జపం చేయవలసిన అవసరం లేదా?

మ: ధ్యానం వాక్కుకాదా? దానికి జపమెందుకు? ధ్యానం సాధిస్తే మరేమీ అక్కరలేదు.

భ: మౌన వ్రతం సహాయపడుతుందా?

మ: వ్రతం కేవలం వ్రతం మాత్రమే. కొంతవరకది ధ్యానానికి సాయపడవచ్చు. కాని మనసు అన్ని దెసలా చిందులు త్రొక్కుతుంటే, నోరు మాత్రం మూసికొంటే ఫలమేమి? మనస్సు ధ్యానమగ్నం అయినపుడు వాక్కుతో పనేమి?

ధ్యానమంత మంచిది మరిలేదు. మౌనవ్రతం పూని కార్యప్రవృత్తిలో వుంటే ఆ వ్రతం వల్ల ప్రయోజనమేమి?

భ: జ్ఞానమార్గమంటే ఏంటి?

మ: ఎంత కాలంగానో నేను చెబుతున్నదే అది. జ్ఞానమంటే సత్యసిద్ధి. అది ధ్యానం వల్ల సాధ్యమవుతుంది. ధ్యానంవల్ల సత్యంలో నీకు పట్టుచిక్కుతుంది. అంతట ఇతరాలోచనలన్నింటినీ వెనుకకు త్రోయవచ్చు.

భ: ఎందుకు ఇంతమంది దేముళ్ళు ఉన్నారు?

మ: శరీరం ఒకటే. కాని అది ఎన్ని పనులు చేస్తుందో. అన్ని పనులకూ ఆధారం అదొకటే. దేవతల విషయమూ అంతే.

భ: మనిషి దుఃఖంతో ఎందుకు కష్టపడవల్సివస్తోంది?

మ: ఆలోచనల నానాత్వం దుఃఖానికి కారణం. తలపులన్నీ ఏకమై, ఒక్కదానిపైనే చింతన నిలిస్తే దుఃఖమేమీ లేదు. సుఖము కల్గుతుంది. అప్పుడు 'నేను చేస్తున్నా'ననేదీ ఉండదు. కర్మఫలంపై దృష్టికూడా ఉండదు.

## భాషణములు 372

భక్తుడు: రోమాంచము, గొంతు గద్గదమగుట, ఆనందాశ్రువులూ, ఇట్టివే మరెన్నో ఆత్మవిద్యావిలాసం మొదలైన గ్రంథాల్లో వర్ణించియున్నారు. ఇవన్నీ సమాధిలోనా, అంతకు పూర్వమా లేదా తర్వాత వస్తాయా?

మహర్షి: అవన్నీ అత్యంత సూక్ష్మమైన మనోవృత్తుల లక్షణాలు. ద్వైత భావనలేక అవి ఉండజాలవు. సమాధి పూర్ణశాంత స్థితి. అందులో వీనికి తావు లేదు. సమాధి నుండి బయటకు వచ్చిన తర్వాత, ఆ అనుభవస్మరణంలో ఇవి కలుగవచ్చు. భక్తిమార్గంలో ఇవన్నీ సమాధి రాబోయే సూచనలు.

భ: జ్ఞానమార్గంలో కావా?

మ: కావచ్చు. దాన్ని గూర్చి ఇదమిత్థమని లేదు. అది ఆయా వ్యక్తిని బట్టి ఉంటుంది. వ్యక్తిత్వం పూర్తిగ నష్టమయ్యే స్థితిలో వీనికి చోటే లేదు.

వ్యక్తిత్వం లేశం మిగిలియుండినా, ఈ లక్షణాలు గోచరించవచ్చు. మాణిక్యవాచకర్ మరియు మిగిలిన యతులు వీనిని వర్ణించారు. అనుకోకుండా, ఆపలేని వేగంతో అశ్రువులు రాలివస్తాయని వారన్నారు. అశ్రుపాతము వారెరిగియున్నా, వారు దాని నాపలేకపోయారు. విరూపాక్ష గుహలోనుండగా నాకూ అట్టి అనుభవం కల్గింది.

భ: నిద్రావస్థను ఆనందస్థితి యన్నారు. కాని దాన్ని స్మరిస్తే పులకరింత రాదు. సమాధిస్థితిని తలపోస్తే అవి ఎందుకు రావాలి?

మ: సమాధియంటే జాగ్రత్ సుషుప్తి (మెలకువతోడి నిద్ర). ఆనందం వ్యక్తిని

ముంచేస్తుంది. ఆ అనుభవం స్పష్టంగా వ్యక్తమయ్యేది. నిద్రలో అలాకాదు. భ: అట్లయితే నిద్రావస్థలోని అనుభవము సుఖమూ కాదు, అసుఖమూ కాదని, 'నేతి, నేతియేగాని 'ఇతి' కాదనవచ్చునా?

మ: కాని, దానిని గుర్తు తెచ్చుకున్నప్పుడు 'నేను సుఖంగా నిద్రించా"నంటాడు మానవుడు. కాబట్టి నిద్రలో ఆనందానుభూతి ఉండితీరాలి.

భ: ఆనందం అంటే దుఃఖం లేకపోవడమేనా లేక స్పష్టంగా ఆనంద అనుభవం ఉంటుందా?

మ: అది స్పష్టమే. దుఃఖం లేకపోవడం, ఆనంద అనుభవం రెండూ ఒకేసారి జరుగుతాయి.

భ: నిద్రలోని సుఖస్మృతి సువ్యక్తం కాదు. కనుకనే రోమాంచము మొదలైనవి లేవనుకోవచ్చునా?

మ: సమాధిలోని ఆనందము సుస్పష్టమైన అనుభూతి. దాని సంస్కృతిగూడ అట్లే ఉంటుంది. కాని నిద్రలోని అనుభూతి దానికి భిన్నము.

# భాషణములు 373

ఆశ్రమంలో శ్రీ భగవాన్కై ఒక స్నానాలగది కొత్తగా కట్టేరు. అక్కడ ప్రొద్దున 9-15 మొదలు 9-30 గంటలవరకు శ్రీ మైసూరు మహారాజావారు శ్రీ భగవాన్తో భాషించారు. శ్రీ భగవాన్ పాదాలపై శిరముంచి నమస్కరించి, వారిట్లన్నారు -

"నేను శ్రీభగవాన్ జీవితాన్ని చదివాను. ఎన్నేండ్లుగానో వారిని చూడవలెనని ఆకాంక్షించాను. కాని నా స్థితిలో, ఇట్టి కోరికలంత సులభంగా నెరవేరేవిగావు. నా కట్టుబాట్లలో నేను, ఇచటి ఇతర శిష్యులవలె ఉండనూ లేను. నేనిక్కడ ఉన్న 15 నిమిషాలలో తమ అనుగ్రహానికై ప్రార్థించటం మాత్రమే నేను చేయగల్గినది." మహారాజావారు పూర్వంలాగే శ్రీభగవాన్కు నమస్కరించి సెలవు తీసుకున్నారు. (వారు ఆశ్రమం వీడక పూర్వం రెండు చక్కని శాలువలూ, కొంత ధనమూ ఆఫీసులో ఉంచి వెళ్ళారు)

# భాషణములు 374

ట్రావెన్కోర్ (తిరువాన్కూర్) మహారాజావారు సాయంత్రం 4-30 నుండి 5-15 గంటలవరకు శ్రీ భగవాన్తో సంభాషించారు.

ప్రొద్దున 8 గంటలకు రైలులో తిరువణ్ణామలై చేరిన తిరువాన్కూరు మహారాజావారు, మహారాణీగారు సాయంత్రం 4-15 గంటలకు గాని ఆశ్రమానికి రాలేదు. శ్రీ భగవాన్ సాధారణంగా కూర్చొనే హాలులోని ఊరిప్రజల నందరినీ వెలుపలికి పంపివేసినారు. పొరపాటున రోజూ హాలులోనికి వచ్చే భక్తులకు గూడ అదే వర్తించింది. వారినీ ఆ సంవాద సమయంలో అక్కడ ఉండనీయలేదు. ఒక రిటైర్డ్ జిల్లా మేజిస్ట్రేటు రాజకుటుంబాన్ని శ్రీభగవాన్కు పరిచయం చేశారు. రాజావారి అంగరక్షకుడు, ప్రైవేట్ సెక్రటరి, తిరువాన్కూరు రాజోద్యోగులు కొందరూ, మైలాపూరు న్యాయవాది ఒక్కరు వచ్చియుండిరి. జిల్లామేజిస్ట్రేటు ఆరంభించిన సంవాదం, మనస్సూ, చిత్తైకాగ్రత, ఆత్మానుభవము, సృష్టి కారణము మొదలైన వానిపై సాగింది. మహారాణీవారు కొన్ని ప్రశ్నలడిగిరి. కొన్ని సంశయాలను వెల్లడించారు. శ్రీ భగవాన్ వాని కన్నింటికీ సమాధానములిచ్చారు. ఈ సంవాదంలో మహారాజావారుగూడ పాల్గొన్నారు. సంభాషణ అంతా తమిళములోనూ మలయాళములోనూ సాగింది.

తిరువాన్కూరు రాజకుటుంబము ఇక్కడనున్న సమయంలో మహారాణీవారు మంచి సంస్కారమున్నవారూగా, సోత్సాహిగా, మలయాళ, తమిళ, ఆంగ్ల భాషల్లో ప్రవీణగా కనబడింది. అడిగిన ప్రశ్నల్లో చాలవరకు మహారాణిగారు వేసినవే. అందులో ఒకటి -

భక్తురాలు: సృష్టి ప్రయోజన మేమి?

మహర్షి: ఈ ప్రశ్న వేయడానికి, దాని సమాధానానికై విచారణ చేసి, చివరకు ఆత్మతో సహా సర్వమునకు అదికారణమైన బ్రహ్మము స్థితిలో నెలకొనడానికి, ఈ విచారణ, ఆత్మవిచారంగా పరిణమిస్తుంది. అనాత్మ విషయాలు వదిలేసి, శుద్ధమూ పరమమూ అయిన ఆత్మస్థితిని ఏర్పడటంతో ముగిసిపోతుంది.

భ: ఈ విచార ప్రారంభమెట్లు?

మ: ఆత్మ ఎల్లరికి పరిచితమే. దాని విచార ప్రారంభంగూడ దానికి సమమే.

భ: నాకున్నపాటి పరిణతదశలో ఏ చోట ప్రారంభించవలె?

మ: ప్రతివానికీ వానివాని ఉపాసన, లేక జపవిధానం, ఉండనే ఉంటుంది. శ్రద్ధగా దానినే పట్టుబట్టి అనుసరిస్తే, అది తానై ఆత్మవిచార దశకు తీసికొని వెడుతుంది.

(ఈ లేఖకుడు పై సంవాద సమయంలో అక్కడ లేడు. విషయము శ్రీ మహర్షి పరిచారికుడునుండి సేకరింపబడింది.)

భాషణములు 375

ఒక కన్నడ వారు అకర్మను గూర్చి తెలియగోరాడు.

మహర్షి: అహంకారము నష్టమైన పిదప, ఏమి చేసినా అది అకర్మ.

## భాషణములు 376

తెలుగువారొకరు, బాగా చదువుకొన్నవారు. శ్రీభగవాన్ స్తుతి నొకటి రచించి హాలులో పాడి వినిపించారు. దాన్ని భగవాన్ పాదాలవద్ద ఉంచి, నమస్కరించారు. కొంతసేపాగి, ఏదేని ఉపదేశమిమ్మని భగవాను నర్థించారు.

మహర్షి: ఉపదేశం 'ఉపదేశసారం'లో ఉన్నదే.

భక్తుడు: వాచా, స్వయంగా ఇచ్చే ఉపదేశం విలువ ఎక్కువ.

మ: ఏమైనా క్రొత్తది, అంతకు మునుపు తెలియనిదీ ఉంటే, ఉపదేశం ఇచ్చినా అర్థం ఉంటుంది. ఇక్కడ ఉన్నది మనస్సును నిశ్చలంగా నుంచటం. ఆలోచనలు లేకుండా ఉండటం, అంతే.

భ: అది అసాధ్య మనిపిస్తున్నది.

మ: కాని అదే ఎల్లరికీ నిత్యమూ, అతి పురాణమూ అయిన స్థితి.

భ: రోజు జరిపే కార్యకలాపాల్లో అది కనబడదు కదా!

మ: దైనందిన జీవితం, నిజస్థితికి దూరంగాదు. అదీ ఆధ్యాత్మిక జీవితమూ వేర్వేరనుకున్నంతవరకూ, ఈ చిక్కులుంటాయి. ఆధ్యాత్మిక జీవనం సరిగా అర్థం అయితే కార్యప్రవృత్త జీవితం దానికి భిన్నం కాదని తెలుస్తుంది.

మనస్సు నొక వస్తువుగా భావించి మనస్సుతో దానికై వెదకితే అది దొరకుతుందా? మానసిక వృత్తుల మూలాన్ని వెదకి పొందాలి. అదీ సత్యం. ఆలోచనల సందడిలో ఆత్మను తెలియరాదు. ఆలోచనలు అణగిన తర్వాతే ఆత్మ గోచరిస్తుంది.

భ: లక్షలలో ఒకరే ఈ సాధనలను పూర్తిచేసేది.
(గీత, 7-3), (మనుష్యాణాం, సహస్రేషు, కశ్చిద్యతతి సిద్ధయే.)

మ: 'యతో యతో నిశ్చరతి, మనశ్చంచలమస్థిరమ్।
తతో తతో నియమ్యైతత్, ఆత్మన్యేవ వశం నయేత్??' (గీత, 6-26)

మనస్సు చంచలం, స్థిరంగానిది. అది బహిర్విషయములపై ప్రసరించినపుడెల్లు దానిని మరల్చి ఆత్మయందే నిలుపవలెను. “మనసా మన అలోక్య" (మనస్సుతో మనస్సును చూచి) అని ఉపనిషత్తులు చెప్తున్నాయి.

భ: మనస్సు ఉపాధియా?

మ: అవును.

భ: దృశ్యజగత్తు సత్యమా?

మః ద్రష్ట యేపాటి నిజమో, దృశ్యమూ అంతే నిజం. ద్రష్ట, దృక్, దృశ్యం ఇవి త్రిపుటి. వీని మూడింటికి అవతల సత్యమొకటుంది. ఈ మూడు కనబడతాయి. మాయమౌతాయి. సత్యమొక్కటే నిత్యం.

భ: ఈ త్రిపుటి సంభవాలు తాత్కాలికాలేనా?

మ: అవును. లోకవ్యవహారంగూడ. ఆత్మను జుచేవానికి ఇవి లేనట్లే. ఆత్మ కవి అభిన్నంగా కనిపిస్తాయి. (ఆత్మ నుండి అవి భిన్నం కావు) లోక వ్యవహారంతో పాటు అవీ సాగిపోతూనే ఉంటాయి.

## భాషణములు 377

ఒక నడివయసు ఆంధ్రుడు - "మానవుని దివ్యుడంటారు. అయితే వానికి

శోకాలు పశ్చాత్తాపాలు ఎందుకు కలుగుతాయి? మహర్షి: దివ్యత్వం నిజస్వరూపానికి, పశ్చాత్తాపం మొదలైనవి ప్రకృతికి.

భక్తుడు: పశ్చాత్తాపం దాటడం ఎలా?

మ: తనలో ఉన్న దివ్యత్వాన్ని అనుభవ సిద్ధం చేసుకోవడం ద్వారా.

భ: అది ఎలా?

మ: అభ్యాసం వల్ల.

భ: ఎటువంటి అభ్యాసం?

మ: ధ్యానం.

భ: ధ్యానించేప్పుడు మనస్సు స్థిరంగా నుండదు.

మ: అభ్యాసము చేస్తే అదే సరియౌతుంది.

భ: మనస్సును స్థిరం చేసే దెలాగ?

మ: దానికి దారుఢ్యం చేకూర్చడం ద్వారా.

భ: అదెలా?

మ: సత్సంగం వల్ల.

భ: ప్రార్ధనలూ అవీ దానికి కలపాలా?

మ: అవును.

భ: ఏ తాపాదులు లేనివారి విషయం ఏమి?

మ: వారు యోగసిద్ధులు, వారిని గూర్చి ప్రశ్నయే లేదు.

భ: దేవుడు లేదనటానికి భూకంపాలు, కరువులూ లాంటి అత్యయికాలను ఉదాహరిస్తారు. వారి వాదాన్నెదిర్చే దెలాగ?

మ: ఆ వాదించే వారెక్కడినుంచి వచ్చారు?

భః ప్రకృతినుంచి అంటారు.

మ: కొందరి కది ప్రకృతి, ఇతరులకు దైవం.

భ: అక్కరకు వస్తుందని ఆస్తి ఏమన్నా కూడబెట్టాలా, లేక ఆధ్యాత్మికోన్నతికని జీవితాన్ని కష్టస్థితిలోనే గడపాలా?

మ: భగవంతుడే అన్నీ చూసుకొనేది.

## భాషణములు 378

ఆంధ్రులొకరితో భాషిస్తూ శ్రీభగవాన్ ఈ క్రింది శ్లోకాల నుదాహరించారు

అసంశయం మహాబాహో! మనోదుర్నిగ్రహంచలమ్.<br>అభ్యాసేనకు కౌంతేయ! వైరాగ్యేనచ గృహ్యతే॥<br>(గీత 6 - 35)

మనస్సు చంచలం; దాన్ని నిగ్రహించడం చాల కష్టం. ఇందు సందేహమే లేదు. అయినా సాధనవల్ల, వైరాగ్యం వల్ల దాన్ని వశపరచుకోవచ్చు. వైరాగ్యం గురించి చెప్తూ భగవాన్ ఇలా చెప్పారు:

"సంకల్ప ప్రభవాన్ కామాన్, త్యక్త్వా సర్వానశేషతః మనసైవేంద్రియగ్రామం వినియమ్య సమం తతః" (గీత 6-24) మనస్సు చేత ఇంద్రియములను వానివాని విషయములనుండి మరల్చి, సంకల్పమువలన పుట్టు కోరికలను నిశ్శేషముగా వర్జించి…

అభ్యాసవిధి:

"శనైశ్శనై రుపరమేత్ బుద్ధ్యా ధృతి గృహీతయా! ఆత్మసంస్థం మనః కృత్వా నకించదపి చింతయేత్" (గీత 6-25)

చిక్కబట్టిన బుద్ధిచేత మనస్సును మెల్లమెల్లగ వాసనలనుండి విరమింపచేసి, ఆత్మయందు నిల్పి వేరే చింతన లేకుండవలయును.

జ్ఞానము:
యతో యతో నిశ్చరతి మనశ్చంచల మస్థిరమ్
తతస్తతో నియమ్యైతత్, ఆత్మన్యేవ వశంనయేత్॥ (గీత 6-26)

మనస్సు చంచలము, స్థిరం కానిది. అది బహిర్విషయములపై ప్రసరించినపుడెల్ల దానిని మరల్చి ఆత్మయందే నిలుపవలెను.

## భాషణములు 379

తిరుమల్పాడ్, మలయాళీ, నీలాంబూర్ నివాసి, ఆత్మవిద్యను వివరింపుడని భగవాన్ను అడిగెను.

ఆత్మవిద్యలో 5 పద్యములను శ్రీ భగవాన్ ఇలా వివరించారు. చిదంబరం ప్రసిద్ధి యాత్రాక్షేతం, అచటి నందనార్ సుప్రసిద్ధుడే. అతడు ఆత్మవిద్య నెరుగుట చాలా కష్టమని పాడాడు. శ్రీ భగవాన్ యొద్ద చిరంతన భక్తుడు మురుగనార్ ఆత్మవిద్య అతి సులభమని వ్రాయనారంభించినారు. “అయ్యే అతి సులభం" అన్నది దాని పల్లవి. ఇది చాలా విడ్డూరమైన కథనం. కాని తానే ఆత్మ గనుక అల్పునికి గూడ అది నిత్యపరిచితమే. నందనారు వాక్యం, తరువాతి మురుగనార్ వాదం సరిపడవు. ఆత్మ సకలానికి ఆధారమై, సువ్యక్తమే అయితే దాన్ని తిరిగిపొందే మాటరాదు. అందుచేత ఆపై అడుగుసాగక మురుగనార్ తాను వ్రాసిన నాల్గు పంక్తులనూ శ్రీ భగవాన్ ముందుంచి పూరింపుడని కోరారు.

శిష్యుని వాదం సరియని ఒప్పుకొంటూ శ్రీభగవాన్ ఆత్మ అంత సుస్పష్టమే అయినా ఏల దాగియున్నదీ వివరించారు. ఈ పొరపాటుకు కారణం ఆత్మను శరీరం మొదలైన వాటితో తప్పుగా తాదాత్మ్యం చేయడం వలన.

భక్తుడు: ఈ మిథ్యా తాదాత్మ్యం ఎలా తటస్థించింది?

మహర్షి: ఆలోచనలవల్ల వానిని తుదముట్టిస్తే, సత్యాత్మ తానై వెలుగొందుతుంది.

భ: ఆలోచనలను అంతమొందించే దెట్లు?

మ: దాని ఆధారమేదో వెదకు. అన్నీ “నేను” అనే ఆలోచనా సూత్రంతో గ్రుచ్చియున్నవి. దాన్ని త్రెంచివేయి. అన్నీ జారిపోతాయి. ఆత్మగాక ఇతరమన్నీ తెలిసి ప్రయోజనమేమి? ఆత్మ తెలిస్తే మిగతవన్నీ తెలిసినట్లే. అందువల్లనే ఆత్మసాధనం, మానవునికి ప్రప్రధానమూ, ఏకైకమూ అయిన విధి.

భ: "నేను" ఆలోచనను అణిచేదెలాగ?

మ: దాని మూలాన్ని వెదకితే అది ఇంకపై రాదు. అలాగే అణిగిపోతుంది.

భ: ఏ విధంగా ఎక్కడ దాన్ని కనుగొనడం?

మ: నిజానికి చైతన్యం కారణంగానే, జనులు వేర్వేరు రీతుల వర్తిస్తున్నారు. ఆత్మ శుద్ధచైతన్యం. ఆత్మను తెలుసుకోవడానికి చేయవలసిందంతా 'నిశ్చలంగా ఉండటమే.'

భ: అంతకన్నా సులభతరమింకే ముంటుంది?

మ: అందుకే ఆత్మవిద్య అతి సులభం.

## భాషణములు 380

ఒక యూరోపియన్ శ్రీ భగవాన్ను అడిగాడు - "ఎవరన్నా మీరెవరని మిమ్మల్ని అడిగితే ఏమంటారు?".

మహర్షి: నిన్నే నీవు 'నేనెవరని అడిగిచూడు.

భక్తుడు: మీరది ఎట్లు కనుగొన్నారో దయచేసి తెలుపండి. అది తెలియడం అసాధ్యంగా నా కనిపిస్తుంది. ('నేను' అనేది ప్రాణశక్తుల ఫలితం. ఆ విచారం మౌనంలోకి దించుతుంది. గురువులవారు దానినెట్లు చూస్తారో తెలుసుకోవాలని నా కోరిక)

మ: దాన్ని తర్కంవల్లనే తెలిసికోవాలా? భౌతిక శాస్త్రసిద్ధాంతం కేవలం విజ్ఞానదృష్టి ఫలమే.

భ: జె.సి. బోసు పురుగుకూ మనిషికీ ప్రకృతి యేభేదమూ చూడదంటారు.

మ: ప్రకృతియంటే ఏమి?

భ: ఏది ఉన్నదో అది

మ: “ఉండుట” అనే దాన్ని నువ్వు ఎలా తెలుసుకొంటావు?

భ: నా ఇంద్రియాలవల్ల.

మ: 'నా'లో 'నీ' ఉనికి ఇమిడి ఉంది. కాని నీవు మరొకరి ఉనికిని గూర్చి భాషిస్తున్నావు. 'నా ఇంద్రియా'లని నీవనడానికి 'నీవు' ఉండవలెగదా? 'నేను' లేక 'నా' ఉంటుందా?

భ: నేను అల్పజ్ఞుణ్ణి. సద్గురువులయిన మిమ్మల్ని అడిగి ఈ జీవితం (ఉనికి) అంటే ఏమిటో తెలుసుకొందామని వచ్చాను. 'జీవితము' అనే పదానికే వైశిష్ట్యమూ లేదు. భగవంతుడున్నాడు, నే నున్నాను, ఇతరులూ ఉన్నారు. అంత మాత్రాన ఏంటి?

మ: ఎవరి ఉనికి ప్రస్తావించినా, నీ ఉనికిని అంగీకరించినట్లే. 'ఉండటం' నీ స్వభావం.

భ: ఉండటంలో వింత ఏముంది?

మ: దేని ఉనికి అయినా నీకు ఎలా తెలిసింది, నీ ఉనికి తెలియకుండా.

భ: ఎవరి ఉనికిలోగాని క్రొత్త ఏముంది? మీ గ్రంథం చదివితే అందులో స్పష్టంగా ఒకే విషయం ప్రతివాడూ తన్ను తానడుగవలసిన ఒకే ఒక ప్రశ్న. 'నే నెవరు?' అని. 'మీ రెవరో' తెలుపవలెనని నా కోర్కె నా సమాధానము నాకున్నదనుకోండి. మరొకరూ, అట్లే వేలకొలది జనులూ అదే చెప్పితే, 'ఆత్మ' ఉండటం సంభావ్యమే. నా ప్రశ్నకు సూటిగా సమాధానం కావాలి. మాటల ఇంద్రజాలం కాదు.

మ: ఈ విధంగా నీవు సంభావ్యాల దశకు (probabilities) వచ్చావన్న మాట.

భ: అవును. నిశ్చితంగా ఏదీ లేదు. దైవసత్యం గూడ పరమ ప్రామాణికంగా నిరూపింప శక్యంగాదు.

మ: ప్రస్తుతానికి దైవం మాట అటుంచు. నీ సంగతి ఏమి?

భ: ఆత్మ ఉనికిని దృఢీకరించుకో గోరుతున్నాను.

మ: నీవు ప్రమాణంలో గోరుతున్నది ఇతరులనుండి. అంటే నీవున్నదీ లేనిదీ తేల్చవలసింది ఇతరులన్న మాట. ప్రతివానినీ నీవు 'నీవు' అని పిలిచినా, వానికి వాడు 'నేనే'. ప్రమాణం 'నేనే'. 'నీవు' అనేదే లేదు. అందరూ ఆ 'నేను'లోనివారే. ఇతరులనే మాట పుట్టడం 'నేను' నిరూపించిన తర్వాతే. తాను లేక ఇతరులు లేరు.

భ: ఇందులో మాత్రం క్రొత్త ఏముంది? నేను సి.వి.రామన్ వద్ద ఉండగా వారి కాంతి స్వరూప సిద్ధాంతంతో వాసన స్వరూపాన్ని గూడ నిరూపించ వచ్చని వారన్నారు. వానిని ఇకపైన రసాయన శాస్త్రము (కెమిస్ట్రి) సాయంతోనే వివరింపనక్కరలేదు. ఇందు క్రొత్త ఉంది, వృద్ధిక్రమం ఉంది. ఇంతవరకూ నేను వింటున్నవానిలో కొత్తదనం ఏమిలేదనటంలో నా భావమది.

మ: 'నేను'లో కొత్త ఏమీ లేదు. అది ఎప్పుడూ సమానమే.

భ: అయితే వృద్ధియే లేదంటారా?

మ: వృద్ధి అనేది బహిఃప్రవృత్తమైన మనస్సుకు గోచరించేది. మనస్సు అంతర్ముఖమై, ఆత్మనన్వేషిస్తున్నప్పుడు, సర్వమూ నిశ్చలం.

భ: భౌతిక శాస్త్రాల గతియేమి?

మ: అవన్నీ ఆత్మలో అణగిపోయేవే. వాని చరమము ఆత్మలోనే. సాయంత్రం 5 గంటలయింది. శ్రీ భగవాన్ కాలకృత్యాలకై హాలువీడి వెళ్ళారు. ఆ యూరోపియన్ రైల్వే స్టేషన్కు వెళ్ళిపోయాడు.

## భాషణములు 381

బెంగాలీ ఇంజనీర్ బోస్ 'ఆత్మవిద్య'లోని ఆఖరి పద్యానికర్థం అడిగాడు.

మహర్షి: జగత్తు కనిపిస్తుంది. అది కనుపించి నట్లుంటుంది గాని అది నిజంగాదు. అది ఉండటానికి ఒకచోటు, ఉనికీ, వెలుగు కావాలి. మనస్సు లేచినదే తడవుగ దానికా ఉనికీ వెల్తురూ కనవస్తాయి. అంటే, భౌతిక స్థితీ ప్రకాశమూ రెండూ మనస్సుయొక్క స్థితి ప్రకాశములలోని అంశాలే. మనస్సు పొంగుతూ క్రుంగుతూ ఉంటుంది గనుక అవి శాశ్వతములు కావు. మనస్సుకు ఆధారము ఆత్మ. అది స్వతస్సిద్ధము. అదీ, దాని ఉనికీ స్వయం ప్రకాశాలు, సువ్యక్తాలు. అది జాగ్రత్ స్వప్న సుషుప్తి అవస్థలు మూడింటిలో ఎప్పుడూ ఉన్న పరమాత్మయే.

జగత్తులో నానాత్వముంది. ఇది మనఃకల్పితము. మనస్సు, స్వయంప్రకాశకమైన - ఆత్మకాంతిలో ప్రతిఫలించే ఆభాసకాంతి. సినిమాలో బొమ్మలు తెరపై కాంతి ఎక్కువగా ఉంటే కనుపించవు. దట్టపు చీకటియైనా కనుపించవు. తెరపై బడే ప్రకాశము పరచుకొని ఉండాలి. ఆత్మనుండి వెలువడే కాంతి ప్రతిబింబించి, అజ్ఞాన అంధకారంగుండా ప్రసరించి, అంతటా వెదజల్లే కాంతిలో ఈ జగచ్చిత్రాలు కనబడతాయి. నిద్రలోవలె, చిక్కటి చీకటిలోగాని, ఆత్మజ్ఞానంలోని విశుద్ధ తేజస్సులో గాని ప్రపంచమగుపించదు. అవిద్యయే నానాత్వానికి కారణం. ఇదేదో తర్కపరంగా మాత్రమే అర్థమయిందన్నాడు. ఆ ఇంజనీరు.

మహర్షి: నీవీ జాగ్రదవస్థలో ఈ విషయచర్చలో బుద్ధివలలో చిక్కుకొన్నావు గనుక.

ఆ తరువాత శ్రీభగవానన్నారు, ఆత్మసిద్ధికి అనుగ్రహం కావలెనని. అనుగ్రహం లభించేవిధం తెలుపమన్నాడు ఇంజనీరు.

మహర్షి: అనుగ్రహమంటే ఆత్మ. అవిద్య వ్యాపించియుండడం వలన అది గోచరించడం లేదు. శ్రద్ధ ఉంటే అది వ్యక్తమౌతుంది.

శ్రద్ధ, అనుగ్రహము, కాంతి, దైవము అన్నీ ఆత్మకు పర్యాయపదాలు.

## భాషణములు 382

ఆంధ్రులొకరు ప్రసన్నదృష్టి, తత్త్వశాస్త్ర మెరిగినాయన, శ్రీ భగవానునున్ను మనోలయమును వివరింపవేడిరి.

ఆయన చేతిలో 'ఉపదేశసారమున్నది శ్రీ భగవాన్ అదంతా ఆ పుస్తకంలో ఉందే అన్నారు.

భక్తుడు: మనస్సంటే ఏమి?

మహర్షి: అదేమో చూడు.

భ: అది సంకల్ప వికల్పాత్మకము (ఆలోచనలు, వాని మార్పులతో కూడినది).

మ: ఎవరి సంకల్పం?

భ: సంకల్పం మనస్సు స్వభావము.

మ: సంకల్పం ఏ విషయాన్ని గూర్చి?

భ: బహిర్విషయముల గురించి.

మ: నిజమే. కాని అది నీ స్వభావమా?

భ: అది మన స్వభావము.

మ: నీ స్వభావమేమి?

భః శుద్ధచైతన్యము.

మ: మరి సంకల్పంతో, ఇతరాలతో నీవెందుకు ఇబ్బంది పడుతున్నావు?

భ: మనస్సు చంచలమూ, అస్థిరమూ కదా?

మ: అట్లున్న చోటనే, దాని నంతర్ముఖం చేసి ఆత్మలో ముంచుమని గూడ ఉంది. ఆ అభ్యాసం అతి మందగతి గనుక చాలకాలం పడుతుంది. అందువల్ల ఆత్మలో పూర్ణంగా మగ్నుడవైనంతదాక, అభ్యాసాన్ని కొనసాగించాల్సిందే.

భ: నన్ననుగ్రహించండి.

మ: అది ఎప్పుడూ నీతోనే ఉంది. నీవు చేయవలసిందొకటే. బహిర్ముఖమైన మనస్సుతో సామ్యం మాని, ఆత్మస్థితియందే ఉండు. అదే ప్రసాదము. (అనుగ్రహము) ఆయన శ్రీ భగవాను నమస్కరించి వెళ్ళిపోయారు.

# భాషణములు 383

ఒక సన్న్యాసి, స్వామి లోకేశానంద, శ్రీ భగవాన్ను ప్రశ్నించారు.

భక్తుడు: జీవన్ముక్తునికి ప్రారబ్ధముందా?

మహర్షి: ఆ ప్రశ్నించే దెవరు? ఎవని నుండి ఈ ప్రశ్న? అడిగేది జీవన్ముక్తుడేనా?

భ: నేనింకా ముక్తుడను కాను.

మ: అట్లైతే జీవన్ముక్తుణ్ణి ఆ ప్రశ్న నడుగనీయరాదా?

భ: సంశయం నాకు గదా?

మ: నిజమే. సంశయాలు అజ్ఞానికి, జ్ఞానికి గావు.

భ: క్రొత్తవేవీ లేవనే సిద్ధాంతం (అజాతవాదము) రీత్య భగవాన్ వాదాలు సరిగానే ఉన్నాయి. కాని అవి ఇతర సిద్ధాంతాల వారు ఒప్పుకొంటారా?

మ: అద్వైతవాదంలోనూ మూడు పద్ధతులున్నాయి

1. అజాతవాదము: నష్టము లేదు. సృష్టి లేదు; బద్ధుడూ లేదు, సాధకుడు లేడు; ముముక్షువూ లేడు, ముక్తి లేదు. ఇది పరమ సత్యము. (మాండూక్య కారికలు (2-32) దీని ప్రకారం ఉన్నది ఏకము, ఇక్కడ తర్కానికి తావులేదు.

2. దృష్టి సృష్టివాదము: ఏకకాలీన సృష్టి. ఇద్దరు మిత్రులు ప్రక్కప్రక్కగా నిద్రిస్తున్నారు. ఒకరు తాను మిత్రునితో గూడ కాశీ వెళ్ళి తిరిగి వచ్చినట్లు కలగన్నాడు. వాడు మిత్రునితో తామిర్వురూ కాశికి వెళ్ళామన్నాడు. వట్టి అబద్ధమన్నాడు మిత్రుడు. పోయానన్నది ఆ కలగన్న వానిదృష్ట్యా నిజమే; పోలేదన్నది ఆ రెండవవాని దృష్ట్యా నిజమే.

3. సృష్టి దృష్టి వాదము: క్రమసృష్టి, దాని నెరుగుట కూడ అట్లే. కర్మ మూడు విధాలు, ప్రారబ్దము, ఆగామి, సంచితము, కర్మకు, కర్తా, కర్తృత్వము లుండాలి. కర్మ జడము అందువలన దేహానికి గాదు. అది దేహాత్మ బుద్ధియున్న వరకే. దేహాత్మ బుద్ధిని దాటితే అతడు జ్ఞాని. దేహాత్మబుద్ధి లేనప్పుడు, కర్తృత్వమూ లేదు, కర్తాలేడు. అందుచేత జ్ఞానికి కర్మ ఉండదు. అతని అనుభవ మట్టిది కాకపోతే అతడు జ్ఞానియే కాడు. కాని అజ్ఞాని జ్ఞానిని అతని దేహసమంగా చూస్తాడు. జ్ఞాని అట్లు చేయడు. జ్ఞాని ఏపైనా క్రియ లాచరిస్తుంటే, చూసిన అజ్ఞాని, జ్ఞానిని ప్రారబ్ధము బాధించదా అని ప్రశ్నిస్తాడు.

సర్వకర్మలనూ దహించివేసే అగ్నిగా జ్ఞానాన్ని శ్రుతులు వర్ణిస్తాయి. "సర్వం" -- అన్నీ అన్న మాటకు రెండు విధాలుగా అర్థం చెపుతారు 1. ప్రారబ్ధంతో సహా అని, 2. ప్రారబ్ధం మినహా అని.

మొదటిదాని ప్రకారము -- ఒకనికి ముగ్గురు భార్యలు. వాడు చనిపోతే వారిలో ఇర్వురే విధవలై, మూడవది కాకపోతుందా? అలాగే ప్రారబ్ధ అగామి సంచితాలకూ వర్తిస్తుంది. కర్త లేనప్పుడవి ఉండ వీలు లేదని వారి వాదము.

రెండవ అర్థము సాధకుని తృప్తికై మాత్రమే. ప్రారబ్ధాన్ని మాత్రం వదలి మిగత కర్మలన్నీ దహింపబడు నన్నారు. తాను జన్మించిన ప్రయోజనం పూర్తి కావటానికి దేహం తన కర్మ తాను చేస్తూనే ఉంటుంది. ప్రారబ్ధం అంటే అది. అయితే జ్ఞాని దృష్ట్యా ఆత్మ యొక్కటే బహురూపాల్లో భాసిస్తుంది. ఆత్మకు వేరుగా దేహం లేదు, కర్మ లేదు, కర్మలవల్ల బాధితం కావటం లేదు.

భ: జ్ఞానికి దేహాత్మబుద్ధి కలుగదా? ఉదాహరణకు శ్రీభగవాన్నే ఏదో పురుగు కుట్టిందనుకుంటాం. వారికి ఆ చైతన్యమే ఉండదా?

మ: ఆ చేతనా ఉంది. దేహాత్మ బుద్ధి వుంది, ఈ రెండవది జ్ఞానికి, అజ్ఞానికి గూడ సమమే. భేద మెక్కడంటే, అజ్ఞాని "దేహైవ ఆత్మ" (దేహము మాత్రమే ఆత్మ) అనుకుంటాడు. జ్ఞాని 'ఆత్మమయం సర్వం' -- ఇవన్నీ ఆత్మతో నిండి వున్నాయి. "సర్వం ఖల్విదం బ్రహ్మ" ఇదంతా బ్రహ్మమే, అని తెలిసి ఉంటాడు. నొప్పియుంటే ఉండనీ. అదీ ఆత్మలో అంశమే. ఆత్మపూర్ణము.

ఇక జ్ఞాని చేసే కర్మల విషయం. వాటిని ఊరికే కర్మలు అనడం తప్ప అవి నిజంగా బంధ కారణాలు కావు. సాధారణంగా కర్మలు వ్యక్తిలో సంస్కారాలుగా స్థిరమౌతాయి. అది గూడ, అజ్ఞానిలోవలె, మనస్సు సంస్కారాలను మొలకెత్తించే విధంగా సారవంతంగా ఉన్నంత వరకే. జ్ఞానిలో మనస్సును ఊహించాల్సి వస్తుంది. అతడప్పటికే మనస్సు నధిగమించి ఉంటాడు కనుక. అజ్ఞానిలోవలె వాని మనస్సు ఫలప్రదము కాకపోయినా, అతనికీ మనస్సున్నదని ఊహించాలి. అందుచేత జ్ఞాని మనస్సును బ్రహ్మమన్నారు. నిజానికి బ్రహ్మము, జ్ఞాని మనస్సుకు పేరుగాదు. ఆ భూమిలో వాసనలు ఫలించవు. అతని మనస్సు వాసనలు లేని బంజరు భూమి.

అయినా జ్ఞానికి ప్రారబ్ధం ఉంది అంటున్నాం కనుక. దానితో బాటు వాసనలూ ఉన్నవనుకోవలె. ఉంటే, అవి భోగహేతువులే. అంటే కర్మ ఫలాలు రెండు విధాలు. 1. అనుభవానికి మాత్రానికే, 2. మనస్సులో సంస్కారరూప ముద్రలు వేయడానికి. వాని లక్షణాలు తరువాతి జన్మలలో గాని గోచరించవు. - జ్ఞాని మనస్సు ఊసరక్షేత్రం. కనుక కర్మబీజాలు అక్కడ మొలకెత్తవు. అతని వాసనలు అనుభవంతో పోయేవే, అవి భోగహేతుక కర్మలే. నిజానికి అతనికి కర్మలు అజ్ఞాని దృష్టిలోనే గాని, అతడు మాత్రం నిష్క్రియుడుగానే ఉండిపోతాడు. అతడు ఆత్మకు భిన్నంగా తనకొక దేహాన్ని భావించడు. అతనికి బంధమేమి, ముక్తియేమి? అతడు ఆ రెంటికి అధిగమించి ఉంటాడు. ఇప్పుడు గాని మరెప్పుడు గాని అతన్ని కర్మ బంధించదు. అతని దృష్ట్యా జీవన్ముక్తుడూ లేడు, విదేహముక్తుడూ లేడు.

భ: ఇదంతా వింటుంటే అనిపిస్తుంది. తన వాసనలన్నీ కాల్చివేసిన జ్ఞాని ఉత్తమోత్తముడు. అతడొక రాయిలాగా, స్థాణువుగా, నిష్క్రియుడై ఉండిపోతాడు. మ: కాదు, అతడట్లే ఉండనక్కరలేదు. వాసనలు వానిని బాధించవు. శిలగా, స్థాణువుగా ఉండటం మాత్ర మొక వాసనయే గదా? వానిది సహజస్థితి.

## భాషణములు 384

తర్వాత సంవాదం వాసనల వైపుకు వెళ్ళింది. శ్రీ భగవాన్ అన్నారు -- సద్వాసనలకు, దుష్టవాసనలు ఏక కాలికములు, సహగాములు. ఒకటి లేక రెండవది ఉండలేదు. అందొకటి ఎక్కువ ఉండవచ్చు. సద్వాసనలను పెంపొందించుకోవాలి కానీ, అవీ చివరకు జ్ఞానంవల్ల నష్టము కావాల్సిందే. ఎవరో ఒక కుర్రవాడు అద్భుత ప్రజ్ఞాశాలియని వర్ణించారు. వాని పూర్వజన్మ సంస్కారాలు చాల బలవత్తరాలు, అన్నారు శ్రీ భగవాన్.

భక్తుడు: అవి ప్రసిద్ధ యోగీంద్రప్రవచనాలను చెప్పే విధంగా ఎలా వచ్చాయి? వాసన బీజరూపంగా ఉందా?

మహర్షి: అవును, సంస్కారం ఇంతకు ముందు నేర్చుకొన్న విద్య, మూలధనంగా ఉంచుకొన్నది. పరిస్థితు లనుకూలించినప్పుడు అది ప్రకటమౌతుంది. మంచి సంస్కారం లేని, కాక దుర్బల సంస్కారం కలవారికన్నా, బలవత్తర సంస్కారం గలవానికి ఏదైనా సులభంగా సత్వరంగా అర్థమవుతుంది.

భ: అవి సాంకేతిక నిర్మాణ కుశలురకు (Inventors) గూడ వర్తిస్తుందా?

మ: ఈ ప్రపంచంలో కొత్తది ఏదీ లేదు. మన మీరోజుల్లో ఏదో క్రొత్తగా కనిపెట్టామని, నిర్మించామని చెప్పుకోనేవి ఆయా అంశాల్లో దృఢ సంస్కారాలు గల దక్షులు తిరిగి కనిపెట్టినవే.

భ: న్యూటన్, ఐన్‌స్టీన్ మొదలైనవారు కూడా ఆ కోవకు చెందినవారేనా?

మ: అవును. తప్పక. కాని, సంస్కారా లెంతబలీయమైనా, స్థిర శాంత మనస్సులలోనే ఆవిష్కరిస్తాయి. మనందరి అనుభవంలో మాటే. ఒక్కొప్పుడు ఏదో జ్ఞప్తికి దెచ్చుకోడానికై తలక్రిందులు పడ్డా లాభముండదు. కాని ఊరకే శాంతంగా, ఏ గొడవాలేక కూర్చొని ఉండగా తటాలున, మెరుపులాగా ఆ యోచనవస్తుంది. మరచిన వానినే జ్ఞప్తికి దెచ్చుకోవటానికి మనస్సు కలతలేనిదిగా ఉండాలి. అద్భుత, అలౌకిక ప్రజ్ఞాశాలురంటామే వారు పూర్వపు పుట్టువుల్లో గట్టిగా అధ్యయనం చేసి, గడించిన విజ్ఞానాన్ని సంస్కార రూపంలో మూలధనంగా దాచియుంచుకున్నవాళ్ళే. అట్టివారిప్పుడు తామెన్ను కొన్న విషయాల్లో మగ్నమయ్యేవరకు మనస్సును కేంద్రీకరిస్తారు. ఆ నిశ్చలతలో అడగియుండిన భావాలు మెరుపులాగా గోచరిస్తాయి. దానికిగూడ పరిస్థితులు అనుకూలంగా ఉండాలి.

## భాషణములు 385

శ్రీ వెంకటరావు ఆంధ్రులు. వీరితో భాషిస్తూ భగవానన్నారు: ఎవరికైనా జ్ఞానం వచ్చేదాకా, జ్ఞాని స్థితి అర్థం కాదు. ఈశ్వరుని పనుల గురించి మిగిలిన విషయాల గురించి ప్రశ్నించి లాభం లేదు. శివుడు దారుకావనంలో దిగంబరుడుగా వెళ్ళి ఋషిపత్నుల శీలం చెరిచాడెందుకని, కొందరి ప్రశ్న. ఈ ఘటనను స్పృశించిన పురాణాలే, పాలసముద్రం చిలుకుతుండగా వెడలిన హాలాహలం త్రాగి శివుడా దేవతలను, విశ్వాన్ని రక్షించినాడన్నవి. ఘోరకాకోల విషం త్రాగి విశ్వాన్ని రక్షించినవాడు, ఋషులకు మోక్షాన్నిచ్చినవాడు వారి పత్నుల మధ్య నగ్నుడుగా చరించాడు. సామాన్య బుద్ధుల కివి అవగాహన అయ్యేవి కావు. జ్ఞానిని గాని ఈశ్వరునిగాని తెలిసికోవడానికి, మరో జ్ఞానికి గాని ఈశ్వరునికేగాని సాధ్యం.

భక్తుడు: జ్ఞాని ఆచరణల చూచి వాని ననుకరించటం కూడదా?

మహర్షి: అందువల్ల ప్రయోజనమేమీ లేదు. వాసనలు నాల్గు విధాలున్నవి:

శుద్ధములు. 2. మలినములు 3. మధ్యమములు (మిశ్రములు) 4. మంచివి. ఇవి వరుసగా జ్ఞాన వరిష్ఠులకు, వరీయులకు, వరులకు, వేత్తలకు చెందుతాయి. వీటి ఫలితాలను మూడు విధాలుగా పొందుతారు

1. స్వంత ఇచ్ఛలో (స్వేచ్ఛగా) 2. ఇతరుల ఇచ్ఛతో (పరేచ్ఛతో) 3. అసంకల్పితంగా (అనిచ్ఛతో). గౌతముడు, వ్యాసుడు, శుకుడు, మరియు జనకుడులాంటి జ్ఞానులు ఉండిరి.

భ: వ్యాసుడు కూడా జ్ఞానియేనా?

మ: అవును, నిస్సంశయంగా.

భ: అయితే ఆ జలకాలాడుతున్న దేవతలు శుకుడు అటువెళ్ళి నప్పుడు ఊరుకొని వ్యాసుణ్ణి చూడగానే వలువలెందుకు ధరించారు?

మ: ఆ వ్యాసుడే శుకుణ్ణి ఉపదేశానికై జనకుని యొద్దకు పంపారు. జనకుని పరీక్షల్లో తేరి, శుకుడు వ్యాసులెంత గొప్పవారో తెలిసికొన్నాడు.

భ: జ్ఞానము, ఆరూఢము అంటే ఒకటేనా?

మ: అవును, ఒకటే.

భ: భక్తిజ్ఞానాల సంబంధమేమి?

మ: నిత్యము, నిరంతరము, సహజము అయినది జ్ఞానం. అది ఆత్మయందలి ప్రేమను సూచించుట లేదా? అది భక్తి కాదా?

భ: విగ్రహారాధన మంచిదిగా అనిపించడం లేదు. రూపంలేని దైవాన్ని ఇస్లాంలో ఆరాధిస్తారు.

మ: వాళ్ళ ప్రకారం దైవమంటే ఏమిటి?

భ: అంతర్యామి, ఇత్యాది.

మ: అట్లే అయితేకూడా, ఆ దైవానికి గుణాలు లేవా? సరే ఆకారం, ఒకరకమైన గుణం. ఏవో కొన్ని ఊహలు లేదా భావాలు లేకుండా భగవంతునారాధించ వీలుగాదు. భావన ఎట్టిదైనా, దైవాన్ని సగుణుని చేయక తప్పదు. అదీగాక, దైవమునకు రూపున్నదా లేదా అనే చర్చలవల్ల ఫలమేమి? నీకు ఆకారమున్నదో లేదో చూడు. అప్పుడు దైవమేమో బోధపడుతుంది.

భ: నాకు రూపం లేదని అంటాను.

మ: మంచిదే. నీకు నిద్రలో గూడ రూపులేదు. కాని మేల్కొన్నస్థితిలో ఏదో ఒక రూపంగా నిన్ను నీవు తాదాత్మ్యం చేసుకొంటావా లేదా? నిజంగా నీ స్థితి ఏదో చూడు. నిజస్థితికి ఆకృతి లేదని విచారం వల్ల తెలుస్తుంది. నీ జ్ఞానం వల్ల ఆత్మ నిరాకారమని అర్థము చేసుకుంటే ఆపాటి జ్ఞానం దైవానికి గూడ ఉంటుందని ఒప్పుకొని ఆయనగూడ నిరాకారియే యని ఒప్పు కోవాలి కదా?

భ: కాని దేవునికి ఈ ప్రపంచం ఉందికదా?

మ: జగత్తెలా గోచరిస్తుంది? మనమెలా ఉన్నాము? ఇవి తెలిస్తే నీకు దేవుడూ తెలుస్తాడు. శివుడో, విష్ణువో, మరొకరో, కాక అన్నింటి కలగలపో.

భ: వైకుంఠము, పరమపదం అంటే పరమాత్మలో ఉన్నదా?

మ: ఆ వైకుంఠమో, పరమపదమో నీలోగాక మరెక్కడ ఉంది?

భ: వైకుంఠాదులు అసంకల్పితంగా (కోరకుండానే) కనిపిస్తాయి.

మ: జగత్తు సంకల్పితంగా (కోరి) కనిపిస్తోందా?

జవాబు లేదు.

మ: స్వయంవ్యక్తమైన 'నేను' ఆత్మను లెక్క చేయకుండా, అనాత్మను వెదకుతూ పోతుంది. అది తెలివైన పనేనా?

భ: ఇది సాంఖ్య యోగము. అన్ని యోగాలకూ పరమమైన దీన్ని, ప్రారంభంలోనే అర్థం చేసుకోవడమెలాగ? అందుకు మునుపు భక్తి కావాలికదా?

మ: శ్రీకృష్ణులు గీతను సాంఖ్యయోగంతో గాదా ప్రారంభించింది?

భ: అవును. నాకిప్పుడు అర్థమవుతున్నది.

## భాషణములు 386

భక్తుడు: శ్రీ రామకృష్ణుల జీవిత చరిత్రలో, రామలాలా అనే ఒక విగ్రహం సచేతనంగా ఉండేదన్నారు. అది నిజమేనా?

మహర్షి: ఈ దేహానికి చైతన్యమెట్లో చెప్పగలవా? దేహం కదలికల కన్నా, విగ్రహం కదలికలు ఎక్కువ వింతలా?

భ: లోహము తనంతట తాను కదలదు.

మ: దేహం శవం గాదా? శవం కదలితే, అది తెలియరాని అద్భుతం అని నీవనుకొంటావు. అవునా?

## భాషణములు 387

స్వల్పకాలం ఆశ్రమం చూసి పోదామని ముగ్గురు వచ్చారు. వారిలో పెద్దవాడు అడిగాడు.

భక్తుడు: సృష్టి ప్రక్రియ పురాణాలలో ఒక విధంగా, ఉపనిషత్తులలో మరొక విధంగా చెప్పియున్నారు, అందేది నిజం?

మహర్షి: అలాంటివి చాల ఉన్నాయి. సృష్టికొక కారణాన్ని, ఒక కర్తనూ ఉపపాదిస్తే ఎవరైనా ఆ కారణాన్ని విచారిస్తారని వాని ఉద్దేశ్యం. ప్రాధాన్యత సిద్ధాంత ఉద్దేశ్యానికి కాని, సృష్టి ప్రక్రియ వివరాలకు కాదు. అదిగాక సృష్టిని ఎవరో ఒకరు చూచియుండాలి. కర్తలేక విషయములుండవు. అంటే, విషయములు తాముగా తాము ఉన్నాయని చెప్పవు. అవి ఉన్నాయనేది నీవు. కాబట్టి విషయములు చూసేవాడు వాటిగురించి అర్థం చేసుకొనేదాని బట్టి ఉంటాయి. కర్తను స్వతంత్రించి వానికి అస్తిత్వమే లేదు. నీ స్వరూపమేమో కనుక్కో జగత్తేమో తెలుస్తుంది. ఆ సిద్ధాంతం యొక్క వుద్దేశ్యమది.

భ: ప్రపంచము అతి విశాలము, ఆత్మ అణుమాత్రం. దాన్ని అర్థం చేసుకోవడం ఎలా?

మ: ఆ అణువే విశాల ప్రపంచాన్ని గురించి చెప్తుంది. ఇందులో అసంగతము ఏముంది?

## భాషణములు 388

ఆ పిమ్మట శ్రీ భగవాన్ --- చెప్పారు.

తాత్త్విక భౌతిక సిద్ధాంతాలెన్నో ఉన్నాయి. అందులో ఏదైనా నిర్ణాయికము ఉందా? ఉండజాలదు. బ్రహ్మము అణోరణీయము, మహతో మహీయము, (అణువుకంటే చిన్నది. అతిపెద్ద దానికంటే పెద్దది) అణువు ఊహకు అందనంత సూక్ష్మాతి సూక్ష్మము. అది సూక్ష్మవిభావనగా పర్యవసిస్తుంది. ఆ సూక్ష్మత, సూక్ష్మ, శరీరములది, అంటే మనస్సుది. అలాగే ఆత్మ మనస్సునకునూ ఆవలిది. అతీ మహీయములు గూడ విభావనలే, బోధలే. అవీ మనస్సువే. మనస్సున కావలిది ఆత్మ. ఈ విధంగా ఆత్మ అతి సూక్ష్మమైన దానికంటే సూక్ష్మము. (సూక్ష్మతమము)

సృష్టిని గూర్చి మతభేదాలెన్నో ఉన్నాయి. కాని అన్నీ బహిర్ముఖాలే (బాహిర ప్రవృత్తులే). వానికొక అంతంటూ ఉండదు. దేశకాలాలకు అవధులు లేవు కనుక, ఇందులో హర్షించదగ్గదియేమంటే, అవన్నీ మనఃకల్పితాలు. మనస్సును చూడు. దేశకాలాలను అధిగమించి ఆత్మసిద్ధి కలుగుతుంది.

సృష్టిని భౌతికశాస్త్ర దృష్ట్యానో, తార్కికంగానో, ఎవరికేది తృప్తియైతే అట్లు, వివరిస్తారు. కాని దానికి నిశ్చయమంటూ ఉండగలదా? ఆ వివరణలను క్రమసృష్టి వాదాలంటారు. ఇక దృష్టి, సృష్టి వాదమూ, అది యుగపత్ (అకస్మాత్, ఏకకాల) సృష్టి, చూచువాడు లేక, దృశ్యముండదు. చూపరిని చూడు. సృష్టి వానిలో ఇమిడి ఉంది. వెలికి చూడటమెందుకు? అంతులేని బహిస్సంభవాలను వివరింపబూనట మెందుకు?

## భాషణము 389

కానుకల విషయంలో శ్రీభగవాన్ అన్నారు - వారు కానుకలేల తెస్తారు? నాకవి కావాలా? నేను వద్దన్నా వారు బలవంతంగా కట్టబెట్టుతారు. ఎందుకో! వానిని గ్రహిస్తే, వారి కోరికకు లొంగిపోవాలి. ఇది చేప కెరచూపినట్టు. చేప కాహార మీయవలెననియా జాలరి ఉబలాటం? వానితో తన పొట్టనింపుకోడానికే గాని, స్వామి లోకేశానంద: జ్ఞానమంటే ఏమి, విజ్ఞానమంటే ఏమి?

మహర్షి: సందర్భాన్ని బట్టి వానికి వేర్వేరు అర్థాలు. జ్ఞాన = సామాన్య జ్ఞానం = శుద్ధ చైతన్యం. విజ్ఞాన = విశేష జ్ఞానం. విశేషము అంటే 1. లౌకికం (సాపేక్షం) కావచ్చు. 2. ఆధ్యాత్మికం (ఆత్మజ్ఞానం) కావచ్చు.

విశేషానికి మనస్సవసరం. అది పరమచైతన్య పారిశుద్ధ్యాని మారుస్తుంది. కాబట్టి అది బుద్ధి విషయం. దాని ఆవరణం విజ్ఞాన (సాపేక్ష జ్ఞాన) మయకోశం. అట్టిచో, జ్ఞానం సామాన్యజ్ఞానమై, విజ్ఞాన, సంజ్ఞాన, ప్రజ్ఞాన, అజ్ఞాన, మతి, ధృతిలాంటి వివిధజ్ఞాన పద్ధతులద్వారా సూత్రితమై ప్రవహిస్తుంది. (ఐతరేయోపనిషత్ 3 అధ్యాయం) మరోవిధంగా జ్ఞానం పరోక్షము; విజ్ఞానం అపరోక్షము లేదా ప్రత్యక్షము. "జ్ఞాన విజ్ఞాన తృప్తాత్మా" (జ్ఞానము విజ్ఞానములతో పూర్తిగా తృప్తిపొందినవాడు)

భక్తుడు: బ్రహ్మమునకు ఈశ్వరునకూ సంబంధమేమి?

మహర్షి: ప్రపంచానికి సంబంధించినమటుకూ బ్రహ్మమును ఈశ్వరుడంటారు.

భ: శ్రీరామకృష్ణులు చేసినట్లు, ఈశ్వరునితో మాట్లాడటం సాధ్యమా?

మ: మనం ఒకరితో ఒకరు మాట్లాడుకొనేటప్పుడు ఈశ్వరునితో ఎందుకు మాట్లాడలేము.?

భ: అట్లైతే మాకది ఏల చేతకావడం లేదు?

మ: దానికి మనస్సు శుద్ధమూ, దృఢమూ కావాలి; ధ్యానాభ్యాసం కావాలి.

భ: పై చెప్పినవి ఉంటే దైవం ప్రత్యక్షమౌతాడా?

మహర్షి: అట్టి సాక్షాత్కారాలు మనమెంత నిజమో, అంత నిజం. జాగ్రత్తులోవలె నిన్ను దేహంగా అన్వయించుకుంటే, నీకు స్థూలవస్తువులే కనుపిస్తాయి. సూక్ష్మశరీరంలోగాని, కలలో వలె మానసికంగా గాని అయితే నీవు సూక్ష్మ వస్తువులనే చూస్తావు. అలాగే దేహంతో సంబంధం లేక నిద్రలోవలెనైతే ఏదీ కన్పించదు; చూచువాని అవస్థ కనుగుణంగానే, వాడు చూచే దృశ్యం ఉంటుంది. దైవసాక్షాత్కారమునకూ ఇదే వర్తిస్తుంది.

దీర్ఘాభ్యాసం వల్ల, నీవు ధ్యానించిన రూపంగానే దైవం కలలో కన్పిస్తాడు. తరువాత జాగ్రత్తులో కూడ కనుపించవచ్చు.

భ: భగవత్ సాక్షాత్కారమంటే ఆ స్థితేనా?

మ: ఒకప్పుడు, ఎన్నో ఏండ్ల క్రింద ఏం జరిగిందో చెప్తాను, వినండి. నామదేవుడని ఒక యోగి. ఆయన విఠోబాను చూచి మాట్లాడి ఆయనతో ఆడుకుంటూ ఉండేవాడు. విఠోభతో ఆటలాడుకుంటూ అతడెక్కువ కాలం గుడిలోనే గడిపేవాడు.

ఒకసారి యోగులందరూ ఒక సభగా చేరారు. వారిలో ఒకరు జ్ఞానదేవులు, చాల ప్రసిద్ధి, కీర్తి మహిమలు గలవాడు. ఆయన గోరాకుంభార్ (కుమ్మరి) యతిని, ఆయన కుండలు సరిగా కాలినవో లేవో పరికించేంత నేర్పుతోనే, అక్కడి యతుల నందరినీ పరీక్షించి, పక్వమెవరో, పచ్చిఎవరో, తెలుపవలసిందన్నాడు. ఆపైన గోరాకుంభార్ తన చేతికర్రను తీసుకొని, ఒక్కొక్కరినీ పరీక్షిస్తున్న వానివలె, సరదాగా ఒక్కొక్క దెబ్బవేస్తూ, వచ్చాడు. నామదేవుని వద్దకు రాగానే, ఆయన దానికి తీవ్రంగా వ్యతిరేకించాడు. అందరూ నవ్వి గేలిచేసారు. నామదేవులకు చాలా కోపం వచ్చింది. నేరుగా గుడిలోని విఠోబా వద్దకు వెళ్ళి అడిగాడు. ఆ యోగులు సరిగా తెలిసినవారే అన్నాడు విఠోబా. సమాధానం అట్టిదిగా ఉండునని ఊహించనేలేదు. కోపం మరింత హెచ్చింది.

నామదేవ్: నీవు దేముడివి. నేను నీతో మాట్లాడతాను, ఆడతాను. మనిషికి ఇంతకన్న మరేం పొందాలి?

విఠోబా యోగులకన్నీ తెలుసునని రెట్టించాడు.

నామదేవ్: నీకన్నా సత్యమేమైనా ఉందా? నాకు చెప్పు.

విఠోబా: మన ఇరువురికి పరిచయం హెచ్చు. నా సలహా నీపై సరిగా పనిచేయదు. అడవిలో భిక్షుయోగి ఉన్నాడు; పోయి ఆయన్నడుగు.

అలాగే నామదేవ్ ఆ యోగిని వెదుక్కుంటూ వెళ్ళాడు. నామదేవునకు ఆయన ఏమంత పుణ్యమూర్తిగా అనిపించలేదు. మొలచుట్టూ గుడ్డయే లేదు. మురికి మట్టిలో పడుకొని ఉన్నాడు. కాళ్ళు ఒక శివలింగంపైన పెట్టుకొని యున్నాడు. ఇట్టివాడు యోగి ఎట్లైనాడా యని నామదేవు కాశ్చర్యమైంది. కాని నామదేవుడను చూడగానే ఆ యోగి చిరునవ్వుతో పలుకరించి "ఏం, విఠోబా నిన్ను ఇక్కడికి పంపాడా?" అని అడిగాడు. నామదేవుని ఆశ్చార్యానికి మేరలేదు. ఆయన గొప్పవాడుగానే ఉండవచ్చునని నమ్మసాగాడు. అందుచేత నామదేవు ఆయనను "మిమ్ము యోగులంటారు. శివలింగాన్నిట్లు అవమానించవచ్చా ?" అని అడిగాడు. "నిజమే, కాని చూడూ, నేను చాల ముసలివాణ్ణి, బలహీనుణ్ణి. ఏదీ సరిగా చేయలేను. నీవేమీ అనుకోకుండా నా కాళ్ళక్కడనుండి ఎత్తి, శివలింగం లేనిచోట నుంచు నాయనా!" అన్నాడు యోగి. అలాగే నామదేవుడాయన కాళ్ళనెత్తి మరొకచోట ఉంచాడు. కాని దానీ క్రిందా ఒక శివలింగం ఉంది. ఆ కాళ్ళ నాతడెటుంచినా, క్రింద శివలింగం కనిపిస్తూనే ఉంది. విసిగి, చివరకు నామదేవు ఆయన కాళ్ళను తనపైనుంచుకున్నాడు. తక్షణమే తానూ శివలింగమైపోయాడు.

అప్పటికి అతనికి నిజం తెలిసింది. దైవం సర్వాంతర్యామియని. అక్కడి నుండి నామదేవు నేరుగా తన ఇంటికివెళ్ళి చాల రోజులదాకా గుడికి వెళ్ళనే లేదు. విఠోబా వాని ఇంటికే వెళ్ళి దైవాన్ని చూడటానికి గుడికి రావటం లేదేమని

ప్రశ్నించాడు. “ఆయన లేని చోటంటూ ఉన్నదా?" అన్నాడు నామదేవ్. దీని తాత్పర్యం స్పష్టమే. దైవసాక్షాత్కారం లాంటివి ఆత్మస్థితికంటె కొంచెం తక్కువ స్థాయివే.

## భాషణములు 390

భక్తుడు: శ్రీభగవాన్ రచనలు చదివితే, ఆత్మానుభవానికి అన్వేషణ యొక్కటే మార్గంగా కనుపిస్తున్నది.

మహర్షి: అవును, ఆదే ఆత్మవిచారం.

భ: అది చేయడమెలా?

ఈ ప్రశ్నించేవాడు తానున్నానని ముందుగా ఒప్పుకోవాలి. 'నేనున్నా'ననేది ఎరుక - ఆత్మానుభవము. అది సిద్ధించేదాకా కీలకాన్ని పట్టుకొని అనుగమిస్తూండటం, విచారం. విచారమూ, అనుభవమూ రెండు ఒకటే.

భ: అది పట్టు దొరకదు. దేనిని ధ్యానించేది?

మ ధ్యానించటానికి విషయ మొకటి కావాలి. ఆత్మవిచారంలో కర్త మాత్రమే ఉంటాడు. కర్మ ఉండదు. ఈ విధంగా ధ్యానం, విచారానికి భిన్నమౌతుంది.

భ: ఆత్మసిద్ధికై సాధనాల్లో ధ్యానం చాలా ముఖ్యమైన సాధన కాదా?

మ: ధ్యానం ఒక విషయంపై ఏకచింతన. ఇతరాలోచనలను దూరం చేసి చిత్తైకాగ్రతను కూర్చడం దాని ప్రయోజనం. ఆత్మానుభవానికి పూర్వం ఆ ఒక్క తలంపు కూడ పోవాల్సిందే. కాని సంపాదించుకోవటానికి, ఆత్మానుభవం క్రొత్తకాదు. అది ఇప్పుడూ ఉన్నదే. కాని దాన్ని కప్పేస్తూ ఆలోచనల తెర ఉంది. ఆ తెర తీయడానికే అన్ని యత్నాలూను, ఆపైన ఆత్మ సువ్యక్తమౌతుంది. నిజమైన సాధకులను ధ్యానం చేయమని సలహానిస్తే వారిలో చాలమంది తృప్తిజెంది వెళ్ళవచ్చు. కాని వారిలో ఎవరో ఒకరు ఎదురు తిరిగి “ఒక విషయాన్ని ధ్యానించడానికి నేనెవరు?' అని అడిగాడనుకో, అట్టి వానిని ఆత్మనే విచారించమని చెప్పాలి. అదే పరమ సోపానము. అదే విచారము, ఆత్మవిచారము.

భ: ధ్యానం లేకుండా విచారమాత్రం చాలునా?

మ: విచారము, మార్గమూ గమ్యమూ కూడా అదే. 'నేనున్నాను' అనేది గమ్యమూ, పరమసత్యమూ, సయత్నంగా దాన్నే అవలంబించి యుండుట. విచారము. అది అయత్న సిద్ధమూ సహజమూ అయితే అదే ఆత్మస్థితి.

## భాషణములు 391

స్వామి లోకేశానంద సమాధిని గూర్చి అడిగిరి.

మహర్షి:

1. సత్యావలంబనము సమాధి.

2. సత్యావలంబనము యత్నపూర్వకమైతే అది సవికల్ప సమాధి.

3. సత్యంలో లీనమై, ప్రపంచ స్మృతి లేకపోవడం నిర్వికల్ప సమాధి. (ప్రక్క సవికల్ప, నిర్వికల్ప సమాధుల గూర్చి)

4. అజ్ఞానంలో మునిగి ప్రపంచ స్మృతి లేక పోవడము, నిద్ర. (తల ముందుకు వాలిపోతుంది. సమాధిలో అలా జరగదు)

5. ఆద్యమూ, శుద్ధమూ, సహజమూ, అయత్న సిద్ధమూ అయిన స్థితిలో ఉండడం సహజ నిర్వికల్ప సమాధి.

భ: నిర్వికల్ప సమాధిలో 21 రోజులుండి నాతడు భౌతిక కాయాన్ని విసర్జింపక తప్పదంటారే.

మ: సమాధియంటే దేహాత్మబుద్ధి నధిగమించటం. దేహంతో తాదాత్మ్యం చెందకపోవడం ముందు జరిగి ఉండాలి.

నిర్వికల్ప సమాధిలో వేయేండ్లకు పైగా కొందరు యోగులున్నట్లు చెప్పబడింది కదా.

సవికల్ప సమాధి

| బాహ్య (బయట) | అంతర (లోపల) |
| --- | --- |
| (దృశ్యానువిద్ధ) మనస్సు ఒక విషయము నుండి మరలి ఇంకొకదానికి దుముకుతుంది. ఆ విషయముల కాధార సత్యముపై నిల్పి ఆ మనస్సును స్థిరం చేయి. | మనస్సు కామక్రోధాదులతో బాధిత మౌతుంది. అవి ఎటనుండియో, వాని ఉనికి ఎట్లో చూడు. వాని మూలాన్ని చిక్కబెట్టుకో |



| | |
| --- | --- |
| (శబ్దానువిద్ధ) ఏకైక సత్యమునుండి వెలివడ్డ బాహ్య విషయములున్నవి ఆ సత్యానికై వెదకిదాన్ని అవలంబించు. | లోని సత్యం నుండి వెలివడి వ్యక్తమయ్యే బహురూపము లగు ఆలోచనలున్నవి. ఆ సత్యాన్ని అవలంబించు. |

నిర్వికల్ప సమాధి

| బాహ్య (బయట) | అంతర (లోపల) |
| --- | --- |
| అన్ని సంభవాల కాధారమైన సత్యంలో మగ్నమై క్షణికంగా వ్యక్తమయ్యే విషయాల యందు స్పృహ లేకుండుట. | అన్ని ఆలోచనలకు మూలమగు అత్యంతలోపల నిమగ్నమై మరేమియు తెలియక ఉండుట. |
| ఈ స్థితిని నిస్తరంగ సముద్రంతో పోలుస్తారు. దాని నీరములు నిశ్చలములూ, శాంతములూ. | ఈ స్థితిని నిర్వాతమూ, స్థిరమూ అయిన దీపశిఖతో పోలుస్తారు. |

ఈ నాలుగు విధములా సవికల్ప సమాధి యత్నసాధ్యము.

పై విధముల నిర్వికల్ప సమాధి అయత్న సిద్ధం, బాహ్యమైన నిస్తరంగ సముద్రమూ, అంతరమైన స్థిరదీపశిఖా సమమని తెలుస్తుంది. ఆ స్థితి సహజనిర్వికల్ప సమాధి.

## భాషణములు 392

స్వామి లోకేశానంద: ఆత్మసిద్ధికి పూర్వం కుండలిని నుత్థాపించవలెననీ, ఆ కుండలినీ లేవడం శరీరం ఉష్ణోగ్రతను పెంచుతుందనీ అంటారే, నిజమా?

మహర్షి: యోగులు దానిని కుండలినీ శక్తి అంటారు. భక్తులు దానిని భగవదాకారవృత్తి అన్నారు. జ్ఞానుల కది బ్రహ్మాకార వృత్తి. ఆత్మసిద్ధికది పూర్వస్థితి. దాని స్పందనం వేడి అనవచ్చు.

భక్తుడు: కుండలిని సర్పాకృతి యన్నారు. కాని వృత్తులకు అలాంటి రూపముండదు.

మ: జ్ఞానమార్గంలో కుండలినీ హృదయమే. దానిసే నాడీ కూటమియనీ, సర్పాకృతి యనీ, పద్మ ముకుళమనీ వర్ణించారు.

భ: ఈ హృదయం శారీరకమా?

మ: కాదు, శ్రీరమణగీతలో దానిని అహంస్ఫూర్తి మూలమన్నారు.

భ: కాని అది వక్షంలో కుడివైపునని చదివాను.

మః అది భావనకు (ఇమేజరి) సహాయపడడానికే. కొన్ని గ్రంథాలు షట్చక్రాలను ఎన్నో ఇతర బహిరంతర లక్ష్యాలను పేర్కొన్నాయి. అన్నన్ని లక్ష్యాల్లో హృదయం ఒక్కటి. కాని ఆ వర్ణనల జోలి అనవసరం. అది అహంస్ఫురణకు మూలమన్నది చాలు. అదే పరమసత్యము.

భ: దానిని అంతఃకరణ మూలమనుకోవచ్చునా?

మ: అంతఃకరణము లేదు విధాలు. 1. జ్ఞానము, 2. మనస్సు, 3. బుద్ధి, 4. చిత్తము (స్మృతి), 5. అహంకారము. కొందరు జ్ఞానాన్ని మినహాయించి, మిగత నాల్గింటిసే అంతఃకరణాలన్నారు. మరికొందరికి 1. మనస్సు, 2. అహంకారములు రెండే అంతఃకరణాలు. ఇంకా కొందరి దృష్ట్యా అంతఃకరణ ఒక్కటే. దాని వివిధ వృత్తులవల్ల, అది వివిధంగా కనుపించి వేర్వేరు పేర్లతో పిలువబడింది. అన్ని అంతఃకరణాలకూ మూలము హృదయమే.

దేహం జడము; ఆత్మ నిత్యము, స్వయంభాసి, దేహానికి ఆత్మకూ మధ్య అహంకార మావిర్భవించింది. దీనికి చాల పేర్లు - మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, శక్తి, ప్రాణము ఇత్యాది. నువ్వు ఎక్కడినుండి వచ్చేవో ఆ మూలాన్ని పొందే ప్రయత్నం చేయి. ఆ యత్నం తానై నిన్ను హృదయంలో చేరుస్తుంది. సూక్ష్మశరీరమును తెలియబరచే కల్పనలే, అంతఃకరణలు. శరీరం పాంచభౌతికం -- పృథివి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము. శరీరము జడము. ఆత్మ శుద్ధము, స్వయంప్రకాశి, ఆ విధంగా స్వయం వ్యక్తము. ఈ రెంటి సంధానానికై సూక్ష్మశరీరాన్ని ప్రతిపాదించారు. దీని కుపాదానంగా పంచభూతములను సూక్ష్మాంశలను (తన్మాత్రలను) ఆత్మను ప్రతిఫలించే ఆభాసకాంతిని కలిపారు. ఈ విధంగా మనస్సుకు పర్యాయమైన సూక్ష్మదేహము, జడమూ, చేతనమూ, రెండునూ, అంటే ఆభాసము. పంచభూతములపై సత్త్వగుణ ప్రసరణవల్ల వాని సత్త్వత (ప్రకాశము) మనస్సుగా, జ్ఞానేంద్రియములుగా వ్యక్తమౌతుంది. రజోగుణ ప్రసరణవల్ల రజోంశ ప్రాణముగా కర్మేంద్రియములుగా తయారవుతుంది; తమోగుణ ప్రభావంవల్ల తామసికములూ స్థూలములునైన దేహాదులుగా ప్రకటితమౌతుంది.

భ: కాని మనస్సుకు ఈ మూడు గుణాలూ ఉన్నాయన్నది ప్రసిద్ధము కదా! మ: అవును సత్త్వంలో సత్త్వం వుంది. సత్త్వంలో రజస్సు వుంది. అలాగే సత్త్వంలో తమస్సు కూడా వుంది. ఇలాగే మిగిలినవి. శుద్ధసత్త్వము అతి స్వచ్ఛము - ఇతర గుణములతో కలసి నప్పుడు మిశ్రము. సత్త్వగుణము అంటే మిగత గుణాలకన్నా దాని ఆధిక్యాన్ని తెలుపటమే.

విషయము సుస్పష్టముచేసి, సత్యాన్ని బోధపరచడానికి ఇన్ని సిద్ధాంతాలు. కాని సందిగ్ధత లేనిచోట, అవి సందిగ్ధతను తెచ్చిపెడతాయి. ఏది తెలియవలెనన్నా, ఆత్మ ఉండాలి. ఆత్మ స్పష్టమే. ఆత్మగనే ఉండరాదా? అనాత్మను వివరించవలసిన అవసరమేమి?

ఉదాహరణకు వేదాంతము చూడండి. వారంటారు, ప్రాణాలు 15 విధాలు. విద్యార్థి ఆ 15 పేర్లూ, వాని పనులను కంఠస్థము చేయాలి. వాయువు పైకి వెడుతుంది, అది ప్రాణము; క్రిందికి దిగుతుంది, అది అపానము; ఇంద్రియాలను వర్తింపచేస్తుంది. దాని కింకొక పేరు. ఎందుకిదంతా? వాటిని విభజించి, పేర్లుపెట్టి, అవి వర్తిలే విధాలను గుణించి, ఏమో, ఏమేమో చేస్తారు. అంతపనీ, ఒక్క ప్రాణం చేస్తుందంటే చాలదా?

అలాగే అంతఃకరణ యోచిస్తుంది, కోరుతుంది, నిశ్చయిస్తుంది. తర్కిస్తుంది; ఇట్లది చేసే ప్రతి పనిని బట్టి దానికి వేర్వేరు పేర్లు. అందులో మనస్సు, బుద్ధి మొదలైనవి. ఈ ప్రాణాలనుగాని, అంతఃకరణలను గాని ఎవరైనా చూసారా? అవి నిజంగా ఉన్నాయా? అవి కేవలం కల్పనలు (conceptions) వానికి అంతెక్కడ?

మరో విశేషం చూడండి. ఒకడు నిద్రించాడు. లేవగానే, తాను నిద్రించానంటాడు. ఆ మాట నిద్రలో నుండగా అనడేం? దీనికి సమాధానం -- "నీళ్ళ అడుగునున్న వస్తువును తేవటానికి మునిగిన వానివలె, ఆత్మలో మగ్నుడైన ఇతడూ మాట్లాడలేడు" అని. మునిగినవాడు నీటి అడుగునుండి మాట్లాడలేడు. వస్తువును సేకరించి పైకి తేలిన తర్వాతే ఏం మాట్లాడినా. ఎందుకు?

నీటిలోనుండి మాట్లాడబోతే నోట్లో నీరు నిండుతుంది. ఇది తేలికగా అర్థమయ్యేదే కాని తాత్త్వికుల కొంతతో తృప్తికాదు. వారి వివరణ చూడండి.. వాక్కు కధిపతి అగ్ని; దానికీ నీటికీ వైరం; అందువల్ల వాక్కురాదు. ఇది తత్త్వము, దానిని నేర్చుటకు విద్యార్థులు తలలు పగులగొట్టుకోవాలి. ఇది కాలం వృథా చేయడం కాదా? ఇంకా ఉన్నవి. వ్యక్తికి గల ప్రతి అంగానికీ ఒక్కొక్క అధిష్టాన దేవత. ఆ దేవతలు విరాట్టుకు (సమష్టికి) అంగాలూ, ఇంద్రియాలూనూ. ఇలాగే హిరణ్యగర్భాదులకూ నిర్వచిస్తూ పోతారు. సందిగ్ధత సృజించడ మెందుకు, విడదీయడమెందుకు? ఈ వలయంలో చిక్కుకోనివాడు ధన్యుడు.

నేనెంత అదృష్ట వంతు, ఆ దారిలో పోలేదు. ఆ మార్గంలో పోయి వుంటేనో, కలిగే కలతలో దిక్కు తెలిసి ఉండేదికాదు. నా పూర్వ వాసనలు నాకు సూటిగా “నేనెవ’రన్న విచారమార్గాన్నందించాయి. నిజంగా అది ఎంతో అదృష్టం!

## భాషణములు 393

భక్తుడు: 'ప్రబుద్ధ భారత' మార్చి సంచికలో సెయింట్ థెరెసా అధ్యాత్మికానుభవాలగూర్చి ఒక వ్యాసమున్నది. మెడోనా చిత్రమంటే ఆమెకు అతి భక్తి. ఆమె దృష్టిలో ఆ చిత్రానికి చైతన్యం వచ్చిందట, ఆమె ఆనందమగ్న అయిందట. శక్తిపాతమంటే ఇదేనా?

మహర్షి: చిత్రం చైతన్యం. అది ఆమె ధ్యానబలాన్ని తెలుపుతుంది. శక్తిపాతం అంతర్ముఖులు కావడానికి, సహాయం చేస్తుంది. ఒక పద్ధతి వుంది. మనస్సును తన నీడపైనే ఏకాగ్రం చేస్తే, ఒక దశలో ఆ నీడకు చైతన్యం వచ్చి, అడిగిన ప్రశ్నలకు సమాధానాలిస్తుంది; అది మనోబలానికీ లేదా ధ్యాన తీవ్రతకు నిదర్శనము. బాహ్యం, సర్వమూ అనిత్యం. అట్టి సంభవాలు అప్పటప్పటికీ సంతోషపెడుతాయి. కాని వానివల్ల నిశ్చల శాంతి లభించదు. దాన్ని సాధించగల్గింది అవిద్యానాశ మొక్కటే.

## భాషణములు 394

భక్తుడు: మనస్సును నిశ్చలం చేసేదెలా?

మహర్షి: మనస్సును మనస్సుతో చూడడం ద్వారా లేదా మనస్సును ఆత్మలో నిలపడం ద్వారా, మనస్సు ఆత్మవశమౌతుంది.

భ: ఆ పద్ధతిని నేర్పే యోగమేమైనా ఉందా? (అంటే పద్ధతి ఏమైనా ఉందా?)

మ: విచారమొక్కటే చాలు.

## భాషణములు 395

భక్తుడు: పూర్ణబ్రహ్మాన్ని పొందే విధమేమి? గృహస్థునికి ఉపయుక్తమైన ఉత్తమ విధానం ఎట్టిది?

మహర్షి: పూర్ణమని అనసే అన్నావుగా. పూర్ణానికి నీవు వేరా? వేరైతే అది పూర్ణ మెట్లౌతుంది? వేరుకాకపోతే ఈ ప్రశ్న ఎలా వచ్చింది? బ్రహ్మము పూర్ణమనీ, నీవు దానికి వేరుకావు అన్న ఎరుకే, పరమార్థము. అది చూడు. అప్పుడు నీకు తెలుస్తుంది, నీవు గృహస్థుడవుగాని, ఎట్టి పరిధుల్లోని వాడవుగాని కావని.

భః తత్త్వములేవి?

మ: పూర్ణబ్రహ్మజ్ఞానం, తానే అన్నింటినీ విశదం చేస్తుంది.

## భాషణములు 396

శ్రీమతి గాంగ్రిబ్స్, ఒక డచ్ వనిత, థియోసాఫికల్ (దివ్యజ్ఞాన సమాజం) వాదంలో గాఢవిశ్వాసమున్నది. జావాలో చాలాకాలం పనిచేసి, ప్రస్తుతం అడయారులో నున్నది. ఆమె ఆశ్రమాన్ని చూడవచ్చింది. ఆమె అడిగింది థియోసాఫీ (దివ్యజ్ఞాన సమాజంలో) "తన్హా" అనే పదాన్ని తరచూ వాడతారు. 'తన్హా' అంటే పునర్జన్మకైన తృష్ణ. దానికి కారణమేమి?

మహర్షి: 'తన్హా' తరువాతి జన్మలన్నింటినీ అంతమొందించగల ఒకే ఒక పునర్జన్మకైన తృష్ణ, ప్రాణమిప్పుడు మృతప్రాయంగా ఉంది. ఇప్పటి మరణం కైతవం (కపటము). దీని తర్వాత పునర్జన్మ కలగడానికి, దానికి చైతన్యం ఆవహింపచేయాలి. ఇప్పటి చావు నీ సత్యస్వభావాన్ని నీవు మరచిపోవడమే. ఆ స్వభావ స్మృతియే పునర్జన్మ. అది జననాంతరాలను అంతం చేస్తుంది. నీది నిత్య జీవనము.

భ: నామటుకు నాకు, 'తన్హా' అంటే బ్రతుకుని పట్టుకొని ప్రేలాడటంగా నిత్యజీవితానికై తీరని ఆశగా గోచరిస్తుంది.

మ: నీవన్నది నిజమే. ఆ కోరిక ఎలా కలిగింది? ఇప్పటి స్థితి సహింపరానిది. గనుక. ఎందుచేత? అది నీ స్వభావం కాదు గనుక. అది నీ సహజ స్వభావమే అయితే, ఆ కోరికతో నీవు సతమతం కావు. నీ సహజస్థితికీ, ప్రస్తుత స్థితికీ భేదమేం? నిజానికి నీ జీవుడు ఆత్మయే. కాని ఆ జీవుడు తన్ను స్థూలదేహమని, భ్రాంతిపడుచున్నాడు. దేహాన్ని మనస్సు కల్పిస్తోంది (వ్యక్తీకరిస్తోంది). ఆ మనస్సు వచ్చింది ఆత్మనుండే. ఈ తప్పు తాదాత్మ్యం తొలగితే, శాంతి నెలకొని వర్ణింపరాని ఆనందం అఖండంగా వెల్లివిరుస్తుంది.

భ: బ్రతుకు దేహానిది, పునర్జన్మ కూడ మరొక దేహంగా పుట్టడానికే కదా?

మ: దేహాలు మారినంత మాత్రాన ఫలమేం? దేహంతో అన్వయించుకొనే అహంకారము, మరొక దేహంలోకి మారింది. దానివల్ల ఎవరికేం తృప్తి?

ఇంతకూ జీవం అంటే ఏమి? జీవము ఉనికి - నీ ఆత్మస్థితి. నీవులేని కాలాన్ని ఊహించగలవా? See రెడిన

ఆ జీవం ఇప్పుడు ఈ దేహంలో పరిమితమైంది. నీవు నీ స్థితిని, ఈ దేహస్థితి యని భ్రమిస్తావు. నీ జీవస్థితి నిర్నిబంధం. ఈ శరీరాలు మనోకల్పనగా నిన్నంటుకొని, "నేను శరీరాన్ని" అనే బుద్ధి కల్గిస్తాయి. ఈ బుద్ధి తొలగిపోతే నీవు ఆత్మయే.

పుట్టకముందు, నీవెక్కడ, ఎలా ఉన్నావు? నిద్రలో వున్నవా? అప్పుడెట్లున్నావు? అప్పుడూ దేహంలేకనే ఉన్నావు. ఆ తర్వాత అహంకార ప్రాదుర్భావం, ఆపైన మనస్సు దేహాన్ని ప్రసరింపచేయటం. దాని ఫలితం "నేను దేహాన్ని" అనే భావన. దేహం ఉంది గనుక, అది పుట్టిందనీ, చనిపోతుందనీ మొదలు పెట్టి, ఆ భావాన్ని ఆత్మకు సంధించి, నీవు పుట్టినావని చనిపోతావనీ అంటావు. నిజానికి నిద్రలో దేహం లేకుండానే నీవున్నావు. కాని ఇప్పుడు నిన్ను దేహంతో చూస్తున్నావు. ఆత్మ దేహంలేక ఉండగలదు; కాని దేహం ఆత్మకు భిన్నంగా ఉండలేదు.

'నేను దేహము'ననే భావన అజ్ఞానం. కాని దేహం ఆత్మకు వేరుగాదనేది జ్ఞానం. జ్ఞానానికీ, అజ్ఞానానికీ గల భేదమిదే.

దేహం మనస్సుచేత ప్రసరింప చేయబడింది. మనస్సే అహంకారము. ఆ - అహంకారము జనించేది ఆత్మనుంచి. కాబట్టి దేహభావన, విక్షేపం కలిగించేది, ఆత్మకెప్పుడూ దూరంగా సంచరించేది. ఈ దేహంగాని, పుట్టుకగాని ఎవరికి? అవి ఆత్మకు గాదు, ప్రాణానికి గాదు. అవి తాను వేరు అనుకొన్న అనాత్మకు. భేదభావన ఉన్నంతవరకు ఆలోచనల బాధ తప్పదు. మూలస్థితిని తిరిగిపొంది, భేదభావం నష్టమైతే, శాంతి నెలకొంటుంది.

ఒక రాతిని పైకి విసిరామనుకోండి. అది తన స్థానం నుంచి పైకిపోయి, తిరిగి క్రిందికి రా యత్నిస్తుంది. అది స్వస్థలానికి మరలివచ్చిందాకా, దాని చలనం ఆగదు. తిరిగి చేరాక, శాంతంగా ఉంటుంది. అలాగే సముద్రం నీరు ఆవిరియై మబ్బులుగా మారి, గాలికి కదలి, వానిలోని జలభాగము ఘనీభవించి, వర్షమై, కొండచరియల్లో, సానువుల్లో సెలయేళ్ళగా, నదులుగా పారి, తిరిగి సముద్రాన్ని చేరి, శాంతిస్తుంది. ఇట్లు మూలంనుంచి వేరైన భావమున్నచోటనెల్లా, ఆ భేదభావం పోయేదాకా కలతా, కదలికా ఉండి తీరుతాయి. నీ విషయంలో గూడా అంతే. నిన్ను దేహంగా అన్వయించుకున్నావు గనుక నీ స్వస్థితియైన ఆత్మకు భిన్నుడవని భ్రాంతిపడుతున్నావు. మిథ్యా తాదాత్మ్యం పోయి, శాంతిని పొందాలంటే నీవు మరల మూలాన్ని పొందాల్సిందే.

బంగారం నగ గాదు, కాని నగ అంటే బంగారమే. నగ ఏ రూపైనా, నగలు ఎన్ని రకాలైనా, వాని అన్నిటా ఉన్న నిజం ఒక్క బంగారమే. అలాగే దేహాలూ, ఆత్మ. ఏకైక సత్యం ఆత్మ. తన్ను దేహంగా భావిస్తూనే సుఖమూ కావలెననటం మొసలి వీపెక్కి నదిని దాటగోరటం వంటిది. మనస్సు బహిర్ముఖం అయి అంతటా తిరగడం వల్ల దేహాత్మబుద్ధి జనిస్తుంది. ఆ స్థితిలోనే ఉండిపోతే విప్పలేని చిక్కుల్లోపడి శాంతిని కోల్పోక తప్పదు. మూలాన్ని కోరుకో, వెదుకు. ఆత్మతో కలిసి పో. ఏకంగా (అద్వైతంగా) ఉండిపో.

ఇప్పటి జీవితంతో విసగూ, ఎట్టి అసంతృప్తి లేని జీవితంపై కోరిక, పునర్జన్మ అంటే అదే. పుట్టుకలు దేహానికి గనుక, ఆత్మను బాధించలేవు. శరీరం నశించినా, ఆత్మ మిగిలే ఉంటుంది. నశ్వరమైన శరీరాన్ని శాశ్వతమైన ఆత్మగా భావించటమే అసంతృప్తి కారణం. అహంకారానికి దేహం తప్పనిసరి ఉపాధి. అహంకార నాశంతో, నిత్యాత్మ ప్రకాశం కనుపిస్తుంది.

దేహమే సిలువ - మానవుని పుత్రుడైన జీసస్, అహంకారం "నేను శరీరము" అనే భావన. వానిని సిలువవేస్తే, అతడు ప్రదీప్తాత్మగా పునరుద్ధితుడై (Resurrected) దైవతనూజుడైన జీసస్ గా ప్రసిద్ధికెక్కాడు.

“నిజంగా బ్రతకదలిస్తే, ఈ బ్రతుకు వదిలేయ్".

## భాషణములు 397

భక్తుడు: ఉండము (non-existence) అన్న భావన భయకారణము. అది దేహానికి చెందినది. నిద్రలో శరీర స్పృహ ఉండదు. నిద్రయంటే భయపడరు. సరికదా, దాన్ని కోరుకుంటారు. మృత్యువంటేనో, పరమ భీతి. ఈ రెండు దృష్టుల్లో ఇంత భేదమెందుకు?

మహర్షి: నిద్రింపకోర్కె, మృత్యుభీతి - ఇవి మనోవృత్తి ధర్మాలేగాని అవస్థా ధర్మాలు కావు. శరీరం నిద్రలోనూ ఉంది, మేల్కొగానే మళ్ళీ కొనసాగుతుందని మనస్సుకు తెలుసు. అందువల్ల నిద్రయంటే భయం లేదు. ఆ స్థితిలో దేహం. లేకపోవడం వలనవచ్చే సుఖానుభవం అంటే ఇష్టం. సాధారణంగా మృతి అంటారే, దాని తరువాత తానుంటానన్న నమ్మకం లేనందునే, మృతి అంటే మనస్సు భయపడుతుంది.

## భాషణములు 398

దండపాణి, ఆశ్రమవాసీ, భక్తుడు. ఉత్తరభారత యాత్రకు పోయి అక్కడ నుండి 'మోడర్న్ సైకలాజికల్ రివ్యూ' పత్రికలోని ఒక వ్యాసభాగాన్ని పంపాడు. అందులో కార్యదక్షమైన హృదయ కేంద్రం వక్షానికి కుడివైపుననీ, శారీరకంగా మాత్రం ఎడమవైపున అనీ వ్రాసి ఉంది.

ఈ విషయంపై చర్చ సాగింది.

మహర్షి: యోగమార్గం షట్చక్రాలను గురించి చెబుతుంది. అభ్యాసంవల్ల అందొకొక్కటినీ చేరి, దాటిపోతూ చివర సహస్రారం చేరుకుంటే, అక్కడ అమృతం, దానివల్ల అమృతత్త్వం లభిస్తుంది. యోగులు పరానాడి ప్రవేశాన్ని ప్రశంసించారు. వారిప్రకారం, అది మూలాధారంలో మొదలవుతుంది. కాని జ్ఞానమార్గం అది హృదయంలో ప్రారంభమౌతుంది అంటుంది. ఈ రెంటికీ సమన్వయంగా అసాధ్యంగా కనబడినా, గుహ్యసిద్ధాంత రీత్యా ఆ సమన్వయం సాధించారు, యోగపరానాడి మూలాధారంనుండే, జ్ఞానపరానాడి హృదయం నుండే, అని, ప్రధానం పరానాడిలో ప్రవేశించటం. యోగాభ్యాసి క్రిందికి దిగి, పైకెగసి, చివరిగమ్యం చేరుదాకా సర్వత్రా సంచరిస్తాడు. జ్ఞానాభ్యాసి సూటిగా కేంద్రంలోనే స్థిరపడవచ్చు.

భక్తుడు: 'పరా' తర్వాత 'పశ్యంతీ' ఇత్యాదులు లేవా?

మహర్షి: నీవు వాక్కు విషయం చెప్పుతున్నావు. 1. పరా, 2. పశ్యంతీ, 3. మధ్యమా, 4. వైఖరీ అని వాని పేర్లు. వాక్కు ప్రాణశక్తి; మనస్సు తేజోరూపం, చిచ్ఛక్తి. అవ్యక్తంగా ఉన్న మనో రూపం యొక్క వ్యక్తరూపమే శక్తి.

సహస్రారం బుద్ధి కేంద్రం. దాన్ని సహస్రదళ పద్మంగా వర్ణిస్తారు. అక్కడ చేరుకోవడం అతి ప్రధానంగా యోగులు గణిస్తారు. వారిలో కొందరి అభిప్రాయంలో సహస్రారం పైగా ఉదాహరణకు దానికి నూరురెట్లు, నూట ఎనిమిదిరెట్లు లేదా 1,00,000 లేదా 100,000,000 దళాలున్న చక్రాలున్నాయి. ప్రస్తుతం వాటి విషయం వదలి వేస్తాం. ప్రాణప్రవాహం కపాలంలోని బ్రహ్మరంధ్రం ద్వారా శరీరాన్ని ప్రవేశిస్తుందని శ్రుతివాక్యా లుదహరిస్తూ వారు వాదిస్తారు. వియోగం (వేరు కావటం) రావటం ఆ దారిగా గనుక, ఆ దారినే పోకవల్ల యోగం (ఐక్యం) సమకూడాలి. అందుచేత యోగాభ్యాసంవల్ల ప్రాణాలన్నింటినీ సంకలించి, యోగ పారమ్యానికై సహస్రారం ప్రవేశించాలి. ఇది వారి వాదం. కాని దేహం ఉన్నదనీ, అది ఆత్మకు వేరనీ యోగి భావిస్తాడు. గనుకనే, ఐక్యానికై యోగాభ్యాస ప్రయత్నము చెప్పబడిందని జ్ఞానులు అంటారు.

నిజానికి దేహం మనోనిష్ఠం. దాని స్థానం మెదడు. ఆ మెదడు మరో చోటినుండి అప్పు తెచ్చుకొన్న కాంతివల్ల ప్రవర్తిస్తుంది. ఆ మటుకు బ్రహ్మరంధ్ర వాదాన్ని ఆ యోగులంగీకరిస్తారు. జ్ఞాని అంటాడు; చైతన్యాన్ని కాంతిని అప్పు తెచ్చుకొన్నది దాని మూలంనుంచే కనుక. ఈ అప్పు ఆధారాలు మాని సూటిగా అసలు మూలానికే వెళ్ళు. ఒక ఇనుము ముద్దనుండి ఒక గుండు కావలెనంటే, అది అగ్గిలో కాలి, ఎర్రనై, ముద్దనుండి వేరై, అగ్నిని విడిచి, చల్లబడాలి. ఆ మొదటి ముద్దలో కలిసిపోవలెనంటే మళ్ళీ అగ్నిలో కాగాలి. అలాగే ఏ కారణం వేరుచేసిందో ఆ కారణమే ఏకమూ చేయాలి.

ఒక ప్రతిబింబముంటే, దానికి మూలబింబం, నిమిత్తాలుగ సహాయకాలుగ సూర్యుడూ, కుండలో నీరు ఉండాలి. ఆ ప్రతిబింబం కనిపించకుండా ఉండటానికి, నీటి పైభాగాన్ని మూసివేయాలి. (యోగుల బ్రహ్మరంధ్ర ప్రవేశం వలె); కాకుంటే కుండలోని నీరును పూర్తిగా ఇంకించాలి. ఈ ఇంకింప చేయడాన్నే తపస్సు అంటారు. (తపోబ్రహ్మేతి). అంటే మెదడులోని ఆలోచనలను ఆపివేయడం జరుగుతుంది. ఇది జ్ఞానమార్గం.

పై చర్చలన్నిటికీ ఆధారం, ఆత్మకు అంటే బ్రహ్మమునకు జీవుడు భిన్నుడనే భావం. కాని జీవుడు భిన్నుడా? కాదంటాడు జ్ఞాని. ఆత్మ అనాత్మల మిధ్యా తాదాత్మ్యమే అహంకారం. పలువన్నెల తెరముందున్న స్పష్టమైన స్ఫటికంలాంటివాడు. స్ఫటికానికి ఏ రంగూ లేకపోయినా వెనుక తెరలోని ఎరుపు దాని ఎరుపుగానే భాసిస్తుంది. వెనుకనున్న రంగులను తొలగిస్తే స్ఫటికం స్పష్టంగా వెలుగుతుంది. అదే విధంగా ఆత్మ మరియు అంతఃకరణాలు. ఈ ఉపమానంగా ఇంకా అంతగా సరిగా లేదు. ఎందుకంటే అహంకారం యొక్క మూలం ఆత్మే. స్ఫటికంలోవలె అది, దాని వెనుక రంగువలే వేరు కాదు. దానిమూలం ఆత్మే కనుక తన మూలంతో లయం కావడానికి మనస్సును వెనుకకు మళ్ళించుటొక్కటే మార్గం. అహంకారం యొక్క అంతరం, లేక కేంద్రం, హృదయం. ఆత్మయన్నా అదే.

భక్తుడు: మార్గం వేరైనా, జ్ఞానులవలెనే యోగులుగూడ అనాహతచక్రం ప్రవేశించి హృదయ కేంద్రం సాధిస్తారా?

మహర్షి: అనాహతమూ హృదయ కేంద్రము సమము కావు. అలాగే అయితే వారికి సహస్రారందాకా సంచారం ఎందుకు? అదీగాక, ఆ ప్రశ్నకు కారణం మనలో జీర్ణించి యున్న భిన్నతా భావనే. హృదయ కేంద్రానికి మనమెప్పుడూ దూరంగా లేము. అనాహతానికి చేరినప్పుడూ, దాన్ని దాటిపైకి పోయినప్పుడు కూడ ఉన్నది హృదయ కేంద్రములోనే. తెలిసినా తెలియకున్నా ఎవడూ హృదయ కేంద్రానికి దూరం కాడు. యోగాభ్యాసవేళ గాని, విచార సమయాన గాని అతడా హృదయ కేంద్రంలోనే నిలిచియుంటాడు.

భ: మాకే సాధన మంచిది?

మ: సాధకుని సాధన సిద్ధునికి సహజం. సహజం ఆద్యస్థితి. అంటే నిత్యసత్యానుభవానికి గల అడ్డంకులను తొలగించటమే సాధన అవుతుంది.

భ: చిత్తైకాగ్రత ఆ సాధనలలో ఒకటా?

మ: ఏకాగ్రత, ఏకచింతన కాదు. మన సహజ స్వభావాన్ని మరుగుపరచే ఇతరాలోచనలు అన్నిటినీ తొలగద్రోయటమే దాని పని. మన యత్నాలన్నీ అజ్ఞానపు తెర తీయడానికే. ఇప్పుడు ఆలోచనల నణచటం కష్టమనిపిస్తుంది. జ్ఞాన స్థితిలో ఆలోచనలు రావటం కష్టతరమని తెలుస్తుంది. అప్పుడు ఆలోచింపవలసిన విషయాలే ఉండవు గనుక. విషయాలుంటేనే వాని గూర్చి ఆలోచనలు. విషయాలే లేనప్పుడు ఆలోచనలు అసలు రాగలవా?

ఆలోచించడం మనకెంతగా అలవాటయిందంటే, ఆలోచించకుండా అసలు ఉండలేమనిపిస్తుంది. ఇది తప్పని తెలుసుకుంటే, అనవసరంగా, లేనిపోని ఆలోచనలతో బాధపడేంత మూర్ఖుత్వం ఉండదు.

భ: అభ్యాసంకంటే అనుగ్రహం ఎక్కువ శక్తివంతం కాదా?

మ: గురువు అవిద్యానిర్మూలనానికి మాత్రమే సాయంచేస్తాడు. ఆత్మసాక్షాత్కారాన్ని నీచేతి కందిస్తాడా?

భ: మేము అజ్ఞానులము.

మ: ఆ మటుకు నీవు తెలివిగలవాడవే. నేను వెర్రివాడను అనేవాడు వెర్రివాడా? గుర్వనుగ్రహం, నీటినుండి నిన్నుద్ధరించడానికై చాచిన చేయిలాంటిది. అవిద్యా నిర్మూలనానికైన నీ మార్గాన్ని సుగమం చేస్తుంది.

భ: అది అవిద్యా రోగాన్ని కుదిర్చే మందువంటిదా?

మ: మందు దేనికి? రోగికి సహజంగా ఉన్న ఆరోగ్యం తిరిగి చేకూర్చడానికి. గురువు - అనుగ్రహము - దైవము, ఎందుకిన్ని మాటలు? గురువు నీ చేయి పట్టుకొని, చెవిలో రహస్యంగా ఏమైనా చెపుతాడా? గురువు నీవంటివాడే "

అనుకుంటున్నావు. నీవు దేహమే అనుకుంటున్నావు గనుక నీకు ఆయన దేహమే, ఏమైనా స్థూలంగా నీకు చేసిపెట్టడానికి. కాని ఆయన పని అంతా లోనే, గురుపెట్లు లభిస్తాడు? దైవము సర్వాంతర్యామి, తనకై తపిస్తున్న భక్తుడిపై దయతలచి, వాని అర్హత కనుగుణంగా వ్యక్తమౌతాడు. భక్తుడతన్ని మానవునిగా భావించి పరస్పర శరీరాలలాగే తాము ఇర్వురు మనకుంటాడు. కాని ఆత్మలేక, దైవావతారమైన గురువు అంతరాంతరాల్లో పనిచేసి, భక్తునిచేత వాని తప్పులు దిద్దించి, సరియైన మార్గంలో నడిపి, ఆత్మస్థితు డయ్యేదాకా సాయపడతాడు.

అటువంటి ఆత్మజ్ఞాన అనుభవం అయ్యేక శిష్యుడనుకుంటాడు -- "పూర్వం నేనెంతగానో కలవరపడ్డాను. ఇంతకూ, తన్నేదీ బాధించని ఆ మునుపటి ఆత్మనే నేను. ఇంత దాకా బాధపడుతూన్న వాడేడి? ఎక్కడా కనబడడం లేదే?"

ఇక మనం చేయవలసిందేమి? గురువుపదేశించినట్లు నడవడమే. నీ చేతన నంతా లోనికి మళ్ళించడమే. గురువు బయట, లోపలా కూడా ఉన్నాడు. వెలుపలి పరిస్థితులనంతా నిన్నంతర్ముఖుణ్ణి చేసేట్టుగా మలచి లోనివానిని నిన్ను హృదంతరంలోనికి లాగేట్టు సిద్ధం చేస్తాడు. ఇట్లుపై నుంచి ఒక త్రోపు, లోనుండి ఒక లాగు, దీనితో నీవు మధ్యలో స్థిరపడతావు.

నిద్రలో నీవు అంతస్థితుడవే. నిద్ర లేవగానే మనసు బయటకు వేరు వేరు విషయాలను ఆలోచిస్తూ, పరుగెడుతుంది. దాన్ని అదుపులో పెట్టాలి. లోనా బయటాగూడా, నిర్వహించే కర్తకే అది సాధ్యం. వానిని ఒక శరీరంతో గుర్తించగలమా? మన మనుకుంటాం. మన యత్నంతోనే సర్వ ప్రపంచాన్ని జయించగలమని. బయట భంగపడి, లోనికి తరుమబడి నప్పుడు, “ఓహో, మనిషికన్నా పెద్దశక్తి ఏదో ఉంది" అనిపిస్తుంది. అధిక శక్తుడైన ఆ దైవమున్నాడని ఒప్పుకోవాలి. మరియు గుర్తించవలసి వస్తుంది.

అహంకారం మత్తగజం లాంటిది. సింహమేగాని, మరెవ్వరూ దాన్ని అదుపు చెయ్యలేరు. ఈ సందర్భంలో సింహం గురువే. అతని చూపు చాలు, ఆ గజం గడగడలాడి చనిపోవడానికి. మనకు తరువాత తెలిసివస్తుంది, మనమంటూ లేకపోయిన ఆ తావే మన వైభవస్థానమని. ఆ స్థితినందుకోడానికై శరణాగతి చేయాలి. 'ప్రభూ, నీవే నాకు శరణ్య'మని, అప్పటి కతడు ఉపదేశానికి తగిన స్థితిలో నున్నాడని గురువు గుర్తించి, వానికి ఉపదేశమీయు పూనుకుంటాడు.

భ: ఆత్మార్పణ మంటే ఏమిటి?

మ: అది ఆత్మ సంయమనానికి సమానము. అహంకారాన్ని సూచించే సంస్కారాలను తొలగిస్తే ఆ సంయమనము కల్గుతుంది. ఉచ్చతమ శక్తిని గుర్తిస్తేగాని అహంకారం లొంగదు. దాన్ని గుర్తించుటయే స్వార్పణము, అణకువ, ఆత్మనిగ్రహము, అట్లుగాకుంటే, గోపురభారాన్నంతా తన భుజాలపైనే, మోయలేక మోస్తున్నట్టి భంగిమతో, చూపుతీరుతో, నున్న గోపుర ప్రతిమలాగా, అహంకారం తిష్ఠవేస్తుంది. 'ఆ ఉచ్చతమ శక్తి లేక ఒక్కడుగు వేయలేదు గాని, అంతా తన శక్తితోనే జరుపుతున్నట్లు అహంకారం వ్యవహరిస్తుంది.

భ: తిరుగుబాటు చేసే మనస్సును ఎట్లు వశపరచుకోవటం?

మ: దాని మూలాన్ని వెదుకు, అది కనబడకుండా పోతుంది, కాకుంటే, శరణాగతి చెయ్యి, ఉచ్చతమశక్తి దాన్ని అణగద్రొక్కుతుంది.

భ: కాని మనస్సు మన వశంలోంచి జారిపోతుందే.

మ: పోనీ, దాన్ని గురించి ఆలోచించక, నిన్ను నీవు కూడగట్టుకున్నాక నీకు స్మృతి రాగానే దాన్నిపట్టి అంతర్ముఖం చెయ్యి. అది సరిపోతుంది.

ప్రయత్నం లేక ఎవ్వరూ జయించరు. మనోనిగ్రహం, ఎవ్వరి జన్మ హక్కూగాదు. దాన్ని సాధించిన కొద్దిమంది దానికై దీక్షతో ఓపికతో పట్టుదలతో శ్రమించడం వల్ల సాధించారు.

రైలులోని ప్రయాణీకుడు మూటను నెత్తిన పెట్టుకొని మోస్తే, అది వాని తెలివితక్కువ. దాన్ని క్రింద నుంచినా, అది తనతోపాటు గమ్యం చేరుకుంటుందని వాడే గ్రహిస్తాడు. అలాగే మనమే కర్తలమని తలపోయక ఆ ఉచ్చతమశక్తి శరణాగతితో వుంటే మంచిదే.

భ: తత్త్వగురువు తన ఆధ్యాత్మిక శక్తిని, కావలసినంత మేరకు శిష్యునకందించగలడని స్వామి వివేకానందులు అంటారు.

మ: అదేమన్నా వస్తువా అందించడానికి? సంక్రమింపచేయడమంటే, శిష్యభావాన్ని తీసివేయడం. గురువట్లు చేస్తాడు. వ్యక్తి ఒకప్పుడొక రీతిగానుండి, ఆపై పూర్తిగా రూపాంతరం చెందుతాడని కాదు.

భ: అనుగ్రహం గురుప్రసాదం కాదా?

మ: దైవం, గురువు, అనుగ్రహమూ ఇవన్నీ సమానార్థకాలు. శాశ్వతంగా, సర్వత్రా వ్యాపించి ఉండేవి. ఆత్మ ఇప్పటికే లోనలేదా? అది దృష్టి సారణం వల్ల గురువు ఇవ్వాలా? గురువే అట్లనుకుంటే, అతడు గురువు అనిపించుకోడానికి తగడు.

శాస్త్రాలు పలురకాల దీక్షలను పేర్కొన్నవి -- హస్తదీక్ష, స్పర్శదీక్ష, చక్షుదీక్ష, మనోదీక్ష, ఇత్యాది గురువేవేవో క్రతువులు -- అగ్ని, జలం, జపం, మంత్రం మొదలైనవి -- జరిపి ఆ వింతైన కర్మలను దీక్షలంటారని ఆ గ్రంథాలే తెలుపుతాయి. గురువు అలాంటివి చేస్తేకాని శిష్యుడు పరిణతుడు కాడని వాళ్ళ ఊహ!

గురువుని వ్యక్తి అనుకొని వెదికితే ఎక్కడా కనబడడు. గురువు అట్టివాడు. దక్షిణామూర్తి అటువంటివాడే. ఆయన చేసిందేమి? మౌనంగా కూర్చున్నాడు; శిష్యులాతని ఎదుటనున్నారు. అతడు మౌనం వీడలేదు. శిష్యుల సంశయాలన్నీ విచ్ఛిన్నాలైనాయి. అంటే వారు తమతమ ప్రత్యేక వ్యక్తిత్వాన్ని కోల్పోయారన్నమాట. అదే జ్ఞానం, అంతేగాని, శబ్దజాలంతో చేసే గారడీ కాదు.

అన్ని పనులకూ అత్యంత సమర్థమైనది మౌనము. శాస్త్రాలు ఎంత విపులములూ సునిశ్చితార్థాలూ అయినా, ఫలప్రదాలు కాకపోవచ్చు. గురువు శాంత స్వరూపి అంతటా శాంతి వెల్లివిరుస్తుంది. శాస్త్రార్థాలన్నీ గుది గ్రుచ్చినా సరితూగనంత విస్తృతమూ సుదృఢమూ అయిన దాయన మౌనము. ఇక్కడ ఇంతకాలమున్నాము. ఎన్నెన్నో విన్నాము, ఎంతగానో సాధన చేశాము. కాని లేశమైన లభింపలేదన్న ఆర్తభావము, ఇన్ని ప్రశ్నలకూ కారణము, లోపల జరిగే మార్పు పైకి కానరాదు. నిజానికి గురువున్నది నీలోనే.

"ప్రభూ! అన్ని జన్మలలో నాతోనే వస్తూ, ఎన్నడూ చేయివీడకుండ చివరకు నన్నుద్ధరించువాడా!" అన్నారు తాయుమానవరు. ఆత్మానుభవ మహిమ అబ్బెది.

దానినే భగవద్గీతలో మరోవిధంగా వర్ణించారు. 'మన ఇద్దరం ఇట్లుండటం ఇప్పుడే కాదు. ఇంతకు ముందు ఎప్పుడూ ఇలాగే వున్నాము.

భ: గురువున కెప్పుడూ స్థూలరూపమంటూ లేదా?

మ: స్థూలరూపమంటే? నిన్ను ఈ దేహమనుకొన్నావు గనుకనే ఈ ప్రశ్న. నీవు దేహమా? కనుక్కో

"పరం భావం అజానంతః" (9-11) అన్నది భగవద్గీత.

"మానుషాకృతి నున్న నన్ను, నా పరతత్త్వ మెరుగనేరక మానవునిగనే భావించువారు మూఢులు, అజ్ఞాన మోహితులు" అంటాడు శ్రీకృష్ణుడు.

ఆ అవిద్యను నివారించుకొరకే గురువు వచ్చేది. తాయుమానవరన్నట్లు, అడవి జింకను పట్టుకొనడానికి మచ్చిక జింకను చూపి వంచించేట్లు అజ్ఞానవిష్టమైన దేహాత్మబుద్ధిని తుడిచివేయడానికి మానవ రూపంతో గురువు సాక్షాత్కరిస్తాడు.

## భాషణములు 399

శ్రీబోస్, బెంగాలీ ఇంజనీరు. అప్పటికి గౌడపాదకారికలను, శ్రీ రాధాకృష్ణ పండితుల 'భారత వేదాంత' (Indian Philosophy) గ్రంథమును చదివియున్నాడు. అందుచేత ఈ విధంగా ప్రశ్నించాడు:

భక్తుడు: స్వప్నానుభూతికి, జాగ్రదవస్థకూ భేదమేమైనా నిజంగా ఉందా?

మహర్షి: జాగ్రదావస్థలోని వానితో పోలిస్తే, నీ స్వప్న కల్పనలు తాత్కాలికాలుగా తోస్తాయి. అది కారణంగా రెండూ భిన్నాలన్న భ్రమ; అంతేగాని నిజంగా అట్టి భేదమేమి లేదు.

భక్తుడు: జాగ్రదావస్థ వాస్తవిక విషయ ప్రమేయం లేకుండా ఉండగలదా?

మహర్షి: అలాగే అయితే, చూసేవాడు లేకుండానే విషయాలు ఉండాలి. అంటే ఆ విషయాలు ఉన్నాయని తాముగానే ప్రకటించుకోవాలి. అలాగే జరుగుతున్నదా? ఉదాహరణకి నీ ఎదుటే ఒక ఆవు తిరుగుతున్నది అనుకో. తాను తిరుగుతున్నానని అది నీకు చెబుతున్నదా? 'అదిగో ఆవు తిరుగుతున్నది' అని నీవంటావా? చూచి, గ్రహించే వాడుంటేనే విషయాలకు అస్థిత్వం.

భ: బ్రహ్మము (రియాలిటీ అబ్సల్యూట్) దృష్ట్యా, జాగ్రత్ స్వప్నాలకు ఏ తేడా లేదని గౌడపాదులు మాండూక్యకారికల్లో అన్నారు.

మ: నిజమే, ఏ తేడా లేదు.

భ: భగవాన్ కూడా అట్లంటారనే నా నమ్మకము. బ్రహ్మసూత్ర భాష్యంలో శ్రీశంకరులు ఆ రెండవస్థల్లో భేదం పాటించారని ప్రొఫెసర్ రాధాకృష్ణన్ తమ "ఇండియన్ ఫిలాసఫీ గ్రంథం'లో వ్రాసారు. అది నిజమా? నిజమైతే, ఆ భేదం ఎలాంటిది? సత్య వస్తువు దృష్ట్యా ఏ భేదమైనా ఎలా ఉంటుంది? ఏ రూపంలోనైనా మనస్సుంటే గదా, ఈ భేదభావన ఉండేది? ఆత్మదృష్ట్యా, అద్వైత బ్రహ్మ దృష్ట్యా, ఈ భేదముండగలదా?

మ: మేల్కొని ఉన్నాననేవాడికే కల. యథార్థంగా స్వప్న జాగ్రత్తులు రెండూ పరమసత్యంతో పోలిస్తే మిధ్యే.

భ: అద్వైతంలో, పరిణామవాదానికీ, సృష్టి, వ్యక్తీకరణలకూ ఏమైనా తావున్నదా? త్రాడు, పాముగా ఎలా అయితే కనిపిస్తుందో, అలాగే బ్రహ్మము తన నిజస్వరూపాన్ని మర్చిపోకుండా (కోల్పోకుండా) ఈ ప్రపంచంగా కనిపిస్తుందని వివర్త వాదము. దాని విషయము ఏమిటి?

మ: జగత్తు, మిథ్యయని నిరూపించే మార్గాలు చాలా ఉన్నాయి. వానిలో కల ఒక ఉదాహరణ. జాగ్రత్ స్వప్న సుషుప్త్యవస్థలు మూడింటిలో చాల విపులంగా చర్చించడానికి కారణం, శ్రుతులా మూడింటికీ ఆధారమైన సత్యాన్ని

ప్రకటించడమే. ఆ మూడవస్థల్లోని పరస్పర భేదాలను విమర్శించే ఉద్దేశ్యము కాదు. అసలుద్దేశ్యాన్ని మనం స్పష్టంగా గుర్తించాలి.

జగత్తు మిథ్యయని వారన్నారు. మీ మిథ్యాత్వములో దశలూ, అంతర్దశలూ ఉన్నయా? అవి వంధ్యాపుత్రుని (గొడ్రాలి బిడ్డ)లాగా, గగన కుసుమంలాగా, నిజం ఏ మాత్రంలేని అవాస్తవిక పదాలేనా? కాని ఈ ప్రపంచం నిజం. కేవలం శబ్దజాలం కాదు. సమాధాన మొకటే. గ్రుడ్డి వెలుగులో చుట్టలు చుట్టియున్న త్రాడులోని సర్పాభాసంగా అది సత్యంపై ఆరోప మాత్రమే.

ఇక్కడగూడా అది త్రాడేయని మిత్రుడు తెలపగానే, సర్పమన్న మిథ్యారోపం ఎగిరిపోతుంది. కాని ప్రపంచ విషయంలో మాత్రం, అది మిథ్యయని తెలిసిన తర్వాత గూడ, ప్రపంచం సత్యంగానే కనబడుతుంది. అదెట్లు? అంటే, మరుమరీచికలాగా, అది నీరు కాదని తెలిసినా, నీటి వలె కనబడటం మానదు. ప్రపంచమూ అంతే. అది అబద్ధమని తెలిసినా, నిజంవలె తోస్తోనే ఉంటుంది.

మరుమరీచికలోని నీటిని, దాహం తీర్చడానికై ఎవ్వరూ ఆశించరు. అది భ్రాంతి యన్నంతనే అక్కరకు రాదని వదలివేస్తారేగాని, అక్కడికి నీటికై పరుగెత్తరు.

భ: ప్రపంచంలో అట్లు కాదుగా. అది అబద్ధమని ఎంత ఘోషించినా, అచటనే జనులు తమ కోర్కెలు తీర్చుకోవడం మానలేరు. మరి ప్రపంచం మిథ్య ఎట్లయింది?

మ: కలలోని కోరికలను కలలోని పదార్థములతో తృప్తిచేసినట్లు, విషయాలున్నవి, కోరికలున్నవి, కోరిక తీరుట ఉంది. జాగ్రత్ ప్రపంచంలోవలె కలలోని కల్పనలు గూడ ప్రయోజన ముద్దేశించినవే. కాని అవి యథార్థాలనుకోము. అయథార్థంలోని, వివిధ దశలను చిత్రించడానికే పై నిచ్చిన ఉదాహరణలు. జాగ్రదావస్థలో స్వప్న ప్రపంచం వలెనే, జ్ఞానం కల్గిన స్థితిలో జగత్తు కూడ మిథ్యయే అని జ్ఞాని చాటుతాడు.

ప్రతి ఉదాహరణాన్ని సందర్భాని కుచితమైనట్లుగా అర్థం చేసుకోవాలి. దేనికదిగా వానిని వేర్వేరుగా నిర్ధారించగూడదు. అది గొలుసులో లంకెబిళ్ళ (లింక్) వంటిది. వాని ఉద్దేశ్యమూ, వాని యన్నింటికీ ఆధారభూతమైన సత్యానికి అనుగుణంగా సాధకుడి మనస్సు మళ్ళించడమే.

భ: ప్రొ॥ రాధాకృష్ణన్ నొక్కి పలికినట్లుగా గౌడపాదుల వాదంలో శంకరుల వాదంలో భేదముందా?

మ: అది మన అపోహ మాత్రమే.

భ: శ్రీ రాధాకృష్ణన్ లిట్లు వ్రాసారు - "బంధము, ముక్తి, జీవాత్మ, జగత్తు ఇవన్నీ మిథ్యలన్న భావమే ప్రచురంగా ఉన్న శ్రీ గౌడపాదుల వాదన, నిశిత విమర్శ ఇలా వస్తుంది: ఒక మిథ్యాత్మ, మరొక మిథ్యయైన నిశ్రేయస్సునుండి తప్పించుకొనేందుకు తిరుగుతోంది అనడం కన్నా వేరేమీ చెప్పలేని తత్త్వదర్శనం. బహుశః ఈ సిద్ధాంతము కూడా మిథ్యయే? నిర్వికారమైన సత్యం, తన స్వరూపం నిలుపుకుంటూనే, అనుదినం మారుతున్న జగత్తుగా ప్రసరించడం అనూహ్య మనడం, ఒక ఎత్తు; మార్పునొందుతున్న జగత్తు సర్వమూ మృగతృష్ణయే అని నిరాకరించడం, మరొక ఎత్తు, ఇదంతా వట్టి బూటకం, ఫలం శూన్యం అని నమ్ముతూ, జీవిత నాటకంలో మన పాత్ర సరిగా నిర్వహించటం సాధ్యమయ్యే పనిగాదు. ఇట్టి సిద్ధాంతాల తోడి ఏ వేదాంతమూ తాను సరిగా ఉన్నానని తృప్తినొందలేదు. వాని విలువలు, ఆ సిద్ధాంతం యొక్క అస్తిత్వమే తప్పు అని సిద్ధాంతీకరిస్తూ అట్టి విషయాలతోనే మనం జీవితం వెళ్ళద్రోయవలెననే వాదానికి వేరే ఖండన మెందుకు? ఈ ప్రపంచం సర్వం స్వప్నమేయని త్రోసివేయకుండా, దాన్ని కలుపుకొని అధిగమించే పరమార్థమేదో ఉన్నదని ఆ వాదమే తెలుపుతున్నది."

మ: మునుపు నేనన్నట్లు అవస్థాత్రయానికి, జగజ్జీవేశ్వరులకూ, అన్నిటికీ ఆధారభూతమైన సత్యాన్ని ప్రపంచించడమే తత్త్వశాస్త్రోద్దేశ్యం.

దీనిని మూడు విధాలుగ చూస్తారు

1. వ్యావహారిక దృష్టి: బహురూపాలు భాసిస్తూన్న జగత్తును చూచి, సృష్టి కారకునొకణ్ణి ఊహించి, అతనిని కర్తగా నమ్ముతాడు. ఫలితంగా జగత్తు జీవుడు ఈశ్వరుడూ, ఈ ముప్పురూ మిగులుతారు. సృష్టి కారణుని నిశ్చయించుకొని అమరత్వాన్ని కోరి, వానిని చేరుకొన యత్నిస్తాడు. ఆ రీతిగా ఏ ఒకడో ముక్తుడైతే, ముక్తులుకాని ఇతరులు ఎప్పటివలెనే ఉన్నారు. వారు, ఎవరికి వారే ముక్తిని సాధించుకోవలసి వుంది. ఈ విషయాలన్నింటికి ఆధారం ఒకటేనని సాధారణంగా అందరూ ఒప్పుకుంటారు. ఈ విషయాలన్నీ మాయా కల్పితాలు. మాయ ఈశ్వరుని శక్తి, అంటే దైవచేతన. ఈ విధంలో, నానా జీవాత్మల, నానావిషయాల ఉనికి, అద్వైత దృష్టికి అడ్డురాదు.

2. ప్రాతిభాసిక దృష్టి: జగజ్జీవేశ్వరులను ముప్పురినీ చూచేవాడొకడే. వానిని కాదని అవేవీ స్వతంత్రించి లేవు. కాబట్టి వ్యక్తిలో ఉండనీ, ఈశ్వరునిలో ఉండనీ, ఉన్న జీవుడొక్కడే. ఇతరమంతా అభూత కల్పన.

3. పారమార్థిక దృష్టి: దీన్నే అజాతవాదమంటారు. ఇది ద్వితీయాన్ని అంగీకరించదు. సత్యమూ లేదు, సత్యాభావమూ లేదు. అన్వేషణ లేదు, పొందేదేమీ లేదు. బంధము లేదు, ముక్తీ లేదు, మొదలైనవి.

అయితే ఈ శాస్త్రాలన్నీ దైవాన్ని సృష్టికర్తగా ఎందుకు పేర్కొన్నవని ప్రశ్న. సృష్టించబడ్డ నీవు, సృష్టించే వాడిని సృష్టించి, జగజ్జీవేశ్వరులు మనో కల్పితాలే అని వాదించడం ఎలా సాధ్యం.

పైవాదానికి సమాధానము ఇట్లు

---

జాగ్రత్తులోని నీకు తెలుసు నీ తండ్రి చనిపోయి ఎన్నో ఏండ్లయినవని, కాని కలలో నీవతన్ని చూస్తావు. నీ తండ్రియనీ, పితృధనం నీకు కొంత ముట్టచెప్పినాడని గుర్తిస్తావు. ఇక్కడ తండ్రి (స్రష్ట) తనయుని (సృష్టిలో) ఉన్నాడు. నీకు కల వస్తుంది; అందులో నీవొక రాజోద్యోగివి. పాలనా వ్యవస్థలో నీవూ ఒక పాత్ర నిర్వహిస్తున్నావు. కాని నీవు లేవగానే అదంతా మాయమై, ఒంటిగా మిగిలియుంటావు. కలలోని వాళ్ళందరూ ఎక్కడివారు? నీలోనివారేగా? ఈ ఉపమానమే ఇతర విషయాలకూ వర్తిస్తుంది.

భ: వ్యావహారిక మంటారే, దానిలో మాయ ఎట్లు వస్తుంది?

మ: మాయ కేవలం ఈశ్వర శక్తి, లేదా సత్యం యొక్క కార్యక్రమం.

భ: అది సచేతనం ఎందుకు కావాలి?

మ: ఆ ప్రశ్నకు తావేది? దాని ఆవరణలో వాడిపే నీవూనూ, ఆ విశ్వచైతన్యానికి వేరుగా నీవు నిలబడగలవా? ఆ ప్రశ్న అడిగేందుకు? అట్టి సంశయాలు మాపేందకు ఆ శక్తియే నిన్నిట్లు ప్రశ్నింప చేస్తున్నది.

భ: స్వప్న ప్రపంచము జాగ్రత్ ప్రపంచమువలె ప్రయోజకముగాదు. అచట కోరికలు ఫలించాయన్న తృప్తి ఉండదు.

మ: నీవన్నది సరికాదు. కలలోగూడ ఆకలి దప్పులున్నాయి. నిద్రపోక ముందు నీవు సుష్టుగా తిని, ప్రొద్దుటికి గూడ దాచి పెట్టుకొని ఉండవచ్చు. కాని కలలో నీకు ఆకలి అవుతుంది. నీవు దాచి పెట్టుకొన్న అన్నం అక్కడ అక్కరకు రాదు. నీ కలలోని ఆకలి కలలోని ఆహారంవల్లనే తీరాలి. స్వప్నకాంక్షలు స్వప్నకల్పితాలవల్లనే తీరుతాయి.

భ: జాగ్రత్తులో కలలను జ్ఞప్తికి దెచ్చుకోగలము. కాని జాగ్రత్తులోనివి కలలో తెలీవు.

మ: అదీ పొరబాటే. ఇదుగో ఇపుడు మాట్లాడుతున్నావే, ఆ నువ్వే, కలలోని నీతో సమన్వయిస్తావు.

భ: కాని, ఇప్పుడు జాగ్రత్తులోవలె కలలో, మేల్కొనడాన్ని కలలు కనడాన్ని వేరుగా చూడమే.

మ: కల, జాగ్రత్ సుషుప్తుల కలయిక. అది జాగ్రదావస్థలోని సంస్కారాల ఫలితము. అందుచేతనే మనం కలలను, మేల్కొన్న పిదప స్మృతికి దెచ్చుకొనే వీలవుతుంది. సంస్కారాలు మరో విధంగా కలుగవు. అందువల్లనే కలా, మెలకువా రెండూ ఒకే మారు మనకు తెలియవు. అలా అయినా కలలోని కొన్ని వింతలను, అస్తవ్యస్తాలను జ్ఞాపకము దెచ్చుకుంటాము. కల గంటున్నానా, కాక నిజంగా మేల్కొనే యున్నానా అని విస్తుపోవడమూ ఉంది. మనలో మనం తర్కించుకొని చివరకు మనం మేల్కొనే ఉన్నట్లు నిర్ణయిస్తాము. నిజంగా మేలుకొన్న పిదప అదంతా కలయే అని కనుగొంటాము.

భాషణములు 400

రూపభ్రమలు (ఫోటిజమ్స్) ధ్యానం అంటే ఆసక్తిని హెచ్చిస్తాయి. అంతకంటే అవి చేయగల్గిన దింకేమీ లేదన్నారు శ్రీభగవాన్.